# ఒంటరి జీవితాలు

నవల



రచన : పెర్రీబర్గెస్

అనువాదం : సుభద్రానందన్ పాల్




పబ్లిషర్సు

ఉమాపబ్లిషర్సు, విజయవాడ.

# ఒంటరిజీవితాలు

## *Who Walk Alone*

By Perry Burgess

Translated into Telugu

*by Subhadranandan Pal*

# మొదటి ప్రకరణం

నాజీవితాన్ని ఆఖరుకి తీసుకువచ్చే 'ఆసంఘటన' ఎప్పుడు, ఎక్కడ, జరిగిందో నాకు తెలియదు. దానిని తెలిసికోవడం కూడా అసంభవమే. నేను (Corolado Volunteers) కొలరాడో వలంటీర్లదళంతో (Philippines) ఫిలిప్పైన్ దీవులలోని 'కేవైట్' (Cavite) లో దిగినప్పటికీ 'ఫిలిప్పైన్ తిరుగుబాటును' అణచివేసి, ఇంటికి ప్రయాణమైనప్పటికీ మధ్యమాత్రం ఈసంఘటన జరిగినట్లు నిశ్చయంగాచెప్పగలను. ఇది జరిగినట్లు కూడా తొమ్మిది సంవత్సరాలు గడచిన తరువాత కాని నాకు తెలియనేలేదు!...

1898 వ సంవత్సరపు వసంతకాలంలో నేను కాలేజీలో మూడవ సంవత్సరం చదువుతూన్నాను.

ఆ రోజున నేను నాగదిలో కూర్చుని రసాయనిక శాస్త్ర గ్రంథాన్ని తిరుగవేస్తున్నాను ఎడభోజనాల గంటకోసం ఎదురు చూస్తూ అంతలోనే గంట మ్రోగింది. ఆవులిస్తూ నేను లేచాను. ఆ నాడు వసంతకాలపు శిక్షణకోసం మా ఫుట్ బాల్ శిక్షకుడు మమ్మల్ని వేళ కాని వేళ మైదానంలోకి తీసుకు వెళ్ళాడు, అయినా గంట చాలా పెంద్రాళే మ్రోగినట్లు నాకనిపించింది. ఇంతలోనే ఎక్కడినుంచో సైరన్ మ్రోత వినిపించింది. వెను వెంటనే చర్చి గంటలు ప్రారంభమయాయి.

ఏమి జరుగుతూందో చూడాలని నేను వేగంగా మేడ మెట్లు దిగుతూన్నాను. ఆఖరిమెట్టుమీదకి రాగానే నాయూమ్

మేట్ బాబ్ సెల్లర్స్ నన్ను గట్టిగా పట్టుకొని "నెడ్, మనం సిద్ధంగావుండాలి; స్పెయిన్ మీద యుద్ధం ప్రకటింపబడింది!" అన్నాడు. మేము మాకాలేజి ఆవరణలో పలికి పరుగెత్తాం. విద్యార్థులు అన్ని వైపులనుండీ వస్తూన్నారు. ఒక వైపునుంచి బాండ్ వినపడుతూండగా మేమందరం ఒకరివెనుక ఒకరు వరుసలుగా నిలుచున్నాం, మా కాలేజీలో వుండే దాదాపు ఐదు వందల మందీ ఆవరణలోపలికి వచ్చిచేరారు.

అంతవరకూ ఏవేవో వరుసలు పాడుతూన్న బాండ్ దళం, దళనిర్వాహకుడైన డెక్స్టర్ (Dexters) ఏదో చెప్పగానే దళమంతా "పాతపట్నంలో బాహీ బాహీ యుద్ధం జరుగబోతూంది రాత్రి" అనే పాటని అందుకొన్నది!

మేమందరు వెర్రివాళ్లైనాం. పట్టణ వీధులగుండా వరుసలుతీరి మేము నడుస్తూండగా వీధి కిరువైపులా ప్రజలు బారులుతీరి హర్షధ్వానాలుచేశారు.

మన ఓడల్ని ముంచేసారా? (Cuba) క్యూబా అనే చిన్నదీవిని పాడు చేస్తారూ? చిట్టచివరకు స్పెయిన్ దీనికి తగిన మూల్యం చెల్లించ బోతూంది – విద్యార్థులందరం శక్తిమంతులు గూడా దీనికి తోడ్పడబోతూన్నాం.

ఈ సమయానికి వేచియుండవలసిన అవసరంకూడా లేకపోయింది. డెభ్భైఐదువేల స్వచ్ఛంద సైనికులు కావాలని అమెరికా పభుత్వం కోరింది. కొలరెడోలో (Colorado) ఒక సైనిక దళం ప్రారంభింపబడింది. మాలో చాలమంది అందులో

చేరాం. త్వరలోనే మాకు తర్ఫీదు ప్రారంభింపబడింది. తుపాకిని ప్రేల్చడం మాత్రం మాకు చేతనవును. అంతే. సైనిక శిక్షణలో మాకు తెలిసినదల్లా ఇది ఒక్కటే !

మా శిబిరములో చాలావారాల పాటు శిక్షణపొందు తూండగా, బహుశా మేము ఫిలిప్పైన్ దీవులకి వెళ్ళవలసి వుంటుందనే వదంతి మాకు చాలా ఆతురతను కలిగించింది. అంతలో మాకు మూడు రోజులపాటు ఇంటికి వెళ్ళడానికి సెలవు మంజూరు చేయబడింది. అంటే త్వరలో మేము యుద్ధరంగానికి వెళ్ళబోతూన్నా మన్నమాట !.

నాకున్న సెలవు మూడు రోజులే ఐనా వాటినే బాగా గడిపాను. మాతలిదండ్రులు వుంటూన్నది. మిస్సూరిలోని (Missouri) ఓజార్క్స్ (Ozarks) పర్వతసాను ప్రదేశంలో, అక్కడకి సమీపంలో, అనగా పదిమైళ్ళలోవున్న ఎదైన పట్టణం అనేది జరీకా.

ఎవరో మహారాజుని చూడటానికి వచ్చినట్లు నన్ను చూడటానికి అందరూ స్టేషన్‌కివచ్చారు. మా అమ్మతో, టామ్ మేబెల్ కూడా వచ్చారు. మా నాయన ఎంతో గర్వంతో ఛాతీ బయటకు కనపడేలా, ఠీవిగా నిల్చునివున్నారు. మా ఇల్లు ఒక్క మైలు దూరంకూడా లేక పోయినా అందరూ గుర్రపు బగ్గీమీద స్టేషన్‌కె వచ్చారు. గుర్రాల కాపరి ముసలి వాష్ (Wash) గుర్రాల దగ్గరగానిల్చుని, ఒక సామ్రాజ్యానికి అధి నేతలావున్నాడు ! ఆనాడు కాలక్షేపానికి స్టేషన్‌కి వచ్చే జనం కూడా మా మూలుకంటె ఎక్కువగా ఉన్నారు. నేను డాగడం

కోరుతూ తలవంచుకొను తరికి మా నాయన ముందుకు వచ్చి నన్ను కౌగలించుకొన్నారు. మా అమ్మ తన రెండుచేతులతో నన్ను దగ్గరకితీసుకుంది. నా శరీరం గగుర్పొడిచింది. అంతకు ముందు ఆటలలో నా చేత నానాతిప్పలూతిన్న టామ్ (Tom) మేబెల్‌లు (Mabel) ఇద్దరూ నేను వారికి పెద్దన్నయ్య ననే మాట మరచిపోయినలాగు ఎవరో పరాయివాణ్ణి చూచినట్లు దూరంగా నిలుచుని చూస్తున్నారు.

నేను ఇంటి దగ్గరవున్నది రెండు రోజులు, ఆ తరువాత జెనరల్ గ్రీన్ (Greane) పతాక నౌక 'చైనా' మీద దాదాపు వేయిమందిగల మా పటాలం బయలుదేరింది, జెనరల్ గ్రీన్ పతాక నౌక మా నౌకా దళంలో అత్యుత్తమ మైనది. 'కొలరెడో వలంటీర్స్' అనే మాపటాలం, యునైటెడ్ స్టేట్స్‌కి చెందిన పదాతి దళంలో సగభాగం, యునైటెడ్ స్టేట్స్ ఇంజనీర్ల దళానికి చెందిన కొంతమంది, మా నౌకలోవున్నవారు.

మా నౌక పశ్చిమంగా ప్రయాణం సాగిస్తుంది. 'చైనా' 'సెనేటర్' నౌకలు అఖాతంలో ప్రవేశించాయి, నౌకలో క్రిందుండు ఇంజనులకు దుప నౌక పైభాగంలో నిలుచున్న నాకు చేతినాడి వలె తెలుస్తుంది.

చెవులు గింగురుమనేలా పెట్టిన ఈల కూతకి మా నౌక కంపించిపోయింది. ఆ కూతకి నౌకా శ్రయంలోవున్న నావలన్నీ చేరాయి నాలుగువేల యోధులతో మా దళం మనిలా (Manilai) కు ప్రయాణం సాగించింది. 'కొలన్' (Colan)

'జిలాండియా' (Zealondia) నౌకలు మా వెనుకవస్తున్నాయి మేము 'స్వర్ణద్వార' (Galden Gate) వైపు సాగిపోయాము.

మనిలా అఖాతపు (Manila Boy) ముందు భాగం ఒక గొప్ప మరకతంలా పచ్చగా మాకు కనుపించింది. మేమందరం ఓడపై భాగానికి చేరి ఈ దృశ్యాన్ని కన్నుల పండువుగా చూస్తూన్నాం. 'ఈ అఖాతం భలే సుందరంకదూ?' అన్నాడు బాబ్.

ఈ అఖాతం గుండా ముందుకు వెళుతూంటే పదిహేను మైళ్ళ వరకూ ఆవలిభాగాన్ని ఎత్తైన భూభాగ మేదీ కనుపించనే లేదు. అక్కడకి దాదాపు ముప్పై మైళ్ళ తూర్పులోవున్న మనిలా వైపు మా ప్రయాణం సాగించాం. (Luzon) లూజాన్ మెట్టు భూమి మా ఎడముడి అసలు అక్కడ యుదం జరుగు తూన్నదా అనే సందేహం మాకు కలిగింది. మా ఓడ తీరాన్ని సమీపించగానే మా కోసం సందేశ కాదు నావలు ఎదురు వచ్చాయి, వీటి ద్వారా మాకు ఇంకా యుద్ధం జరుగు తూన్నట్లు తెలిసింది.

ఈ నావలు మమ్మన్ని కేవైట్ (Cavite) కి చేర్చాయి నౌకా శ్రయంలో ప్రశాంతమైన నీటి పైన యుద్ధంలో ముంచి వేయబడకుండా మిగిలివుండిన స్పానిష్ ఓడలు తమనల్లటి అడుగు భాగాలతో తేలియాడుతూన్నాయి. ఆ నాటి రాత్రి మేము అక్కడ విడిది చేయగానే మొట్ట మొదటిసారిగా భూమధ్య రేఖా ప్రాంతపు కుంభవృష్టిని చవిచూచాం. కుండ పోతగాపోసే ఆ వర్షంలో మా చిన్న చిన్న గుడారాలు దుప్పట్లు తడిసి ముద్దై

పోయాయి. ఆ బురదలోనే మేము అటూ ఇటూ తిరగవలసి వచ్చింది. మాకు వంటలు తయారు చేసే వంటవాళ్ళు కళ్ళు చిల్లులు పొడుచుకున్నా మంట మండ లేదు.

ఉదయానికి పూర్తిగా వర్షం తగ్గిపోయి, సూర్యుడు తీక్షణంగా ప్రకాశిస్తూన్నాడు, ఆ వేడికి మాకు హాయి హాయని పించింది. అక్కడ నుంచి కొద్ది రోజులలో మనిలా వైపు సాగి పోయాం. నగరపు 'గోడల మధ్య' స్పానిష్ సైనికదళం బంధింప బడింది. గోడల మధ్య అని దానిని వారు పిలిచారు. అంటే తప్పించుకు పోవడానికి వీలు లేకుండా పట్టుబడ్డారు అని దానికి అర్థం.

నిజంగా చెప్పుగోదగిన యుద్ధంకానే లేదు స్పానిష్ సైన్యంలోగాని, మాదళంలోగాని ప్రాణాల్ని పోగొట్టు కొనడం అనవసరమే అనిపించింది. స్పానిష్ దొరలు తప్పించుకు పారిపోవ డానికి ఎక్కడా అవకాశంలేదు. వెనుక భాగంనుంచి ఫిలిప్పైన్ పటాలాలు, సముద్రపు టొడ్డునుంచి అమెరికా పటాలాలు నౌకలు వారిని చుట్టుముట్టాయి.

ఎప్పుడైతే నగరం మాకు లుంగిపోయిందో ఇక మేము మా ఇళ్ళకి వెంటనే వెళ్ళి పోవచ్చునేమో అనుకొన్నాము. ఒక విధంగా చూస్తే ఇంతత్వరలో తిరిగి వెళ్ళిపోవడం మాకు నిరు త్సాహం కలిగించింది. ఎందు చేతనంటే ఫిలిప్పైన్ దీవులని మేము పూర్తిగా చూడనే లేదు. మేము చూచినదల్లా మనీలా నగరానికి మధ్యగా ప్రవహిస్తూన్న (Pasing River) పాసింగ్ నదికీ, సముద్రపు టొడ్డుకి మధ్యనున్న ప్రదేశం. కాని మేమను

కొన్నట్లు త్వరగా ఇంటికి తిరిగి వెళ్ళిపోకుండా చాలా రోజుల వరకు అక్కడే వుండిపోయాము. ఫిలిప్పైన్ సైన్యంతో కొట్లాట జరిగే సూచనలు కూడా కనుపిస్తూన్నాయి.

వేసవిగడచి శరదృతువురాగా (Fall=autrmn) ఫిలిప్పైన్ సైన్యాల ఉగ్రత ఎక్కువైంది మరింత తీవ్రరూపం ధరించాయి. నగరం చుట్టూవుండే ప్రహారీ గోడకు బయటవుండే పాత కంకాలని నింపడంలో మేము నిమగ్నులమైనాము. వైద్యదళానికి చెందిన యువకులు మాకు అండగా వున్నారు. మసూచి, టైఫాయిడ్, కలరా తీవ్రంగా వ్యాపించాయి. మేము త్వరలో తిరిగి వెళ్ళి పోయే సూచనలేమీ కనుపించలేదు. ఆఖరికి ఫిలిపైన్ సైనికులు ఆయుధాలు, ధరించి మా శ్రేణిలో ప్రవేశింప రాదని తాఖీదు జారీ చేయబడింది.

ఈ తాఖీదు జారీచేయబడిన కొద్దిరోజులలో, ఫిబ్రవరి నాలుగవతేదీని అర్ధరాత్రివేళ నెబ్రాస్కా-వలంటీర్ (Nebraska Volunteers) దళానికి చెందిన ఒకసైనికుడు ఒకవంతెన సమీపంలో కావలికాస్తుండగా ముగ్గురు ఫిలిప్పైనో సైనికులు హద్దు మీరి మా వైపుకు దాటివచ్చారు. కావలికాస్తున్న సైనికుడు హెచ్చరికచేసినా ఆగకుండా వాళ్ళు ముందుకు సాగివస్తున్నారు. తక్షణం ఆ సైనికుడు తుపాకి పేల్చాడు. ఆ ముగ్గురిలో ఒకడు గుండుదెబ్బతగిలి పడిపోయాడు. అంతే, మరుక్షణంలో ఇరు పక్షాలు కాల్పులు సాగించాయి. ఇన్నినెలలుగా అణగివున్న ద్వేషాలు ఇరుపక్షాలలో ఒకసారిగా తమ విషపుకోరల్ని తెర

చాయి. ఇదీ నిజమైన యుద్ధం. మరునాటి ఉదయానికి అమెరికన్ సైనికులు నదినిదాటి లోపలి ప్రాంతానికి చేరుకొన్నారు.

సైనిక పునర్నిర్మాణం ప్రారంభమైంది. తాత్కాలికంగా సైన్యంలో పనిచేయడానిని మా ఒడంబడిక కాలం గడువు ముగియగానే, శాశ్వతంగా సైన్యంలో చేరిపోవడానికి మా అంతట మేము ముందుకువచ్చాము. అనతికాలంలోనే మేము అమెరికన్ సైన్యంలో శాశ్వతసైనికులుగా నమోదుచేయబడ్డాం. ముందుకాలంలో ప్రసిద్ధజెండబోవు (Emilis Aawilands) ఎమిలియో అగ్విలాండోను బట్టుట అసాధ్యము. ఆవృథాశ్రమానికి నేను నియమింపబడ్డాను. ఖాయమైన వెంటనే మా తొలి భయంకర పోరాటం మనిలాకి బయటజరిగింది. తిరుగుబాటుదారులు ఏ క్షణంలోనైనా మేము చుట్టుముట్టుతామని అనుకొంటూనే వున్నారు. చుట్టూ కందకాలు తవ్వుకొని మంచి కట్టుదిట్టంలో వున్నారు. దాదాపు ఇరవై పటాలాలువున్న మా సైన్యం పద్దెనిమిదిమైళ్ళ పొడవుగల రక్షణశ్రేణిని నిర్మించుకొనవలసివచ్చింది. ఒక క్రమపద్ధతిని నెమ్మదిగా మేము పురోగమించుతున్నా. ఎదుర్కొనవలసిన కష్టాలు మరీ ఎక్కువగా వున్నాయి. నలభై మూడురోజులపాటు మేము కందకాలలో వుండవలసివచ్చింది. ప్రతిరోజూ ఇరవై నాలుగుగంటలలో ఇరవై గంటలసేపు కుండపోతగా వర్షం కురుస్తూనేవుంది. బురదలో కూరుకుపోతూ, జారిపడుతూ పందులవలె పోర్లాడేం ఆబురదలో!

పదియవరోజున మేము (Catoocan) కేటూకన్‌ని వశపరచుకొన్నాం. ఈరోజున నేనొక సాహసకృత్యం చేయవలసి

వచ్చింది. మా కెప్టెన్ మాన్టానా వలంటీర్ (Montana Volunteers) దళానికి ఒక సందేశాన్ని కొనిపోవలసినదిగా నన్నాదేశించాడు. తక్షణం నేను ఎవరికీ కనుపించకుండా అడ్డ దారిని ప్రయాణం సాగించాను. ఒత్తుగా పెరిగిన వెదురుడొంకల మధ్యనుంచి కొంతదూరం వెళ్ళగానే ఒక బయలు ప్రదేశం వచ్చింది. వరిపొలాలమధ్యలో అక్కడ ఒరాతికట్టడం నాకు కనుపించింది. అది బహుశా వలంటీర్ దళపు ప్రధానకార్యాలయ మేమోనని అనుకొన్నాను. కాని కనుచూపుమేరలో ఎక్కడా మనుష్యసంచారంలేదు. అంతా నిశ్శబ్దంగావుంది. అతిజాగ్రతగా అటూ ఇటూ చూసి, పిల్లిలా అడుగులు వేసు కుంటూ ముందుకి నడచాను. ఇంతలోనే ఎక్కడినుంచో ఒక తుపాకిగుండు వచ్చినా సమీపంలోపడి. బురదచినుకులు నా ముఖంమీదచెదిరినాయి. ఆ విధంగా కాల్పులు సాగుతూనే వున్నాయి. నేను వేగంగా ముందుకి సాగిపోతున్నాను. ఇంతలో నేనాకట్టడపు ప్రవేశద్వారందగ్గరకి చేరుచున్నాను. అంతా బిగ్గరగా కూతలు వేశారు.

"నీవు ఎక్కడికి వెళుతూన్నావో నీకు తెలుసునా? ఓరి వెర్రివాడా!"

"అది కుష్ఠురోగులుండే చోటు! తెలుసా?"

ఎవరో నన్ను బలంకొలదీ కొట్టినట్లుగా వెనక్కి వచ్చేశాను. నాగుండె ఒక్కక్షణంపాటు కొట్టుకొనడం మానేసింది. కుష్ఠువాళ్ళుండే స్థలమా? ఆఁ. వొట్టిమాట. (Sunday School) సన్‌డేస్కూలులో నేను చదువుకొనే రోజులలో కుష్ఠువాళ్ళని

గురించి విన్నాను. కాని ఇంకా వాళ్ళున్నారనే మాట నమ్మ లేకపోయాను. ఆ రస్తాకు ఆవలి శ్మశానపు రాతిగోడల వెనుక నుంచి ఏవో గొంతుకలు వినపడుతున్నాయి. బహుశా మాన్లానా సైనికులు అక్కడేవుండి వుంటారు. ” తక్షణం నేను సంకోచించకుండా లోనికి ప్రవేశించి ఆ సైనికులమధ్యకి వెళ్లాను. ఆ కట్టడపుగోడలు ఊతగాగాని ఆ సైనికులు కొంతదూరంలో వున్న చెట్లగుంపు లోనికి తుపాకులను అప్పుడప్పుడూ కాల్చు తూన్నారు. నేను అదళపు కెప్టెన్‌కి మా కెప్టెన్ పంపిన సందే శాన్ని అందించి తిరిగి వెళ్ళిపోవడానికి సిద్ధమౌతూండగా ఆ కెప్టెన్ నన్ను రక్షణకోసం అక్కడే వుండిపోవలసినదిగా ఆదేశిం చాడు. కాల్పులు మరింత జోరుగా సాగినకొలదీ, ఆ కట్ట డంలో వున్నవాళ్ళంతా పాకుతూ పొలాలమ్మట వెళ్ళడం నేను చూచాను. ఇతరులవలె కుష్టురోగులు తుపాకిగుండ్లంటే ఎందు కంత భయపడతారో నాకు అర్థంకాలేదు. దారుణమైన కుష్టు వ్యాధితో బాధపడుతూ అనుదినం మరణించేకంటె, ఒక్కసారి చావుని ఆహ్వానించకూడదూ ? నేనేకనుక కుష్టురోగినైతే ఒక్క గుండుతో ప్రాణింతీసుకొని వుండేవాణ్ణి !

ఆ తరువాత కొన్ని నెలలు మరపురాని వింత అనుభవా లతో గడచినాయి. శాన్‌జాసింటో (San Jacinto) యుద్ధం చేయడం, గెలవడంకూడా జరిగింది. కాని అగినాల్డో మాత్రం మాకు చిక్కలేదు. మేము చేయవలసినది నిర్ణయింపబడ్డది. కాని తిరుగుబాటుదార్లకి అక్కడి మూలమూల ప్రదేశాలన్నీ బాగా తెలుసు. అందుచేత ధైర్యంగా మమ్మల్ని ఎదిరించి

పోరాడారు. అయినను మేముమాత్రం మెల్లగా పురోగమిస్తూనే వున్నాం. అంతా బాగానే వుందనుకొనే సమయంలో జిత్తుల మారి అగినాల్డో తప్పించుకు పారిపోయేవాడు. తలలను వేటాడే ప్రాంతపు కేంద్రమైన బోన్టాక్ (Bontoc)లో అగినాల్డో వున్నాడని తెలిసి మేము బొన్టాక్ దిక్కుగా బయలుదేరాం. మా దళం అక్కడికి చేరేసరికి సరిగా తిరుగుబాటుదార్ల తుదిసంరక్షక సైన్య పంక్తిలోదూరి మౌంట్ పొలిస్ (Mount Polis) శిఖరంపైన, పర్వతాలలోను తలదాచుకోడానికి వెళ్ళిపోవడం జరిగింది. మౌంట్ పొలిస్ మైలున్నర ఎత్తుకు పైగావుంది. అప్పటికే బాగా అలసిపోయిన మేము బొన్టాక్ శివారులలో మకాం వేశాం.

తిరిగి అగినాల్డో మమ్మల్ని మోసగించి పారిపోయాడు. కాని ప్రపంచంలో రమణీయమైన అనేక ప్రదేశాలు కళ్ళారా చూచే అవకాశాన్ని మాకు కలిగించినందుకు అగినాల్డోకి నిజంగా మేము ఋణపడివున్నాం! మేము మనీలాకి తిరిగిరాగానే, కొన్ని రోజుల తరువాత అగినాల్డో పట్టుబడిపోయాడు. తిరుగుబాటు దారులు లొంగిపోయారు. కాని చెదురుమదురుగా గొరిల్లా యుద్ధాలుమాత్రం జరుగుతున్నాయి. కొద్దిరోజులపాటు నేను దక్షిణ ద్వీపాలలోను, చుట్టుప్రక్కలా తిరిగి లూజాన్‌కి తిరిగి వచ్చాను.

దక్షిణ ప్రాంతంలోవుండే ఒక చిన్నపట్టణంలో నేను రక్షణదళంలో వుండేరోజులు నాకుఎప్పటికీ మరపురావు. మాలా దళం చాలాచిన్నది. మాలో ప్రతి ఒక్కరికీ ఫిలిప్పైన్‌వాసుల పక్షం

డ్లలో మకాములు ఏర్పాటు చేయబడ్డాయి. నాకు విడిది ఇచ్చిన కుటుంబంపేరు (Nolasco) నొలాస్కో కుటుంబం వారిది సంపన్న కుటుంబం. సామాన్య కుటుంబీకుల ఇళ్లకంటె వారి ఇల్లు చాలా సదుపాయంగావుంది. సాధారణంగావుండే వెదురుతో గాక వీరి ఇల్లు కర్రతో కట్టబడింది. ఆ ఇంటిలో నాకొక ప్రత్యేకమైన గది ఇవ్వబడింది. ఈ అతిథిసత్కారం నన్ను వారికి మరింత సన్నిహితంచేసింది. ఆ ఇంటివారిపిల్ల కేరిటా (Carita) నిజంగా చాలాఅందకత్తె. అంతటి అందకత్తెయైన ఫిలిప్పైనో బాలికని నేనెక్కడ చూడలేదు. కందకత్తెలు లేక పోలేదు. డ్రెస్డెన్ (Dresden) పింగాణిబొమ్మలవలె అందచందముతో కర్కశములేని సొగసురాండ్రుంటారు, కాని, కేరిటా! చిరుమోముదానా అమె నామార్థమే ఎంత రమణీయముగా నాకు కాన్పించింది. కేరిటా అందమేవేరు! ఆ అమ్మాయిని పెండ్లిచేసుకొని ఆ దీవులలోనే వుండపోదామని చాలారోజులగా అలోచించ్చాను.

అంతలోనూ రక్షణదళంలోవుండే గడువు పూర్తిఅయిపోయింది. తల్లిదండ్రుల్ని. స్నేహితులని చూడాలనీ, రక్షణాం ఇంటికి వెళ్ళిపోవాలనీ నాలో తొందర ఎక్కువైనది. ఒక్కక్షణంకూడా ఆలస్యాన్ని భరించలేపోయాను.

## 2వ ప్రకరణం

నేను స్టేషన్‌లో అటుగు పెట్టగానే మా వాళ్ళంతా నన్ను కలసికొనడానికి వచ్చారు. ముదుసలి గుర్రాల కాపరి

వాష్ మాత్రం కనుపించలేదుగాని తక్కిన లందరూ సరికొత్త మోటారు కారులోనుంచి దిగారు. నేను ఫిలిప్పైన్స్‌కి వెళ్ళిన రోజులలో పట్టుమని అరడజను కార్లైనా లేవు; ఎందుచేత నంటే మోటారు యంత్రాలు ఆ రోజుల్లో అంత అరుదుగా వుండేవి. మా మోటార్ కారుని చూడాలని మహాత్తొందరపడ్డాను కాని నా చుట్టూరా జేరినజనం నన్ను కదలనివ్వలేదు. ఆ పట్టణపు బాండు మేళం "కవలుదాటినపోలు" పాట పాడుతూండగా ప్రజలు హర్షధ్వానాలు చేశారు.

మా అమ్మ మామూలుగానే మౌనంగా చిరునవ్వుతో వుంది. ప్రేమతో నన్ను ఆమె కౌగిలించుకున్నప్పుడు మాత్రం కన్నీరు కారడం నేను చూశాను. మా నాయన నా వీపు మీద తట్టి ఉత్సాహంగా నీవు తిరిగిరావడం మాకు చాలా గర్వంగా వుందిరా అన్నాడు. యుద్ధానికి ముందు మేము బారులుతీరి వెళ్ళాం. యుద్ధం తరువాతకూడా ఆనాడు బారులుతీరి నడవవలసివచ్చింది. ఊరేగింపులో! దాదాపు ఒక వందమంది నగరవాసులు నా వెనుక నడిచి వస్తూండగా ముందు బాండ్ మేళం సాగుతూండగా, కారు పై భాగపు కెన్వాసుగుడ్డని ముడిచి, నేను కారులో కూర్చొన్నాను. డ్రైవరు కారుని స్టార్ట్ చేశాడు. పెళ్ళినాటి నడకతో మేము వీధుల వెంబడి పోతూండగా, దుకాణాల్లోవున్న వర్తకులు. తక్కిన ప్రజలు బయటకివచ్చి, బారులుతీరి హర్షధ్వానాలు చేయసాగారు. పట్టణపు మధ్యలోవున్న పార్క్ (ఉపవనం) దగ్గర మా కారు ఆగింది. అక్కడే కొత్తగా ఒక వేదిక నిర్మింప

బడింది. అంతకు ముందు అక్కడా వేదిక లేదు. నాతో ఏమీ చెప్పకుండానే నన్ను కారులోనుంచి దింపి, ఆవేదికమీదికి తీసుకువెళ్ళేరు. ఆ నగరపు మేయరు, స్థానికచర్చి పురోహితుడు (Minister) నన్ను పొగడుతూ ప్రసంగించారు. వేదికమీది నుంచి దిగి వెళ్ళిపోదామా అనిపించింది. ఇంతలో నన్ను మాట్లాడవలసిందని పిలిచారు. ఫిలిప్పైన్ సైనికులను పొగ డుతూ నేను ప్రసంగించాను. శత్రువులని నేను ఈ విధంగా పొగడటం ప్రజలకి ఇష్టంలేకపోయినా సహించి వూరుకున్నారు, ఆఖరికి నన్ను వదలివేశారు. కాని చాలరోజులవరకూ నేను వీధిలో నడచివెళ్ళేటప్పుడల్లా నన్నుఆపి అనేక ప్రశ్నలు వేయడం మొదలుపెట్టారు. మాటామ్ విషయం ఇంక చెప్పనే అక్కర్లేదు రాత్రింబవళ్ళు ఎడతెగకుండ అడుగుతునే వెలుగికియే నాలో వుండే భావాలను ఒక్కటొక్కటిగా తెలుసుకున్నాడు. ఆఖరికి కేరిటా విషయంకూడాను!

"కేరిటాని ఎందుకు పెళ్ళిచేసుకోకూడదు నువ్వు?" అని పళ్ళికలిస్తూ నన్నడిగాడు.

కేరిటా చాలా అందమైన పిల్లకూడాను. కాని ఆమె దగ్గరనుంచి ఉత్తరం ఎప్పుడు వస్తుందా అని ఎదురుచూస్తునే వున్నాను. మేమిద్దరం ఒకరిభాష ఒకరికి నేర్పుకొన్నాం (Tagalog) భాష కేరిటా నాకునేర్పింది. నేను కేరిటాకి ఇం గ్లీష్‌భాష నేర్పాను. కేరిటా ఇంగ్లీష్‌లో నాకు ఉత్తరాలు వ్రాయడానికి, నేను కేరిటాకి (Tagalog) భాషలో ఉత్తరం

వ్రాయడానికి ఒప్పందం చేసుకొన్నాం. నెలలు గడచిపోయినా ఆమె నాకు ఉత్తరం వ్రాయలేదు.

యుద్ధరంగంనుంచి తిరిగి వచ్చినాక నాకు విశ్రాంతి అవసరమని మావాళ్ళు గుర్తించారు. కొన్నిరోజులు మా వ్యవసాయ క్షేత్రాలలోను, కొన్నినాళ్ళు వ్యాపారంలోనూ తిరుగుతూ కాలక్షేపం చేశాను. మా నాయనకు రెండు వ్యవసాయ క్షేత్రాలున్నాయి. ఒకటి ఉత్తర వ్యవసాయక్షేత్రం, రెండవది దక్షిణ వ్యవసాయక్షేత్రం. ఇవిగాక జరీకాలో (Trucking and warehousing) రాతివారి సరకులు తమబండ్లలో మోసుకొనిపోవడమూనుఇతరులుసామానులు నుంచుకొనుటకు తనగిడ్డంగిలో చోటిచ్చుటను ఈరెండు వ్యాపారాలు ఆయన చేస్తుండేవారు నేను యుద్ధానికి వెళ్లిన సమయంలో ఆ వ్యాపారం బాగా వృద్ధి చెందింది. సమీపనగరాలలో ఆయన ఎన్నో బ్రాంచీలను కూడా తెరచారు. దాదాపు నూరు మోటారు శకటాలు, వస్తువులను నిలువచేసే గిడ్డంగులతో ఏరకపు వస్తువులైనా సాధారణ సరకులో ఇంటిసామానులో గనులలో వుపయోగించే పెద్ద పెద్ద యంత్రాలో—లాక్కొనుబోవు వ్యాపారం నిర్వహించేవారు. వ్యాపారం మూడుపువ్వులు ఆరుకాయలుగా అభివృద్ధి చెందింది.

ఒకనాటి ఉదయం నేను మా నాయనతో ఆఫీసుకి వెళ్ళాను. అప్పుడే గుర్రాలన్నీ అశ్వశాలనుంచి బయటికి వస్తున్నాయి బళ్లదగ్గరకి—మా నాయనకి రెండువందల గుర్రాలపైగా వున్నాయి అప్పుడు—మా నాయన ఆఫీసు ఉత్తరాలను చూసు

కొంటూండగా నేను కిటికీగుండా మోటారు శకటాలనుంచి దింపు తున్న సరుకులనుచూస్తూ కూర్చున్నాను.

“ నెడ్ ! నీతో ఏకాంతంగా మాట్లాడాలని చాలా రోజులనుంచి అనుకొంటున్నాను. ఇటుపైన ఏమిచేద్దామని అను కొంటున్నావ్ ? ” అని అడిగాడు, మా నాయన.

“ ఏమో నాకే తెలియదు. ఇప్పుడు తిరిగి కాలేజీలో ప్రవేశించి చదువు పూర్తిచేయడం ఉత్తమమాట ఇప్పటికే పెద్ద వాణ్ణయ్యాను. దీనికితోడు యుద్ధం నన్ను చదువుకి విముఖుణ్ణి చేసింది. ” అన్నాను.

“ అయితే నాతోపాటు వ్యాపారంలో నాకు సహా యంగావుంటే చాలాబాగుంటుంది. రోజురోజుకీ వ్యాపారం వృద్ధిచెందుతూంది. నా అంతట నేను శ్రమపడి ఈ వ్యాపారాన్ని వృద్ధిలోకి తీసుకువచ్చాను. ” ఏమంటావ్, అన్నట్లు నావైపు తదేకధ్యానంగా చూడసాగాడు.

అసలు వ్యాపారంలోను నాశక్తి ఎటువంటిదో నాకే తెలి యదు. అందుచేతనే ఆవిషయం నాయనతో చెప్పాను. అదీ కాక అప్పుడు నాకొక స్థిరమైన అభిప్రాయంకూడా ఏదీలేదు. ఒకేచోట స్థిరంగా వుండటం నాకు మనస్కరించలేదు. కాని ఈ విషయం ఆయనతో నేను చెప్పలేను. తండ్రి తన సామ్రా జ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేస్తానంటే, కొడుకు దానికి వ్యతిరేకంగా చెప్పడం సంభావ్యమా ? అందుచేత అప్పటికి ఆయన చెప్పినదానికి

కృతజ్ఞతను తెల్పి, ఈ విషయంలో ఒకనిశ్చయానికి రావడానికి కొంత అవకాశం ఇవ్వవలసినదిగా కోరాను.

ఏమంత తొందరలేదనీ, సావకాశంగా ఆలోచించుకొని చెప్పవలసిందనీ, నాన్నగారు చెప్పారు. ఒకవారంరోజుల తరువాత వ్యాపారంలో చేరుతాననీ, నేను సంతృప్తికరంగా వ్యాపారంలో పనిచేయగలితే, వ్యాపారంలోనే వుండిపోతాననీ చెప్పాను.

నేను అంగీకరించిన మరుక్షణంనుంచీ, ఉత్సాహంకలిగి తీవ్రతతో వ్యాపారవిధానాలు సమగ్రముగ నేర్పించారు. ఆయన వ్యాధితో తీవ్రంగా బాధపడుతూండడం వలననే ఈ విధంగా పూర్తిగ గబపించారని నేను గ్రహించాను. ఆయన జీవితకాలంలో ఎన్నడూ డాక్టర్ని చూడలేదు. ఈ పరిస్థితిలోకూడా డాక్టర్ని చూడడానికి ఆయన నిరాకరించాడు. డాక్టర్ని చూడకూడదనే ఆయన మొండిపట్టు మా అమ్మని మరింత బాధపెట్టింది. ఏదో ఒకవిధంగా ఆయనను ఒప్పించవలసినదిగా మా అమ్మ నన్ను ఒత్తిడిచేసింది. ఆయనతో ఎన్నో విధాలచెప్పి చూశాను కాని నావంట్లో రోగమేమిటో నాకు బాగాతెలుసును. నా బాగు నేను చూచుకోగలను అని ఆయన సమాధానం చెప్పారు. ఆ శీతకాలం వెళ్లేలోపున ఆయన మంచంపట్టారు. ఆఖరికి కడపటిరోజులలో మేము డాక్టర్ని తీసుకురాగలిగాం. అప్పుడే ప్రాక్టీస్ ప్రారంభించిన హూరేస్‌విండిల్ (Horace Windle) నాతో చదువుకొన్నాడు. డాక్టర్ని తీసుకురాగానే మా నాయన నవ్వి, రోగలక్షణాల్ని డాక్టరుకు

చదవిస్తున్నారు. డాక్టర్ హొరేస్ మా నాయన ఇదివరలో మాతో చెప్పిన విషయం నిజమేననీ, రోగం నెమ్మదించడం కష్టసాధ్యమనీ, ఐనా బాధ ఉపశమించడానికి మాత్రం కొన్ని ప్రక్రియలు చేయవచ్చుననీ చెప్పాడు. వేసవిలో మా నాయన మరణించాడు. అంత రోగంతో, అంత బ్రహ్మాండంగా వ్యాపారాన్ని వృద్ధిచేసిన మా నాయన నిజంగా ధైర్యవంతుడని, వాడే మనిషి అని అనిపించింది.

మా నాయన విడచివెళ్ళిన వ్యాపారాన్ని నేను నిర్వహింపసాగాను. టామ్‌కి వ్యాపారం అంటే ఎంతో ఇష్టం. తాను స్కూలునుంచి రాగానే చాలాభాగం ఆఫీసులోనే పని చేస్తూ గడపేవాడు. నేను ఇంటికివచ్చిన ఏడెమినిది నెలలలో కేరిటాకి రెండు పర్యాయములు ఉత్తరాలు వ్రాశాను. కాని ఒక్కదానికిని సమాధానం రాలేదు. ఒకనాడు 'బాబ్ సెల్లర్స్' దగ్గరనుంచి నాకు ఉత్తరంవచ్చింది, యుద్ధం అయిపోయినతరు వాత బాబ్ సెల్లర్స్ మనిలాలోనే వుండిపోయి పోలీసుశాఖలో చేరిపోయాడు. ఈ మధ్యనే దక్షిణ లూజాన్ వెళ్ళినప్పుడు బాబ్ నొలేస్కో కుటుంబాన్ని చూశాడు. తాను ఇంతవరకూ ఎందుకు ఉత్తరం వ్రాయలేకపోయిందో నాకు తెలియజేయవలసి నదిగా కేరిటా బాబ్‌ని కోరింది. కేరిటా చిన్నతమ్ముడు (Sancho) 'సాంచో' కుష్టువ్యాధికి లోనైనాడు. నేను మాన్టానా దళానికి తాఖీదు కొనిపోయినప్పుడు ఏ కట్టడంలో ప్రవేశించానో ఒక్కడికే సాంఛోని పంపించారట; బహుశా వాళ్ళ కుటుంబానికి ఇతరులకు ఈభయంకర వ్యాధి సోకవుంటుం

దని కేరిటా అనుమానం. అందుచేతనే ఆమె ఇన్నాళ్ళవరకూ ఉత్తరం వ్రాయలేదు.

నిజంగా నాకు నోట మాటరాలేదు. "కుష్టువ్యాధి" అనే ఆలోచనే నన్ను నిలువునా వణికించేసింది! పాపం కేరిటా ఎంతగా బాధపడుతూందో కదా. నేనూ వాళ్ళతో కలసి కొన్నాళ్లు వాళ్ళఇంట్లో వున్నాననే సంగతి హఠాత్తుగా నాకు జ్ఞాపకం వచ్చింది. నేను వాళ్ల ఇంట్లోనే నిద్రపోయాను. వాళ్ళతో పాటే భోజనం చేశాను. ఈ విషయం తలచుకుంటే నాకు ఆ పాదమస్తకం కంపించిపోయింది. కాని అంతలోనే ధైర్యం చిక్కబట్టి ప్రశాంతంగా ఆలోచించాను. నేను వాళ్ళని వదలిపెట్టి ఇంటికివచ్చి ఎనిమిదినెలలైంది. ఈ ఎనిమిదినెలలలో నేను ఏ రోగంలేకుండా రాయిలావున్నాను. అంతటితో నా విషయంలో భయం పూర్తిగా తొలగిపోయింది. ఇంతలో సాంచో విషయం జ్ఞాపకం వచ్చింది. సాంచో బాగా చిన్నవాడు. కుష్టువ్యాధి శారీరక సంబంధంవల్ల వ్యాపిస్తుందని నా అభిప్రాయం. కాని సాంచో శారీరక సంబంధాలు పెట్టుకొనేటంత పెద్దవాడు కాదే! మరి ఈ వ్యాధి ఆ చిన్నపిల్లవాడికి ఏలా వ్యాపించిది? ఈ ఆలోచనలతో తల తిరిగిపోయింది. ఆఖరికి ఈ విషయం మరచిపోడానికి ప్రయత్నించాను. కాని, కేరిటామాత్రం నా కన్నులకి కట్టినట్లువుంది. కేరిటా 'చిన్నముఖం' ఎంత అందంగా వుండేది. ఈ భయంకరవ్యాధికి గురిఐతే నిజంగా దుస్సహమే! కేరిటా విషయం మరీమరీ అడగడం మొదపెట్టాడు టామ్. నేను కేరిటా వ్యాధివిషయం టామ్‌తో చెప్పివేశాను.

టామ్ గంభీరంగా అంతావిని ఆఖరికి తన విచారాన్ని వ్యక్తం చేశాడు. 'టామ్' నిజంగా మంచిహృదయంకలవాడు. తిరిగి ఈ విషయం ఎప్పుడూ ఎత్తలేదు. నా విషయంలోకూడా టామ్ దృక్పథం క్రమంగా మారింది. నేనుకూడా ఆ వ్యాధితో బాధ పడుతున్నానని బహుశా టామ్ గ్రహించాడేమో !

*　　　*　　　*　　　*

నేను యుద్ధాన్నుంచి తిరిగి వచ్చిన తొమ్మిది సంవత్సరాల నిరుత్సాహ జీవితంలో ఒక్కపర్యాయం మాత్రం చెప్పలేని నూతనోత్సాహంనాలో కలిగింది—ఆ అమ్మాయిని నేను మొట్ట మొదటిసారిగా ఒక విందులో చూచాను. తన అన్నతో ఆ విందుకి వచ్చింది. ఆమెను మొట్ట మొదటిసారిగా నేను చూచినప్పటినుంచీ నాకు మరేవిషయం మీద దృష్టిపోలేదు. అలాంటి అందకత్తెని మరెక్కడ నేను చూడలేదు. ఆమె నవ్వేలు గులుకు కలకంఠమునకు ఎంత సమ్మోహన శక్తివుంది! అలాంటి సంతోషంతో ఉప్పొంగిపోయే పిల్లని నేనెక్కడా చూడలేదు. ఆమెను పట్టుకోవడం మునుపు అగ్నోనాల్లోపట్టడం వలెనుండె. మా ఇద్దరికి ప్రథమ పరిచయం ప్రేమ పూర్వకమైన ప్రగాఢ స్నేహంగా మారి, ఒక్క మాసంలో ఆమె నన్ను పెండ్లి చేసు కోడానికి సమ్మతించింది. ఆ అమ్మాయి పేరు జేన్ (Jane).

కాని తన చదువు పూర్తిఅవుతే కాని పెళ్ళి చేసుకోనని తన తల్లిదండ్రులకి మాట ఇవ్వడంచేత ఆగడువు పూర్తి అయే వరకూ పెళ్ళి వాయిదా వేయాలని కోరింది.

సెప్టెంబర్ నెల ప్రారంభంలో ఒక నాటి రాత్రి జేన్, నేనూ జరికాలో ఒక సంగీత కచేరికి వెళ్ళి, రాత్రి తిరిగివస్తూ మా ఆఫీసులో ఆగిపోయాం. జేన్ కిటికీ గూటిలో కూర్చుని ఒక పాట పాడుతూండగా అగ్ని ప్రమాదపుగంట మాకు విన పడింది. తక్షణం నేను ప్రధాన కార్యాలయానికి వెళ్ళే తలుపు తెరచి, జేన్, నేనూ బయటికి పరుగెత్తాం. ఇంతలో రాత్రి కావలిమనిషి 'గిడ్డంగి మూడో అంతస్తు కాలి పోతూంది. గుర్రాల శాలకి కూడా మంటలు వ్యాపించేలావున్నాయి' అంటూ కేకలు వేస్తూ మా వైపు పరుగెతుకు వచ్చాడు.

గుర్రాల శాలలలో ముసలివాష్‌తో పాటు ఇంకో ఇద్దరు కాపలా మనుష్యులువున్నారు. మేము గుర్రపు శాలలలో ప్రవే శించగానే వాష్ కుడివైపు శాలనుంచి మా వైపువస్తూ "ఏదో అంటుకుంది; ఊరు ఊరంతా కాలుతున్నట్టుంది!" అన్నాడు నాతో.

ఇంతలో తక్కిన ఇద్దరు కాపలావాళ్ళు నా వైపు పరు గెత్తుకుంటూ వచ్చారు.

వాష్ నేనూ గుర్రాల శాలలలో ప్రవేసించి గుర్రాలకి కట్టిన త్రాళ్ళు కోసేస్తామనీ, బయటికి వచ్చే గుర్రాలని దూరంగా అదలించి తోలివేయ వలసిందనీ ఆ ఇద్దర్నీ అక్కడే వుంచి, వాష్ నేనూ లోపలికి వెళ్ళాం.

"ముందుగా వెనుక భాగాన్నుండే గుర్రాల్ని వదలించు వాష్! ఎక్కడున్నావ్ వాష్! ఎక్కడున్నావ్?"

గుర్రాల్ని విడిపిస్తూన్నానండి–ఇక్కడ! అంటూ వాష్ నల్లని తన అరచేతితో గుర్రాల్ని అదలిస్తూన్నాడు, సన్నటి మార్గంగుండా గుర్రాలు వెనుక భాగాన్నుంచి వెళ్ళి పోతూంటే, నేను కూడా పొడుగు పాటి పారని చేతికో దొరక పుచ్చుకొని వాష్ వున్న చోటుకి వెళ్ళాను. ఇంతలోను క్రిందనుంచి కేకలు వినుపించాయి. నిప్పుని చల్లార్చడానికి సహాయంకూడా రానే వచ్చింది. ఇంకొక ఇద్దరు మాతో వచ్చి చేరగానే గిడ్డంగి పై కప్పు పెద్ద హోరుపెడుతూ కూలిపోయింది.

బయటవున్న జనమంతా మమ్మల్ని బయటికి వచ్చే యండని బిగ్గరగా కేకలు వేయసాగారు. ఇంకొక్క ఆ సవారీ గోడిగ మాత్రం మిగిలి పోయింది. అది మహామొండి ఘటం. ఒక స్థాన కదిలే రకంకాదు. అప్పటికే ఆ శాల పైకప్పుకి నిప్పంటుకొంది. ఒక నరుసువచ్చి ఆ గుర్రం గడ్డితినే అరపలో పడింది. మరుక్షణంలో గడ్డిఅంటుకొని మండుతూంది. ఆగుర్రాన్ని మరల్చడానికి ప్రయత్నిస్తూండగా నన్ను అరపకి దగ్గరగాలాగి పడ వేసింది. ఆ దెబ్బతో నాకు స్పృహతప్పిపోయినంత పని అయింది. నాచేయి మంటలో వుండిపోయింది. విపరీతమైన బాధ నాభుజం దాకా వ్యాపించింది. ఆ బాధతోనే గుర్రం ముఖం మీద బలంగా చరచాను. ఆ దెబ్బతో అది అక్కడ నుంచి తొలగి పోయింది. ఇంతలోనూ వాష్ అవతలప్రక్కకి ఉరికి గుర్రాన్ని శాలలకి మధ్యగావుండే సందులోనుంచి బయటికి తరుముకు పోయాడు. ఎక్కడ చూచినా మంటలే! ఆక్కన జనంకూడా ఆ మంటలోనుంచి బయట పడ్డారు, నేనుకూడా కష్టంమీద బయటికి వచ్చేశాను.

జేన్ పట్టలేని దుఃఖంతో పొరలిపొరలి ఏడుస్తోంది. టామ్ ఆమెని ఊరడిస్తూ పట్టుకొని వున్నాడు. కాలిపోయిన నా చొక్కానీ, చేతినీ జేన్ చూచి, మరింత విచారంతో క్రుంగి పోయింది. కాలిన గాయంచుట్టూ చేతి రుమాల ముడివేయ మని పట్టు పట్టింది.

"బాగా బాధ పెడుతూందా నెడ్" అన్నది జేన్.
"నా చేయి పాపంలా బాధిస్తూంది" అన్నాడు

"కాని నీముంజేయి వెనుక భాగం చాలా తీవ్రంగా కాలింది సుమా!" అన్నది జేన్.

నాముంజేతిని త్రిప్పిచూశాను. నిజమే, చాలాతీవ్రంగా కాలింది. కాని నాకేమీ కాలినట్టు తెలియలేదే!

అప్పుడే డాక్టర్ హాకేస్ వింటిల్ వచ్చాడు. జేన్ డాక్టర్ని నాదగ్గరికి తీసుకువచ్చింది. త్రుటిలో తన మందులసంచిని తెరచి నాచేతిని పరీక్షింపసాగాడు.

"డాక్టర్, సరిగా పరీక్షించిచూడు. అది చాలా బాధ పెడుతుందికదూ!" అన్నాను.

"చాలా అంటావేమిటి? విపరీతమైన బాధపెడుతుంది" అన్నాడు డాక్టర్.

"కాని నాకేమీ బాధలేదే. సరిగా పరీక్షించిచూడు డాక్టర్. అసలు బాధపెడితే నాకు తెలుస్తుందిగా" అన్నాను.

బాగా కాలిన ఆ రెండు ప్రదేశాలనీ డాక్టర్ గుర్తించి కట్టుకట్టిన తరువాత "చూడు నెడ్, సాధ్యమైనంత త్వరలోనా

ఆఫీసుకి రా. ఈ గాయాలు నిజంగా ప్రమాదకరమైనవే అక్కడికేవస్తే, జాగ్రతగాపరీక్షించి నేను చేయవలసినదంతా చేస్తాను” అన్నాడు.

“ఈ గుర్రాలసంగతి నేను చూసుకొంటాను. నీవు త్వరగావెళ్ళు డాక్టర్ చెప్పినట్లు” అన్నాడు టామ్.

జేన్, నేనూ కలసి డాక్టర్‌హూరేస్ విండిల్ ఆఫీసుకి వెళ్ళాం. ఈసారి నాచేతినంతటినీ డాక్టర్ చాలా జాగ్రతగా పరీక్షించాడు. ముంజేతిమీద కాలిన ప్రదేశంలోకూడా స్పర్శ జ్ఞానంలేని తిమ్మిరిప్రదేశాన్ని కనుగొన్నాడు.

“నెడ్, ఏదైనా తుపాకిగుండుగాని, ములుకుగాని ఎప్పుడూ ఈ ప్రదేశంలో తగలలేదుకదూ ? లేక, సైన్యంలో వుండే కంచరగాడిద తన్నిందా ?” అన్నాడు డాక్టర్.

“అటువంటిదేమీ జరుగలేదోయ్. ఏం అంత అనుమానించదగినదేముంది ? అన్నాను.

“అటువంటిదేమీ లేదులే ! అయినా ఏదో ఒక కారణంలేనిదే శరీరంమీద స్పర్శజ్ఞానంలేని మచ్చలువుండవు. ఏమైనా, అవి వుండడంకూడా ఒకందుకు మంచిదే అయింది. కాలినప్పుడు పడే యమబాధనుంచి నిన్ను రక్షించాయి. వాటినిగురించి ఏమంత బెంగపెట్టుకోవలసిన అవసరంలేదు.”

జేన్, నేనూ తిరిగివెళ్ళి టామ్‌ని కలసికొన్నాం.

“మంటలన్ని ఆరిపోయాయి. గుర్రాలుకూడా అన్నీ కనపడ్డాయి” అన్నాడు టామ్.

"జేన్, నేను ఈరాత్రి కన్నుమూసివుంటే నా చిన్న తమ్ముడు ఈవ్యాపారాన్ని చక్కగా నడపించగలడనడానికి సందేహంలేదు" అన్నాను నవ్వుతూ.

"ఆఁ, అన్నయ్య మాటలకేమిలే జేన్. ఆ మాటలు నమ్మకు!" అన్నాడు టామ్.

## 3 వ ప్రకరణం

కొద్దరోజులలోనే కాలిన గాయాలు మానిపోయాయి. ఆవింత 'తిమ్మిరిప్రదేశాలు' మాత్రం ఆలాగే వుండిపోయాయి. నాకు తెలియకుండా ఎప్పుడో తగిలిన దెబ్బలవల్ల అవి ఏర్పడి వుంటాయని డాక్టర్ హూక్స్‌విండిల్ ఒక అభిప్రాయానికి వచ్చాడు.

క్రిస్టమస్ పండుగకి జేన్ నాతో గడపడానికి వచ్చింది. నిజంగా ఆ రాత్రింబవళ్ళు మరపురాని మధురస్వప్నాలు. మా వ్యాపారాన్ని పూర్తిగా టామ్‌కి వదలివేసి నేను జేన్‌తో ఖులాసాగా విందులతో, వినోదాలతో గడిపాను. చలికాలంలో వెన్నెల రాత్రులలో అప్పుడే కడుతూన్న భవనంలో ఎంతో హాయిగా గడిపాము. జేన్‌ని విడచివుండటం నాకు కష్టమే అనిపించినా, ఇంకొక్క ఐదునెలలే కదా ఈ ఎడబాటు అని ఊరట చెంది, ఎంతో కష్టంమీద ఆమెని సాగనంపడానికి రైలుస్టేషన్‌కి వెళ్ళాను. రైలు కదలగానే జేన్ తలుపుదగ్గర నిలుచుని, బాగా దూరం వెళ్ళేవరకూ నావైపుచూస్తూ చేతిని ఊపుతూనే వుంది.

ఇంతలో వసంతకాలం వచ్చింది. ఇక కొద్దిరోజులలో జేన్ 'మా ఇంటికి' వస్తుంది. ఈ విధంగా ఆలోచిస్తూ ఒకనాడు నేను స్నానాలగదిలో నీటిధారక్రింద ఒళ్ళు తోముకుంటూండగా హఠాత్తుగా నా ముంజేతిమీది మచ్చసంగతి జ్ఞాపకం వచ్చింది. ఇంతవరకు దానిసంగతి మరచేపోయాను. నా చేతిని తిప్పి చూసుకొన్నాను.

నాలో ఒకవింత మార్పు కనుపించింది. నా రక్తనాళాలలో మంచువలె చల్లనినీరు ప్రవహిస్తున్నట్లనిపించింది. నాచేతికి పైభాగంలో భుజంమీద అలాంటిదే మరియొక మచ్చవుంది ! అయినా పరీక్షించి చూద్దామని ఆ రెండవ మచ్చపైన గోరుతో గుచ్చిచూశాను. మొదటిమచ్చలాగే దీనిపైనకూడా ఏ విధమైన స్పర్శజ్ఞానంలేదు ! తక్షణం నేను స్నానపుతొట్టిలోనుంచి లేచి, అలమారులోవున్న గోరుగల్లుతెచ్చి మొనతో తెల్లని మచ్చ మధ్యభాగంలో గుచ్చిచూచాను.—ఎంత ప్రయత్నించినా అక్కడమాత్రం స్పర్శజ్ఞానం లేనట్లు స్పష్టంగా తేలిపోయింది.

తక్షణం ఒళ్ళుతుడుచుకొని, బట్టలువేసుకొని, నాకోసం భోజనం ప్రయత్నాలేవీ చేయవద్దనీ, పట్నంలో భోజనం చేస్తాననీ అమ్మతో చెప్పి, కారులో తక్షణం డాక్టర్ హొరేస్‌విండిల్ ఇంటికి వెళ్ళాను—డాక్టర్ హొరేస్ భార్య (Katherine) కేథరీన్ గుమ్మందగ్గరకివచ్చి నాకు ఆఫీసులోనికి దారిచూపించి, డాక్టర్ హొరేస్‌ని పిలవడానికి లోపలికివెళ్ళింది. అంత పెంద్రాళే జనం డాక్టర్ని చూడడానికి రావడం మామూలే, అందుచేతనే నా రాక ఆమెకు ఏమంత ఆశ్చర్యం కలిగించలేదు.

డాక్టర్ ఆఫీసుగదిలో అడుగుపెట్టగానే "డాక్టర్, ఇదిగో చూడు. ఆ వెధవమచ్చ ఇంకొకటి తయారైందిక్కడ" అంటూ చూపించాను.

ఆ రెండు మచ్చల్నీ అతడు భూతద్దంతో పరీక్షగా చూశాడు. ఆఖరికి తన (laboratory) లేబొరేటరీలోనికి వెళ్ళి ఒకపెద్దసూదిని పట్టుకువచ్చి "ఇది కొంచెం బాధపెట్టవచ్చు. దీనితో కొంచెం చూడాలి" అన్నాడు డాక్టర్ నేను రెండు కళ్లూ గట్టిగా మూసుకొని, డాక్టర్ని పరీక్షచేయనిచ్చాను.

"ఏమైనా తెలుస్తూందా?" అన్నాడు డాక్టర్.

"లేదు. ఏమిటంటావ్ అది?" అన్నాను.

ఏమో నెడ్. నాకూ ఏమీ అర్థంకావడంలేదు. కాని అంతమాత్రంచేత అంత కంగారుపడటం తెలివితక్కువ. ఇది ఫలానా అని నాకు తెలియనంతమాత్రంచేత దానికి విపరీతార్థాలు తీయకూడదు. చర్మవ్యాధులు ఎన్నో రకాలు వుంటాయి. ఇదమిత్థమని చెప్పడంకష్టం. అందుచేత చర్మవ్యాధుల విషయంలో నిపుణుని దగ్గరకి వెళ్ళడం మంచిది. అందుచేత నీవు డాక్టర్ డిక్సన్ Dickson దగ్గరకి వెళ్ళడం అవసరం. నీకు డిక్సన్ తెలుసునుకదూ?

ఆయన ఈ పట్టణానికి కొత్తగావచ్చారు. నాకు ఆయనతో కొలది పరిచయం మాత్రమేవుంది.

"అయితే నేను ఆయనకి ఫోన్‌చేస్తానులే నెడ్" అన్నాడు డాక్టర్.

నేను కష్టంమీద నా చొక్కా వేసుకొంటూ "సరే, డిక్సన్‌కి ఫోన్‌చేయి డాక్టర్! వీలైతే ఇప్పుడే ఇక్కడనుంచే బయలుదేరి డిక్సన్‌దగ్గరికి వెళుతాను" అని చెప్పాను.

ఒక అరగంట తరువాత డిక్సన్ నన్ను పరీక్షచేయడం పూర్తిఅయింది. ఇది ఫలానాఅని డిక్సన్‌కికూడా తెలియలేదు!

"నిశ్చయంగా ఇది ఫలానాఅని తెలియకుండా నీతో ఇది నాకు తెలుసునని చెప్పడంలో అర్థంలేదు. నిర్మొహమాటంగా చెప్పాలంటే నిజంగా నాకు ఇదఏమిటో బోధపడ లేదు. ఈలాంటిదానిని నేనిదివరలో చూడలేదు. నేనే నీ పరిస్థితిలోవుంటే ఏదో ఒక పెద్దనగరానికివెళ్ళి, నాకంటె అనుభవజ్ఞుడైన ఒకనిపుణుణ్ణి సంప్రదించివుండేవాణ్ణి. నీకు నేనిచ్చేసలహాకూడా అదే" అన్నాడు డిక్సన్.

ఒకవారంరోజుల తరువాత నేను నాస్నానాలగదిలో ఈల పాటపాడుతూ నీళ్లుపోసుకుంటూండగా, తక్కినరెండు మచ్చల వలెనే మూడవమచ్చకూడా కనపడింది! ఈ మూడవది కాలిమీద! నాకు భయమూ, కోపమూకూడా ఒక్కసారి పొంగి పొరలివచ్చాయి. కోపం ఎందుచేతనంటే ఏ కారణంలేకుండా, సంతోషంగా కాలంగడపే నన్ను, నాపాటుకే నన్ను బ్రతుకనీయకుండా ఎక్కడనుంచోవచ్చి, ఈ వ్యాధి నాశరీరంలో ప్రవేశించి నన్ను బాధించడమేమిటనీ; భయం ఎందుచేతనంటే ఈ వ్యాధి ఫలానా అనీ ఎవ్వరూ కనిపెట్టలేక పోవడంచేత! ఏమైనా దీని విషయంర నేను తెలిసికొని తీరాలి.

డిక్సన్ తన ఆఫీసులో ఈ మూడవ మచ్చని కూడా పరీక్షించాడు.

"చాలా రోజులక్రితం ఈ వ్యాధి విషయం బాగా తెలిసిన నిపుణుణ్ణిచూస్తే మంచిదని నాతో చెప్పారు. డాక్టర్, నేను ఎవరి దగ్గరకి వెళ్ళవలసి వుంటుందో చెప్పండి. ఇప్పుడు వెళ్ళడానికి నేను సిద్ధంగావున్నాను" అని చెప్పాను డాక్టర్ డిక్సన్‌తో.

"నాకు తెలిసిన డాక్టర్లలో ప్రఖ్యాతిచెందిన డాక్టరు సెయింట్‌లూయిస్ (St. Louis) లో వున్నారు. నేను మెడికల్ స్కూల్‌లో వుండే రోజులలో ఆయనతో నాకు ఎంతో పనివుండేది. ఆయన వాషింగ్టన్ (Washington) విశ్వవిద్యాలయంలో ప్రతిదినం కొన్ని గంటలు విద్యార్థులకి వైద్య విషయాలు చెప్తూంటారు. నీవు వస్తూన్నట్లు ఆయనకి వైరిస్తాను" అని డిక్సన్ నాతో చెప్పారు.

తక్షణం నేను మా ఆఫీసుకి తిరిగి వెళ్ళి, వ్యాపారానికి సంబంధించిన తొందర పనిమీద నేను ఊరు విడచి వెళుతూన్నాననీ, ఇంటికి రావడానికి వ్యవధిలేదనీ అందు చేత నాగుడ్డలు ఆఫీసుకి పంపించ వలసిందనీ మా అమ్మకి ఫోన్ చేశాను. కాని అసలు విషయం ఏమిటంటే, నేను మా అమ్మ దగ్గర సెలవు తీసుకు వెళ్ళేటప్పుడు ఆమె నన్ను ముద్దు పెట్టుకోవడం నాకిష్టం లేదు. అదృష్ట వశాత్తూ టామ్ కూడా ఆసమయంలో ఎక్కడికో వెళ్ళాడు. "ఇన్సూరెన్స్ రేట్ల తగ్గింపు విషయంలో ప్రయత్నంచేయడానికి, క్రొత్త ఇంటికి సంబంధించిన సామాను

తెచ్చే విషయంలోనూ నేను తొందరగా బయలుదేరి వెళ్ళ వలసివచ్చిందని ఒక ఉత్తరాన్ని టామ్‌కి వ్రాసి ఆఫీసులో వుంచి, బయలుదేరాను.

ఒంటి గంటకల్లా 'పుల్‌మన్' (Pullman) [వీటికి నిలువకపోవుచునే పీల్చుకొనుచు దూరదూర స్టేషన్‌లోనే నిలుచు ఉత్తమ ఎక్స్‌ప్రెస్ రైలు డ్రెయినరు] కిటికీల గుండా బయటికి చూస్తూ ఎప్పుడు ఏపరిస్థితిలో నేను తిరిగి వస్తానా అనే వింత ఆలోచనలలో ప్రయాణం సాగిస్తున్నాను.

## 4 వ ప్రకరణం

నేను మాటలలో వర్ణించలేక పోయినా నా భయం నేను చేసే ప్రతిపనిలోనూ కనుపించుచునేవుంది! అందరికీ కనపడ కుండా నేను ఒకడ్రాయింగ్ రూము ప్రత్యేకంగా తీసుకొన్నాను. చీకటి పడగానే కట్టుకున్న గుడ్డలు తీయకుండా మంచం మీద నేపరున్నాను. కంటికి కునుకు పడితేగా! తెల్లవారే సరికి రైలు సెయింట్ లూయీస్ చేరుకొంది. కొంత సేపటివరకూ ఏమీతోచక అటూ ఇటూ తిరిగాను. ఆఖరికి మనోధైర్యం జేసుకొని డాక్టర్ ఆఫీసు గుర్తించి వెళ్ళడానికి నిశ్చయించుకొన్నాను. డాక్టర్‌కి అనుమానం కలిగే విషయాలేమీ చెప్పకూడదని, అనుకొన్నాను కాని నాకుండే భయంతో దీనిని దాచగలనా?

అది ఒక పెద్ద భవనం. డాక్టర్ ఆఫీసు (అడుగు వదలి) పుపరి మూడవ అంతస్థులోవుంది. వచ్చేజనం కూర్చునడానికి ప్రత్యేకంగా ఒక గది. దాని ప్రక్కగా ఒక పెద్ద నడవగుండా

వెళితే వాట్కిన్స్ (Watkins) అనే పేరుతో ఒక తలుపు, దాని తరువాత పరీక్షచేసే గది, నేను చూడడానికి వచ్చినది డాక్టర్ వాట్కిన్స్‌నే. నా టోపీని చేతిలో పట్టుకొని, మెలి పెడుతూ మధ్య అంతస్థులో నిలుచుని వుండగా నర్స్ (Nurse) వచ్చింది.

నాపేరు ఆమెతో చెప్పగానే నేను వస్తానని డాక్టర్ అను కొంటున్నారనీ, కొద్దిసేపటిలో ఆయన వస్తారనీ నర్స్ నాతో చెప్పింది. కూర్చొనడానికి నర్స్ నాకొక కుర్చీ చూపించింది. కాని, నాకు కాలెక్కడ నిలుస్తుంది. " ఒక కిటికీదగ్గరకివెళ్ళి నగరంవైపు శూన్యంగా చూస్తూ నిలుచుండిపోయాను— జేన్‌కి ఉత్తరంవ్రాసి వుండవలసిందా? ఇంతకుముందు రోజూ ఉత్తరం వ్రాసేవాణ్ణే " ఇవాళైనా తప్పకుండా ఉత్తరం వ్రాయాలి. మరి, తనకి కనపడకుండా వచ్చేసినందుకు అమ్మ ఎంతో బాధపడి వుంటుంది. అమ్మకికూడా ఒకఉత్తరంవ్రాయాలి— ఆ ఇన్సూ రెన్స్ సంగతి ఏమి? ఆ—టామ్ చూచుకొంటాడులేస్తూ..." ఈ విధంగా ఆలోచనలు ఒకదాని తరువాత వస్తుండగా నర్స్ తిరిగివచ్చి నన్ను పిలుచుకొనివెళ్ళింది. ఆ నడపగుండా నన్ను ఒక గదిలోనికి తీసుకువెళ్ళి, నా పేరుచెప్పి, అంతర్ధానమై పోయింది ! నెరసిన జుట్టుతో, యవ్వనాన్ని సూచించే కళ్ళతో, విజయాన్నీ, స్వశక్తినీ నిరూపించే హుందాతనంతో, సుమారు ఏభై ఐదేళ్ళ వయసుగల డాక్టర్. వాట్కిన్స్‌ని నేను చూడటంతో నాలో వున్న సందేహాలన్నీ మటుమాయమైపోయాయి. ఈయన తప్పక నా వ్యాధిని నిరూపిస్తాడని నాకు నమ్మకం కలిగింది.

మిస్టర్. లాంగ్ ఫర్డ్! (Mr."Long Ford) డాక్టర్ డిక్సన్ (Dickon) మీ విషయంలో నాకు వ్రైరిచ్చారు. డిక్సన్ నిజంగా చాలామంచివాడు; ఈ చిన్నవిషయానికి మిమ్మల్ని శ్రమపెట్టడం జరిగింది. సరే, ఒక్కసారి మిమ్మల్ని చూస్తాను ఇలారండి" అన్నాడు డాక్టర్ వాట్కిన్స్.

నేను నాపై దుస్తులు తీసివేశాను. వాట్కిన్స్ మచ్చల్ని పరీక్షించి "ఇంతేనా" అన్నారు.

నా కాలిమీదకూడా ఒకమచ్చవుందనిచెప్పి పంట్లాము తీసివేశాను. అ మచ్చలమీద జాగ్రతగా గుచ్చుతూ పరీక్ష చేశారు. నాఆరోగ్యాన్నిగురించీ, మా కుటుంబాన్ని గురించీ ఆయన కొన్నిప్రశ్నలు వేశారు. ఫిలిపైన్స్‌లో నేను పనిచేసిన సంగతి ఆయనతో చెప్పకుండా వుందామని ప్రయత్నించాను కాని ఆ విషయాన్ని ఆయనే పసికట్టి ఒకదానివెనుకఒకటిగా ప్రశ్నలవర్ష కురిపించసాగారు.

పరీక్షించడం పూర్తికాగానే "నేను చూసినవాటిలో ఇది చాలా వింతగావుంది. ఈ మచ్చలకి కారణం చెప్పవచ్చును కాని, ఆ కారణాలు మీవిషయంలో సరిపోవు. ఈ విషయంలో నేనేమీ చేయలేనేమో, మిమ్మల్నివిషయంలో ఫలానావిధంగా చేయండని చెప్పడంకూడా కష్టంగానేవుంది" అన్నాడు డాక్టర్ వాట్కిన్స్.

వైద్యరంగంలో ఒక పెద్ద వ్యక్తి ఈ విధంగా చెప్పడం నాకు చాలా ఆశ్చర్యంవేసింది. ఆయన నిజంగా చాలా నిజా యితీ అయిన వ్యక్తి, తన అశక్తతకి ఆయన పడుతూన్న

ఆందోళన నాకు కంఠానికు కట్టినట్లు కనుపించుతూంది. నేను చాలా దయనీయమైన పరిస్థితిలో, తన సహాయాన్ని అర్థించి వచ్చినట్లు ఆయనకి తెలుసును. ఆయన చేయగలిగినదంతా చేయడానికి సిద్ధంగా వున్నారుకూడా. ఆయన వల్ల నేను ఉపకారం పొందాలంటే, నేను కూడ అతనికి తోడ్పడాలి. ఈ వ్యాధికి సంబంధించిన విషయాలన్నీ నేను ఆయనకి చెప్పితీరాలి.

"డాక్టర్" ... ఇక్కడ నాకంఠం బొంగురు పోయింది నాకే వింతగా తోచింది ... "డాక్టర్! ఇది కుష్టువ్యాధి కాదు కదా?" అన్నాను.

ఆయన విస్తుపోయి నా వైపు చూశాడు. ఆయన నాతో మాట్లాడటానికి ముందు దాదాపు ఒక్క నిముషం సేపు నిశ్చలంగా మిలమిల మెరిసే ఆయన కళ్లు నేరుగా నా కండ్లలోనికి చూస్తువుండి పోయాయి. ఆఖరికి "ఆ ప్రశ్న ఎందుకు వేస్తావ్?" అని అడిగాడు.

అప్పుడు నేను ఫిలిప్పైన్ దీవులలో గడపిన నాలుగేండ్ల విశేషాలూ ఆయనతో పూసగ్రుచ్చినట్లు చెప్పాను. సాంచో, కేరిటాలను గురించీ; కెప్టెన్ తాకీదు ప్రకారం ఒక ప్రదేశాన్నుంచి మరియొక ప్రదేశానికి వెళ్ళడం, ఎన్నో మైళ్ళ దూరం నడచి నడచి, ఊరి శివార్లలోనో లేక ఆ దేశవాసుల ఇండ్లలోనో మకాంవేయడం, ఈ విషయాలన్నీ ఆయనతో చెప్పాను. ఒక్కొక్క సమయంలో ప్రయాణీకులతో పాటు నాటు పడవల మీంద క్రిక్కిరిసి ఏ విధంగా ప్రయాణం చేశామో, మతాల్లోను రక్షణ దుర్గాల వెనుక ... ఆఖరికి పొరపాటున ఆకు...

రోగులున్న రాతి కట్టడంలోనికి నేను ఏ విధంగా వెళ్ళినదీ డాక్టర్‌తో చెప్పివేశాను.

గడచిన కొద్ది నెలలలో నేను ఎంతదుర్భర పరిస్థితులలో జీవితం గడుపుతున్నదీ ఆయన గ్రహించినట్లు ఆయన చూపుల వల్లనే గ్రహించాను.

ఇదిగో అబ్బాయ్! (కొన్ని సంవత్సరాలుగా నన్ను 'అబ్బాయ్' అని ఎవ్వరూ పిలువలేదు) నా అనుభవంలో ఒక్కటంటే ఒకే ఒక్క కుష్టువ్యాధికి సంబంధించిన కేసుని (Case) చూచాను. అది కూడా నేను మెడికల్ స్కూల్‌లో రెసిడెంటు డాక్టరుగా వుండేటప్పుడు. ఏమైనా ఆ పేరుతో దానిని పిలచారు! అప్పుడే ఆ వ్యాధిని గురించి చదివి నట్లు నాకు జ్ఞాపకం.—నిర్మొహమాటంగా చెప్పాలంటే ఈ శరీరం మీాది మచ్చలు కుష్టువ్యాధికి సంబంధించినవో కావో నేను చెప్పలేను. ఈ నగరంలో ఆ వ్యాధిని గురించి తెలిసిన నిపుణు డెవరైనా వున్నారో లేరో కూడా నాకు తెలియదు" అని చెప్పి, కిటికీ దాకా నడచి వెళ్ళి, కిటికీగుండా ఎదో ఆలోచిస్తూన్నట్లు కొంత సేపు బయటికి చూసి, తిరిగి నాదగ్గరకి వచ్చారు.

"ఇదిగో ఇలాచూడు! ఈ విషయాన్ని గురించి ఆలో చించడానికి నాకు కొంత వ్యవధికావాలి." దీనిని గురించి కొంత సేపు మరచిపో. రెండు గంటల సేపటిలో తిరిగిరా. ఈలోపుగా ఈ విషయంలో ఏ ఆదుర్దా పెట్టుకోకు. నాకు తెలిసినంత వరకూ ఎవరైనా నిపుణుడు నాకు జ్ఞాపకానికి వస్తే, నీవు తక్షణం

ఆయన దగ్గరకి వెళ్ళడానికి చేయవలసిన దంతా చేస్తాను" అన్నాడు డాక్టర్ వాట్కిన్స్.

నేను తిరిగి వచ్చేసరికి వేచియుండ వలసిన అవసరమే లేక పోయింది. నర్సు తక్షణం నన్ను డాక్టర్ వాట్కిన్స్ దగ్గరకి తీసుకు వెళ్ళింది. ఆయన ఎంతో సంతృప్తితో, ఉత్సాహంతో వున్నారు ఆ సమయంలో.

చిరునవ్వుతో నీకు తగినవ్యక్తిని కనుగొన్నాను. ఆయన పేరు మేజర్ థామ్సన్ (Major Thompson) ఆయన చాలా సంవత్సరాలు సైనిక వైద్యవిభాగంలో పని చేశారు. ఫిలిప్పైన్స్‌లో కూడా కొంత కాలంవున్నారు. సైనిక వైద్యవిభాగంనుంచి ఆయన 'రిటైరు' అయిన తరువాత ఆయన ప్రస్తుతం ఈ నగరంలోనే వైద్య వృత్తివాడై ప్రాక్టీసు (Practise) చేస్తున్నారు. నాకు ఆయన అంతగా తెలియకపోయినా చాలామంచి వాడని మాత్రం విన్నాను. ఈ చిక్కుసమస్యని ఆయన తప్పకుండా పరిష్కరించగలరని నాకు తోస్తూంది. నీకోసం ఆయన కనిపెట్టుకొని వున్నారు. ఒక టాక్సీ తీసుకొన్నావంటే త్వరగా ఆయనను కలసికొనవచ్చును అని డాక్టర్ వాట్కిన్స్ నాతోచెప్పారు.

మేజర్ థామ్సన్‌లాంటి వ్యక్తిని ఇట్టే గుర్తుపట్టవచ్చును. ధృఢచిత్తుడు, యథాతథానుచరుడు రాటుకీపోటుకీ ఆగినవ్యక్తి, చాలా ముక్తసరిగా మాట్లాడుతాడు. ఆ దీవులలో సైనికులు కలరా, మలేరియా మొదలైన రోగాలకి గురికాకుండా ఆయన అభయహస్తాలకింద సురక్షితంగా నెట్టుకువచ్చారు. నిర్దాక్షిణ్యంగా, తనకి మంచిదని తోచినవిధంగా చేసేవాడు.

రెండు ప్రాణాలు బలిఅయినా ఫరవాలేదు. ఆ రోగాన్ని జయించడమే ఆయన ఏకైకలక్ష్యం.

నేను నా కళ్ళను మూసుకొని వుండగా ఒకగుండు సూదితో ఆ మచ్చలమీద తాకించి చూచాడు మేజర్ థామ్సన్.

"ఫిలిప్పైన్ దేశస్థుల ఇళ్ళలో మకాం వేయవలసివచ్చింది కదూ ?" అని నన్ను ప్రశ్నించాడు.

మాక్సిమో, సాంచో, కేరిటాలనుగురించి పూసగ్రుచ్చినట్లు మేజర్ థామ్సన్‌కి చెప్పాను.

"హ్హాఁ, ఆ పిల్లని నీవు ప్రేమించావుకదూ ?"

"అవును మేజర్, ఆ అమ్మాయిని పెళ్ళిచేసుకొని ఆ దీవులలోనే వుండిపోదామని కొన్నాళ్ళు అనుకొన్నాను."

"హ్హాఁ హ్హాఁ. నాకు నీ శాంపిల్ (Sample మాదిరి) కొంచెం కావాలి. ఆ మచ్చలలో ఒకదానినుంచి కొంచెం ముక్క కత్తిరించి తీసుకొంటాను" అన్నాడు.

ఆ మచ్చలలోనుంచి ప్రతిదానినుంచి ఒకచిన్న ముక్క కత్తిరించాడు. నాకేమీ నొప్పిపెట్టలేదు. తరువాత ఒక చిన్న ప్రతిమెత్తమీద ప్రతి ముక్కరక్తం పైనా నొక్కి ఒత్తి, గాజుపలకలపైన పూశాడు.

"కొంచెంసేపు వేచివుండాలి—వీటిని చూడాలని వుందా నీకు ?" అని అడిగారు. ఒకవిధమైన రంగుపదార్థాన్ని ఆ గాజు

పలకలమీద మేజర్ థామ్సన్ పోస్తూంటే తదేకధ్యానంగా అతని వైపే చూస్తూవున్నాను. ఆ తరువాత ఆ గాజుపలకని పట్టుకొని ఆరనిచ్చాడు. తరువాత నీటిధారక్రింద వాటినికడిగి, ఆరనిచ్చి, మైక్రోస్కోప్ (Microscope) సూక్ష్మదర్శిని దగ్గరికి పరీక్షచేయడానికి తీసుకువెళ్ళాడు.

హఠాత్తుగా తాను కూర్చొన్న కుర్చీని వెనుకకి గెంటి వేసి నిలుచున్నాడు.

"సందేహం ఏమీలేదు. పిసరంతైనాకూడా! ఇవిగో (Hansen bacillus) హాన్సెన్ సూక్ష్మజీవులే ఇవి! సందేహం ఏమీలేవు!" అన్నాడు.

నాతల తిరిగిపోతూంది! నాలో ఒక్కసారిగా థామ్సన్ మీద అసహ్యంపొంగి పొరలి, అతనిని చంపివేయాలన్నంత కోపం వచ్చింది. ఏదో నాలో కనిపెట్టాడుట! తానేదో ఏనుగనెక్కినట్లు సంతోషిస్తున్నవాడను, ఒక నల్లియంతటిది, దానివల్లనా! అదియు డాగియుండేది. నా దగ్గర తుపాకి లేకపోయింది కాని, కాల్చిచంపేద్దును. నేను తూలుతూ బయటికి తలుపు దాకా వచ్చేశాను. కాని నా వెనుకే త్రుటిలో మేజర్ వచ్చేశాడు.

"అయ్యో భగవంతుడా! ఎంతపని చేశాను! సైనికుడా! నీకు కష్టం కలిగించినందుకు విచారిస్తున్నాను. ముందు నా దగ్గరవున్న 'నెపోలియన్ బ్రాందీ' కొంచెం పుచ్చుకొని, ఆ తరువాత ఆ విషయాన్నిగూర్చి పూర్తిగా మాట్లాడుకొందాం" అన్నాడు మేజర్ థామ్సన్.

కాని దీనికి నేనేమీ ఆశ్చర్యపడలేదు. ఆయన తెలిసి వుండికూడా నా మెడచుట్టూ తన చేతులువేసి, నన్ను బల్లదగ్గరికి తీసుకువెళ్ళి కూర్చోపెట్టడం నాకు ఆశ్చర్యంవేసింది. నేను ఒక గ్లాసెడు బ్రాందీని త్రాగి, మరింత కావాలని నా గ్లాసుని వెనుకకి తోసాను.

" డాక్టర్ ! ఇంకేం ఆశలేదా ? ఈ రోగానికి నివారణ లేదా ? అని గొణిగాను దీని నివారణకి ఒక కొత్తవిధానంవుంది " అంటూ దానినిగురించి చెప్పడం మొదలుపెట్టాడు. ఆయన ధైర్యంలో నాకు కొంచెం ధైర్యం చిక్కింది.

" నీవు ఈ విషయంలో చాలారోజులనుంచి ఆలోచిస్తూ న్నావ్. కాని ఇటుపైన మరికొంచెం ఆలోచించాలి. నేను నీ విషయం ఆరోగ్యశాఖవారికి తెలియజేయవలసి వుంటుంది. నీవు మామూలు మనిషివి కావడానికి కొద్దిరోజులు పడుతుంది. ఈ వూరికి బయట నదిఒడ్డున కాళీగా ఒక గుడిసెలాంటి కట్టడం వుంది. ఇవాళ మధ్యాహ్నం అక్కడికి నాతో రావడానికి నీకే దైనా అభ్యంతరంవుందా? నీకు కావలసిన భోజనసదుపాయాలు నేను చేస్తాను, అక్కడ నీవు మకాం వుండటానికి కావలసిన సదుపాయాలన్నీ చేస్తాను. అన్నిసదుపాయాలూ అమరేదాకా ప్రతిరోజూ నేను అక్కడికి వస్తూపోతూ వుంటాను " అన్నాడు మేజర్ థామ్సన్.

" మీరు ఏమిచెప్తే అది చేయడానికి నేను సిద్ధంగా వున్నాను " అని చెప్పాను.

మేము నదిప్రక్కగా వెళ్లేరోడ్డుగుండా డాక్టర్ కారులో ప్రయాణంచేశాం. చెమరుగాఅక్కడొకయి ఇక్కడొక శాలతప్ప వేరే ఇంకేనిూలేవు. కొంతదూరం వెళ్ళిన తరువాత ఒకచోట కారు ఆగింది. నేను కారుదిగి ఏమీ అర్థంకాక ఆలాగేచూస్తూ నిలుచుండిపోయాను. చుట్టూ కర్రల దడికట్టివున్న ఒకపాత గుడిసె లోపలికి ఏవో కొన్నిసామానులు కారులోపలినుంచి దింపి, నాతో ఏవో విషయాలు ఆగకుండా మాట్లాడుతూనే వున్నాడు. కొంతసేపయిన తరువాత "నేనింక వెళ్ళిపోవాలి. నీతో వుండిపోతే బాగానేవుంటుంది కాని వెళ్ళిపోకతప్పదు. రేపు ఉదయమే తిరిగి నేను ఇక్కడికి వస్తాను" అని చెప్పి కారులో వెళ్ళిపోయాడు.

నేను నదిఒడ్డువరకూ నడచివెళ్ళాను. అక్కడ ప్రవాహాన్ని చూస్తూ ఎంతోసేపు ఆలాగే నిలిచిపోయాను. తరువాత ప్రవాహానికి ఎగువగా కొంతదూరం నడచివెళ్ళాను. కను చూపుమేరలో ఎక్కడచూచినా పెంటకుప్పలు దిబ్బలుగాపడి వున్నాయి. ఆ చుట్టుప్రక్కల ఊళ్ళ చెత్తఅంతా అక్కడే పడేశారు. సహించరాని దుర్గంధంతో ముక్కలు బ్రద్దలై పోతూన్నాయి. శూన్యంలోనికిచూస్తూ అలాగే కొంతసేపటివరకూ నిలుచుండిపోయాను. అక్కడ ఒకకాళీపెట్టె ఒకటి తలక్రిందుగా పడవేసివుంది. దానిమీద కూర్చొన్నాను. మళ్ళీ నిశ్శబ్దంగాం కొంతసేపు గడచిపోయింది.

ఇంతలో నాకాలి మడమ మీద ఏదో ప్రాకుతూన్నట్లైంది. చూచేసరికి అది ఎలుక. ఎక్కడ చూచినా ఎలుకలే

ఉలిక్కిపడి ఒక్కసారి పైకి లేచాను. కిచకిచలాడుతూ అవి పారి పోయాయి.

తూర్పుదిక్కుగా కొంచెం కాంతి కనపడుతూంది. ఆ కాంతిలో గుడిసెను వెతుకుకుంటూ వెళ్ళాను. గుడిసె తలుపు తెరచివుంది. నేను లోనికి ప్రవేశించబోతూంటే బిలబిలలాడుతూ ఎలుకలదండు బయటికి వచ్చినదిబడ్డుకి పరుగెత్తుకు పోయింది. ఇంకా ఏమైనా లోపలవున్నా యేమోనని వాటిని భయపెట్ట డానికి నా కాలితో గుడిసె దడిని కొట్టి చప్పుడు చేశాను. తరు వాతలోనికి వెళ్ళి గుడిసె తలుపుమూసి గొళ్ళెం పెట్టాను. ఆ మసక చీకటిలో ఒక పందికొక్కు లోపలనేవుంది. ఆ గుడిసెకి యజమాని 'నీవానేనా' అని నన్ను సవాల్ చేస్తూంది. ఇంతలో నేను గుడిసెతలుపు తీయడానికి వెళుతూండగా ఆ పందికొక్కు హఠాత్తుగా నా మీద పడి కాలిని గోళ్ళతోగీరి, కాలి పంట్లామును చింపివేసింది. నేను కొంచెంవెనుకకు తప్పు కొంటూండగా అది నాపాదాన్ని గట్టిగా పట్టుకుంది. బలం కొలదీ దానిని విదలించడంలో ఎదుటిగోడకి కొట్టుకుంది. చెవులు గింగురుమనేటట్లు అరుస్తూ అది తిరిగి నా మీదికి పరుగెత్తుకు వచ్చింది. ఇంతలో నేను ఒకకుర్చీని దొరకపుచ్చుకొని దాని మీదికి బలంకొలది విసిరాను. కుర్చీ ముక్కలుముక్కలై పోయింది ఈసారి ఆ పందికొక్కు వేగంగా పైకి ఎగిరి నాకోటు అంచుని గట్టిగా పట్టుకొన్నది. నేను నా పిడికిలి బిగించి, దానిమీద ఒక దెబ్బకొట్టాను. అది క్రింద పడిపోయింది. కాలితో దానిని తన్న డానికి ప్రయత్నించాను. కాని, అది నాకు దొరకలేదు. విరిగి పోయిన కుర్చీ డాలుని చేతితో పైకితీయడానికి వంగబోతూం

డగా మెరపులా ఆ పందికొక్కు నా చేతిమీదికి ఎగిరి చర్మాన్ని అదేపనిగా చీల్చసాగింది! నేను కోపంతో ఒళ్ళు తెలియకుండా దానిమెడని నలిపివేశాను! చెవులు గంగురుమనే దానికూతతో నా శరీరంలో రక్తం గడ్డకట్టుకుపోయింది! నన్ను వదలించుకొనడానికి ఆ పందికొక్కు వాడియైన గోళ్ళతో రక్తం దారలు కట్టేలా నా చేతినిచీల్చింది. దానిని వదలిపెట్టడానికి నాకు భయంవేసింది. అప్పటికే అది దెబ్బతిని నడవలేకుండా పడివుంది. అయినా దానిని ప్రాణాలతో వదలిపెట్టకూడదని నిశ్చయించుకొన్నాను. ఒక్కసారి బలంగా నేలనువేసికొట్టి, చచ్చిన ఆపంది కొక్కుని కిటికీ గాజుతలుపులగుండా బయటికి గిరవాటు వేశాను.

గాజుతలుపు బ్రద్దలైన చప్పుడు నాకు వినపడగానే నాలో ఒక్కసారి ఏదో కదలినట్లైంది. ” ఏమిటి? ఏమిటి ఇదంతా? అమ్మ! మేబెల్! టామ్! జేన్! జేన్...జేన్...అందరినీ వదలి దూరంగా, ఈనిర్జనప్రదేశంలో, అంధకారంలో ఒంటరిగా!!...” నా జీవితంలో మొట్టమొదటిసారిగా వెక్కివెక్కి ఏడ్చాను. నేల మీదపడి దొర్లుతూ గుండెబరువు తగ్గేవరకూ ఏడుస్తూనే వుండిపోయాను.

## 5వ ప్రకరణం

ఎవరో తలుపుతట్టుతూన్నారు. అప్పుడే బాగా తెల్లవారింది. నిద్రమత్తుతో నేనువెళ్ళి తలుపుతెరచాను. ఆయన సైనికవైద్యుడు. రక్తపూతగలచేతులు చినిగిపోయిన నాబట్టలకేసి ఆశ్చర్యంగాచూస్తూ లోనికివచ్చి “ఏమిటీ ఉపద్రవం?”

అని అడిగాడు.

"ఎలుకలు! ఎలుకలు! నా ప్రాణాలు తీసేసిందాక ఎలుక!" అన్నాను.

చీరుకుపోయిన నాచేతులవైపు చూపిస్తూ "కరిచాయా?" అని అడిగాడు.

"గీరాయికూడా! ఎక్కడచూచినా అవే!" అన్నాను.

"అవునవును! ఈ పెంటకుప్పల మూలంగా ఎలుకలు ఎక్కువై పోయాయి! చేతికి కట్టుకడతానుండు. కారులో నా మందులసంచివుంది, తీసుకువస్తాను" అనిచెప్పి డాక్టరువెళ్లి మందులసంచిని తీసుకువచ్చాడు.

"దయ్యాలలాగ ఈ ఎలుకలున్నాయే. వాటిని పట్ట డానికి ప్రయత్నించగానే విరుచుకు మీదపడతాయి; సరే కాని నీవు తిండితిని ఎన్నిరోజులైంది?" అని అడిగాడు డాక్టరు.

"నాకు——నాకు నిజంగా జ్ఞాపకంలేదు."

"ఇంకానయం; నాతో నీకుకూడా ఆహారం తీసుకు వచ్చాను." అంటూ డాక్టరు కుంటుతూన్న ఒకపాతబల్ల పైభా గాన్నికడిగి దానిమీద పత్రికపరచాడు. చెప్పితినా, నేను (Utah Light Artllery) ఊటా చిన్నఫిరంగి పటాలంలో ఉంటిననిని. మా మొదటి జగడాలు కలాకన్‌లో, అదియేమి ఒక స్వల్పపని. ఆ మాటవినగానే అదురుపడితిని.

ఆ తరువాత ఊపిరిసలుపకుండా యుద్ధాల్నిగురించీ, తన అనుభవాలని గురించీ ఉపదేశవర్షాలలో కష్టపడుచు త్రొక్కి

పోవడం, ఫిలిపినో అందకత్తెలు వాళ్ళసొగసులు తానెఱిగినట్లు చెప్పుకుపోతూన్నాడు.—చెప్పొద్దూ! నాకుమాత్రం అదోలా వుంది. ఇంతలో ఆహారం సిద్ధంచేయబడింది – డాక్టరుకూడా నాతోపాటే భోజనానికి కూర్చున్నాడు. కూర్చుకోయోధుడా! శీఘ్రం కాని, మా మిత్రులు తిరిగివస్తారు. నేను ఆహారం పుచ్చుకోలేదు. కాన కలసికొంటాను. మేము కడుపునిండా తిన్నాం.

ఇక్కడ ఒకతమాషా జరిగింది. నాకు ఆయనపేరు జ్ఞాపకంలేదు.

"క్షమించాలి! నాకు మీపేరు జ్ఞాపకంలేదు!" అన్నాను.

"ఉఁబ్బే! దానిలో ఆశ్చర్యం ఏముంది. నీ గొడవలో పడి మరచిపోయివుంటావు. నన్ను—బిల్ అంటారులే!—పూర్తి పేరు బిల్ థామ్సన్.

నాకప్పుడు మేజర్ థామ్సన్ బిల్ పేరు జ్ఞాపకంవచ్చింది. నానోట మాటరాలేదు.

చాలా నిమిషాలవాకా ఒకరితో ఒకరు మాట్లాడకుండా అలాగే కూర్చుండిపోయాం. సూర్యుడు తీక్ష్ణంగా ప్రకాశిస్తున్నాడు. వెచ్చగావుంది. బిల్ నా చేతికి ఒకసిగరెట్ అందిచ్చి, అగ్గిపుల్ల వెలిగించాడు. తానుకూడా ఒకసిగరెట్ ముట్టించి, "ఇంతకీ మీ కుటుంబం విషయంలో ఏమాలోచించావ్?" అని ప్రశ్నించాడు.

ఏమిటి ఆలోచించడం. అసలు నాగతి ఏమవుతుందో ఏమీ అర్థంకావటంలేదు. అసలు దీనికి చికిత్స అనేది వుందో లేదోకూడా నాకు తెలియదు. ఏవైపు వెళ్లున్నాను? ఏదో ఒకటి తేలినాక మాతమ్ముడు టామ్ కోసం కబురంపాలను కుంటూను, మా వ్యాపారంలో నాకు అండగా నా పనులన్నీ టామ్ చూస్తూన్నాడు. డాక్టర్ బిల్ ! నా మీద దయవుంచి నిజంచెప్పండి ! అసలీ వ్యాధినుంచి బ్రతికి బయట పడతా నంటారా ? దాచకుండా చెప్పండి ! దేనితో పోట్లాట ఎలాగాలి.

“ఇదిగో ఇలాచూడండి నెడ్ ! నేనేమీ అబద్ధం ఆడ కుండా, ఉన్నది ఉన్నట్లు నీతో చెప్తాను. లేనిపోని చెత్తంతా చెప్పడం నాకిష్టంలేదు. నిజంచెప్పాలంటే ఈ వ్యాధి విషయంలో నాకేమీ తెలియదు. సూక్ష్మజీవులని గురించి నేను విశేషంగా కృషిచేసి పరిశీలించాను. అందుచేత ‘ కుష్టునల్లుల్ని ’ గుర్చి చాలా తెలుసుకొన్నాను. కుష్టు వ్యాధికి సంబంధించిన పరిశో ధనలకోసం నేను ఫిలిప్పైన్స్‌లో (San Lazaro) శాన్ లజారో లోవున్న కుష్టురోగుల శరణాలయానికి వెళ్ళాను. కుష్టురోగుల్ని నేను చూశాను కాని అంతగా ఆ వ్యాధి విషయంలో నేను శ్రద్ధవహించలేదు. కుష్టువ్యాధిని తీసుకువచ్చే ఆ ‘ క్రిమి ’ ని గురించి తెలిసికొనాలనే ఆసక్తినాలో ఎక్కువగా వుండేది. దాదాపు సలభై సంవత్సరాల క్రితం (Henson) ‘ హేన్సన్ ’ అనే నార్వేదేశస్థుడు కుష్టు వ్యాధిని తీసుకుని వచ్చే సూక్ష్మ జీవుల్ని కనుగొన్నాడు. అది ఎలావుంటుందో మాకు బాగా తెలుసు. దీనినే మా పరిభాషలో ‘ ఆమ్లసబ్ధ ’ (Acid-Fast)

అంటాము మైక్రోస్కోప్‌లో ఈ సూక్ష్మ జీవులు క్షయవ్యాధిని తెచ్చే సూక్ష్మజీవుల వలెనే వుంటాయి — ఇక ఆశవిషయం అంటావా — ఉన్నసంగతి చెప్పనే చెప్పాను, ఈ కొత్త పద్ధతి చికిత్సను ప్రయోగించి చూస్తున్నారు. ఫలితాలు ఎలా వున్నాయో నాకు తెలియదు. ఈ వ్యాధికూడా ఇతర వ్యాధుల వంటిదే. ఈ వ్యాధి వచ్చిందంటే ఆశలు వదలుకో వచ్చునని ఇదివరలో అనుకొనేవారు. కాని చికిత్స అవసరం లేకుండగానే స్వల్పంగా వ్యాధిసోకిన వ్యక్తులు కోలుకొంటారు, చికిత్స పొందితే నీవు తప్పక కోలుకొనే అవకాశంవుంది. ఇది నా అభిప్రాయం మాత్రమే; ఏమంటే నాకీ వ్యాధిని గురించి తెలిసినది చాలా తక్కువ."

"మరి నేను ప్రజలను చూడడం విషయం? నాదగ్గర వుండటానికి మీరే మంత భయపడుతున్నట్లు కనపడదే!"

"దానికేం — నేను తగిన జాగ్రతలు తీసుకుంటూన్నాను ఈ వ్యాధిని గురించి నాకు తెలిసినంత మట్టుకు, ఈ రోగుల మధ్య పనిచేసే వైద్యులకిగాని, సామాన్య జనానికిగాని అది సోకిన ఉదంతం నేను వినలేదు. ఈ వ్యాధిని గురించి అంతగా తెలియని వైద్యులు, ప్రజలు సాధారణంగా దీని పేరు చెప్తే భయపడుతూనే వుంటారు. . . .

ఇక మీ తమ్ముడి విషయం, తమ్ముడే అన్న మాటేమిటి; ఎవరితోనైనా సరే దూరంగా ఆవరణ లోపలేవుండి మాట్లాడటం చాలా మంచిది. అలాంటప్పుడు ఈ వ్యాధి సోకుతుందనే భయం ఏమీవుండదు — నేను నీ డాక్టర్ని!

"కుష్టువ్యాధిని గురించి వైద్యులకే అంతగా తెలియక పోవడం ఎందుచేతనో నాకు అర్థంకాదు బిల్ !"

ఈ మాటలకి బిల్ నవ్వుతూ "ఈ నగరంలో కుష్టు వ్యాధి వచ్చిన మొదటి కేసు బహుశా నీదేనేమో! వైద్యులం సాధారణంగా ఆ వ్యాధి వచ్చిన రోగుల మధ్య పనిచేయడం ద్వారానే వ్యాధిని గురించి పూర్తిగా తెలిసికో గలుగుతాం, ఈ దేశంలో కుష్టురోగులు లేకపోలేదు. కాని వారి సంఖ్య చాలా తక్కువ. బహుశా ఒక వెయ్యి మందికూడా వుండ రేమో. ఈ వ్యాధి తక్కిన దేశాలలో వలె యునైటెడ్ స్టేట్స్‌లో వ్యాపించలేదు. కుష్టువ్యాధిని గురించి అనవసరమైన భయం ప్రజలలో ఎక్కువగా వుందని నా అభిప్రాయం. ఒక మనిషినించి మరొక మనిషికి ఈ వ్యాధి ఏవిధంగా వ్యాపిస్తుందో శాస్త్రీయంగా తెలిసికొంటేగాని ఈ భయింపోదు."

"ఆదీవులకి వెళ్ళిన సైనికులు చాలామంది ఈ వ్యాధికి గురి అయ్యారా?"

"ఆ సంగతి నాకు తెలియదు."

"ఈ వ్యాధిసోకిన వారిని ఎంతమందిని చూశారు?"

"నిన్నొక్కణ్ణే!"

ఈ సమాధానం విద్యుదాఘాతంలా నాకు తగిలింది ॥ "ఇంతమందిలో నన్నొక్కణ్ణే ఎందుకు ఏరి చూపించాలి?" అని నాలో నేను గొణిగాను—"ఫిలిప్పైన్స్‌లో దాదాపు డెబ్భైఐదువేలమంది సైన్యంలో పనిచేశారు. అందులో

ఏ ఒక్కరికంటె నేను పరిశుభ్రంగా, ఆరోగ్యసూత్రాలని పాటిస్తు జీవితం గడిపాను. వైబై ఏదువేలమందిలో ఈ పాడురోగం నాకేరావాలా! ఏమి న్యాయమిది? కష్టవ్యాధిగ్రస్తుణ్ణిచూడని డాక్టర్ని మిమ్మల్ని తప్ప ఎవరినీ నేను చూడలేదు—— ఆఁ. చూడకేం, వాట్కిన్స్‌ని చూచాను. ఈ వ్యాధినిగురించి డాక్టర్లకి తెలియకపోతే నాగతి ఏం కాను——గత్యంతరం ఏమిటి? హరి భగవంతుడా, ఇప్పటికే ఈ వ్యాధిని నేను ఇతరులకి అంటించివుంటే! దురదృష్టవశాత్తు మా కుటుంబంలోనే——అమ్మకీ, టామ్‌కీ, జేన్‌కీ ఇది సోకివుంటే!......

ఈ ఆలోచనని నేను భరించలేకపోయాను. ఆ ప్రదేశాన్నుంచి దూరంగా వెళ్ళిపోయాను. నా శరీరాన్ని మోయడమే దుర్భరమనిపించింది—కొంతసేపటికి తిరిగి బిల్ దగ్గరికివచ్చాను.

బిల్ చూపులు అప్రయత్నంగా నన్ను నిలవేశాయి. తమాషాగావుండే అదోరకపు అర్థనిమీలితమైన కళ్ళచికిలింపు నన్ను అతని వశంచేశాయి. ఒకక్షణం ఆగి—" సైనికుడా! నీవు ఈ పనిచేసితీరాలి; ఏమైనాసరే!" ఈ సవాల్‌ని అందుకొని నీవు ధృఢనిశ్చయంతో పోరాడాలి; లేదా ఓటమిని అంగీకరించి, వెన్నిచ్చి పలాయనమేనా చిత్తగించాలి——వేరే మార్గంలేదు——ఈ రెండింటిలో ఏదో ఒకదానికి నీవే నిశ్చయానికి రావాలి" అన్నాడు బిల్.

ఆ తరువాత చాలాసేపటివరకూ నిశ్శబ్దం. నా తలలో సైనికుడా! నీవు ఈ పని చేసితీరాలి" అనే మాటలు ప్రతిధ్వనిస్తూండగా కోటిరైళ్ళ చక్రాలు ధ్వనిచేస్తూ పరుగెత్తాయి.

షవిధంగా ఎంతసేపు గడచిందో......! అంతలోనే . ౯ నిశ్చ యానికి వచ్చేచాను "అవును, బిల్ ! ఈ వ్యాధిని ఎదిరించి పోరాడి తీరుతాను! నన్ను ఏమిచేయమంటారో చెప్పండి! "

"నేనింకా ఆలోచించలేదు. కాని, నాకు తోచిన మూడువిధానాలు నీకు చెప్తాను. వాటినిగురించి బాగా ఆలో చించి నాతోచెప్పు——నీవు ఇక్కడే ఒక ఇల్లు కట్టుకొని వుండ వచ్చును. ఆరోగ్యసంస్థవారు దీనికి అనుమతిస్తారు. కాని ఇక్కడే వుండిపోవడం నీకు నచ్చుతుందని అనుకోను; అదీకాక ఈ వార్తాపత్రికల వాళ్ళకి తెలిసిందంటే నిన్ను ప్రశాంతంగా వుండనీయరు——రెండవది కుష్టురోగులకు (Covisiana State Home for lepres at carvilla) కార్విల్లిలోవున్న లూసి యానా రాష్ట్రపు శరణాలయానికి నీవు వెళ్ళవచ్చును. దానిసం గతి నా కంతగా తెలియదు కాని, రోగుల విషయంలో మంచి జాగ్రత తీసికోబడుతుందని మాత్రం నేను విన్నాను. కాని వచ్చిన చిక్కేమిటంటే నీవంటి ఉత్సాహవంతునికి బలవంతునికీ, సోమరివలె జీవితాంతంవరకూ కార్విల్లీలో గడపడం సాధ్యమా తుందని నేననుకోను!

"ఈ ఎలుకల బాధ పడుతూ నేనిక్కడ వుండలేను. లూసియానాకి వెళ్ళడం కూడా నాకిష్టంలేదు. ఈ రెండు స్థలాలూ మా ఇంటికి దగ్గరే. ఈ విషయం మా వాళ్ళకి తెలి యడం నాకిష్టంలేదు. అయినా టామ్‌కి చెప్పితీరాలి. సాధ్యమై నంత త్వరలో నేను ఈ ప్రదేశం విడచి వెళ్ళిపోవాలి, డాక్టర్."

"సరే క్యూలియన్ (Culion) సంగతి నీకు తెలుసునుగా, ఫిలిప్పైన్స్ దీవులంటే నీకిష్టమేకదూ! క్యూలియన్ పెద్ద దీవే. ఫిలిప్పైన్ ఆరోగ్య సంస్థవారి ఆధ్వర్యంలో అక్కడ ఈ వ్యాధి అదుపులో పెట్టబడుతూంది. అక్కడ విశేషానుభమంగల మంచి డాక్టర్లు ఎంతో మందివున్నారు. వేల కొలది రోగులు వుండటం వల్ల వాళ్ళకి ఈ వ్యాధి విషయంలో విశేషానుభవంవుంటుంది."

"మరి నేను అక్కడకి వెళ్ళాలను కొంటే నన్ను స్టీమరు మీద తీసుకు వెళ్ళడానికి అనుమతిస్తారా డాక్టర్?"

సాధారణంగా తీసుకు వెళ్ళరు. కాని సైనిక దళానికి చెందిన స్టీమరు మీద తీసుకు వెళ్ళవచ్చును ... ఆ సదుపాయానికి ప్రయత్నించవచ్చును. కాని, చికిత్సకి ఈ దేశంలోనే బాగుంటుందేమో అని ఆలోచిస్తూన్నాను. అంతదూరం వెళ్ళే ముందు ఇంకొక డాక్టర్ని చూస్తే బాగుంటుందని నా అభిప్రాయం. ఆయన న్యూయార్క్ (Newyork) లోవున్నారు. ఆయనకి ఈ వ్యాధి విషయంలో మంచి అనుభవం వుంది. అక్కడ వుండటంవల్ల ఒంటరితనం అనిపించినా, దూర దేశమైన క్యూలియన్‌కి వెళ్ళవలసిన నిమిత్తం లేక పోవచ్చునేమో నీవు ఏమి చేయవలసినదీ ఆయన చెప్తారు.

కాని ఆయన దగ్గరకి వెళ్ళడం అంతసులువైనది కాదుగా నేను రైలు మీద వెళ్ళడం మంచిది కాదనుకుంటాను."

"అవును. రైలు మీద వెళ్ళక పోవడమే అన్ని విధాలా మంచిది."

"మాకు ఒక పాతకారు వుంది. అది పనిచేస్తుంది. టామ్ దానిని ఇక్కడకి తీసుకువస్తే బాగుంటుంది."

"ఇంకా చెప్పావ్! దివ్యంగా వుంటుంది. ఈ రాత్రే నేను టామ్‌కీ ఉత్తరం వ్రాస్తాను" అన్నారు బిల్. టామ్‌కి ఉత్తరం వ్రాయడానికి చెప్పవలసిన వివరాలన్నీ బిల్‌కి చెప్పాను. వాటితో డాక్టర్ బిల్ తన కారు మీద వెళ్ళిపోయారు.

## 6 వ ప్రకరణం

రెండు రోజుల తరువాత టామ్ వచ్చాడు. నా మకాం ఆవరణ దగ్గరనుంచి చాలా దూరంవరకూ రోడ్డు కనుపిస్తూం టుంది. బిల్ కారు వెనుక మా పాతకారు వస్తూండడం నేను చూశాను. బిల్ కారు తిన్నగా ముందుకు వెళ్ళిపోయింది. టామ్ మాత్రం కారుని ప్రక్కగా ఒక సందులోకి మళ్ళించాడు. టామ్ నన్ను సమీపిస్తూంటే చూడడానికి నాకు నిజంగా భయం వేసింది. తెల్లగా పాలిపోయి చిక్కి శల్యమైపోయాడు టామ్. కళ్ళు చాలా లోతుకి పోయాయి.

టామ్ ఆవరణ దగ్గరకి రాగానే ఒకరి నొకరు క్షణం సేపు చూసుకొన్నాం. టామ్ కంఠం నీరసంగా, బొంగురు పోయింది వస్తూనే.

"నెడ్, ఇది చాలా దారుణం, మేమంతా నీ కోసం బెంగపెట్టుకున్నాం—ఈ పరిస్థితి మరీ దారుణం" అన్నాడు టామ్.

" ఇదిగో టామ్, ఈ దడికి అవతల వైపు ఆ పెట్టె లాంటిది వేసుకొని కూర్చో.

టామ్ కొన్ని సిగరెట్లు తీసి, తాను ఒకటి పుచ్చుకొని నాకు తక్కినవి ఇచ్చాడు. దడికి లోపల నేనూ, బయట టామ్ కూర్చొని మాట్లాడుకొన్నాం.

" నెడ్, నన్ను ఏమిచేయమన్నా చేయడానికి సిద్ధంగా వున్నాను డాక్టర్. థామ్సన్ న్యూయార్కు వెళ్ళడం విషయం ఏదో చెప్పారు ! ఏమిటది ? " అన్నాడు టామ్.

" అవును, నా వ్యాధి విషయంలో నాకు సహాయం చేయడానికి న్యూయార్కులో ఒక డాక్టర్ వున్నారట, న్యూయార్కుకి వెళ్ళడానికి కారు మీద వెళ్ళటమే అన్ని విధాలా మంచదని నా కనిపించింది. ఒక వేళ ఆయన ఈ విషయంలో ఏమీ చేయలేకపోతే నేను తిరిగి ఫిలిప్పైన్ దీవులకి వెళ్ళి పోవలసి వుంటుంది, "

" కాని నీ వ్యాధి తప్పక నయమౌతుందని డాక్టర్ థామ్సన్ చెప్పారే ... "

" ఇదిగో టామ్, వాస్తవిక విషయాల్ని దాచిపెట్టి మనల్ని మనం మోసం చేసుకొనడం మంచిదికాదు. నెలల తరబడి నేను ఈ వ్యాధిసంగతి ఆలాగే దాచిపెట్టాను. ఆలా దాచడంవల్ల ఏమి లాభించింది ! అవును—నాకు కుష్ఠువ్యాధి వచ్చింది; ఏం, అలావిస్తుపోయి చూస్తావేం టామ్ ? దీనిని ఎదిరించిపోరా

డాలి కాని, దాచితె దాగుతుందా? మూడురోజులపాటు అహోరాత్రాలు ఈ విషయాన్నిగురించి ఆలోచించి ఆలోచించి నాతల పగలకొట్టుకొన్నాను. ఆఖరికి ఒకనిశ్చయానికి వచ్చాను. నేను ఇప్పుడు న్యూయార్క్‌కి వెళ్ళితీరాలి. అక్కడ బహుశా ఆశ్చర్యకరంగా ఈ వ్యాధి నివారణజరుగవచ్చు! అందుచేత ఈ విషయంలో నాకు నీ సహాయం కావాలి టామ్!"

"కాని, మనఇంటిదగ్గర అమ్మతోనూ వాళ్ళతోనూ ఏమని చెప్పను? జేన్‌కి ఏమనిచెప్పను?" అన్నాడు టామ్.

"నేను చచ్చిపోయానని చెప్పు."

"చచ్చిపోయావనా? నెడ్, నేనుమాత్రం ఆపని చేయలేను. అమ్మతో అబద్ధంచెప్పమంటావా? నీవు బ్రతికవుండగా చనిపోయావని జేన్‌తో చెప్పలేను నెడ్......" టామ్ కంఠం బొంగురుపోయింది.

"వేరే గత్యంతరంలేదు టామ్! నాకేమీ మతిపోలేదు తెలుసా? జేన్ నన్ను మరచిపోవలసివుంటుంది. అమ్మకి, జేన్‌కీ నీకూ ఈ విషయంతెలిస్తే ఏలాగ అని నేనెప్పుడూ భయపడుతూనే వున్నాను. టామ్! నీకొక చిన్నఉపాయం చెప్తాను. నేను మనకారుని బాగా లోతుగావున్న నీళ్ళలోకినడిపి, నాపేరు తెలిసేటట్లు కొన్ని ఆనవాళ్ళు కారులో వుంచేస్తాను. పత్రికలు నేను ఆత్మహత్య చేసుకొన్నట్లు ప్రకటిస్తాయి!"

"నెడ్, నామీద ఒట్టుపెట్టిచెప్పు! నిజంగా నువ్వు ఆత్మహత్య చేసికోవుకదూ? ఆ తలంపు ఇచ్చట మొదటిరాత్రిలో పుట్టింది కాని అట్లుచేయకూడదని వెంటనే తీర్మానించుకొంటిని."

"ఊఁ హూఁ, అలాంటిపని చేస్తానని ఎప్పుడూ అనుకోకు టామ్! అలాంటిపని ఎప్పుడూ చేయనని నీకు మాట ఇస్తున్నానని—అలాంటిపని ఇప్పుడు కాని, మధ్యతనభావిలో కాని చేయనని నీకు మరొకసారి మాట ఇస్తున్నాను......టామ్, నీవు వచ్చేటప్పుడు ఏమైనా డబ్బు తీసుకువచ్చావ్?"

"తీసుకువచ్చాను నెడ్, డాక్టర్ థామ్సన్ దానిని తన చేతికిమ్మన్నారు, అందుచేత ఆయనకి ఐదువందల డాలర్లు ఇచ్చాను. భోజనం చేయగానే ఆయన ఇక్కడికే వస్తారు.—నెడ్, నీకోసం తినడానికి ఏవో కొన్ని తీసుకువచ్చాను. అవి కారులో వున్నాయి. వెళ్ళి తీసుకువస్తానుండు!

టామ్ వెళ్ళి వాటిని తీసుకువచ్చాడు.—కోడిమాంసము, మొక్కతోటకూర, రుచికరమైన పచ్చళ్ళు ( Delicatessen Salad) వెన్నతోనింపిన రొట్టె, వీటిని పెట్టుకోడానికి కాగితపు పళ్ళేలు, రెండుఫోర్కులు, (ముళ్ళు) రెండుగిన్నెలు, రెండు బీరుసీసాలు—మేమిద్దరం వీటినితిని, బీరుని త్రాగాము.—అప్పటికి మాలో బాగా ఉత్సాహంగావుంది. తరువాత మావర్తకాన్ని గురించి చాలాసేపు మాట్లాడుకొన్నాం.

" నేను నాపేరు మార్చుకోపోతూన్నాను టామ్! ఇటు పైన నెడ్ఫెర్గూసన్ అనే పేరుతో పిలువబడతాను,—మరి, నాకు తరచు ఉత్తరాలు రాస్తూండకేం. అది మనిద్దరికీశ్రేమే, నాదగ్గరనుంచి నీకు ఉత్తరం వచ్చేదాకా డాక్టర్ బిల్థామ్సన్కే వ్రాస్తుండు. ఆ ఉత్తరంలోనే నాకుకూడా ఒకచిన్న చీటీ

పెడుతూండు.—మరి నీకు నేను చెప్పవలసినది ఇంకొక్క విషయ ముంది. ”

ఇంతలో డాక్టర్ థామ్సన్ మలుపుతిరిగి కారు నడిపించుకు వస్తూన్నాడు. హడావిడిగా టామ్‌తో చెప్పవలసినది పూర్తిచేశాను—! “ టామ్, ఇక్కడికి సమీపంలోవుండే ఏదో వొక గెరేజ్ (garage) మోటారుకారు నుంచు కొట్టుకి మన కారుని తీసుకువెళ్ళు. కారుని అక్కడవుంచి, నీవు వెళ్ళిపోతూన్నట్లు, అన్నయ్యవచ్చి కారుని తీసుకొంటాడనీ వాళ్ళతోచెప్పు. ఫెర్గూసన్ అనేపేరే ఉపయోగించు సుమా. ఇక్కడికి మాత్రం నీవు తిరిగిరాకు. ఎవరిచేతనైనా మనకారు ఎక్కడవుంచినదీ చీటీవ్రాసి పంపించు—నీదగ్గర మిగిలినడబ్బంతా నాకిచ్చేస్తే బాగుంటుంది. ”

డాక్టర్ బిల్‌థామ్సన్ కారులోనుంచి దిగుతూండగా టామ్ నాచేతికి వందడాలర్ల చెక్కును నాచేతికిస్తూ “బిల్ థామ్సన్ చేతిలో ఐదువందల డాలర్లు పెట్టడానికి నాకు మనస్సు రాలేదు. కాని ఏం చేయను ? ” అన్నాడు టామ్.

“ మరేమీ ఫరవాలేదు టామ్, బిల్ బ్యాంక్ కంటే నమ్మకస్తుడు.—ఒకవేళ ఎందుకైనా అవసరంవుంటుందేమోనని ఈడబ్బు అడిగాను.......”

ఇంతలో బిల్ తనకారులోనుంచి ఏదో పైకి లాగుతున్నాడు ! . . . అది ఒకశ్లైపు రైటరు।

" నీకు రాయవలసిన ఉత్తరాలేమైనా వుంటాయేమోనని దీనిని తీసుకువచ్చాను । " అన్నాడు బిల్ చెవులు గింగురు మనేలా !

ఆ టైపు రైటరుని ఒక పెట్టె మీద పెట్టి టామ్‌ని దానిలో ఒక తెల్లకాగితం అమర్చమన్నాను. ఇప్పుడు జేన్‌కి ఉత్తరం రాయడం సులభమే అయింది. నా చేతికి వున్న కట్లు ఏలాగో తప్పించి, జేన్‌కి ఒక చిన్న ఉత్తరం టైపు కొట్టాను. " నాకు ఒంట్లో బాగాలేదనీ, నా చేతులు స్వాధీనం లేక పోవడం చేత అట్టే రాయలేక పోతున్నాననీ, వాటి చికిత్స కోసమే ప్రస్తుతం న్యూయార్క్ వెళుతూన్నాననీ; ఆమెను నేను ఎంతగా ప్రేమించానో వ్రాయటానికి మాటలు చాలవనీ, ఆమెను వదలి వుండటానికి చాలా బాధపడుతున్నాననీ " ముక్తసరిగా టైపు చేశాను.

ఉత్తరం ముగించాక టామ్‌ని వెళ్ళి పోమని చెప్పాను. టామ్‌ని ఎగా దిగా బాగా పరిశీలనగా చూశాను. నా సోద రుడు టామ్ ఇప్పుడు బాగా మనిషి అయాడు – మేమిద్దరం బాగా పొడవే. టామ్ సన్నని నడుములో బక్క పలుచగా వున్నాడు అవును మనిషి అలాగే వుండాలి—నాతమ్ముడు టామ్‌ని చూచి నప్పుడు నిజంగా గర్వపడ్డాను.

టామ్ నాతో ఏదో చెప్పాలని ప్రయత్నించాడు. కాని తడబడసాగాడు—నోటిలో మాటలు నోటిలోనే వుండి పోయాయి

" ఆ విషయం రాత్రి బిల్‌ని కలసికొన్నప్పుడు చెప్పు టామ్ ! " అన్నాను. అంతటితో టామ్ కుదట పడ్డాడు.

టామ్ వెనకకి తిరిగి కారు దగ్గరకి వెళ్ళి వెంటనే కారుని తిన్నగా ముందుకు తీసుకుపోయాడు. నేను ఆవరణ దగ్గరనిలిచి కారు దూరమయేవరకూ చూస్తూ వుండిపోయాను.

## 7వ ప్రకరణం

నేను న్యూయర్క్ చేరడానికి చాలా రోజులు పట్టింది, ఏలాగై తేనేం. ఆఖరికి న్యూయార్క్ చేరాను, డాక్టర్ టాడ్ (Doctor Todd) ఆఫీసు నగరం తూర్పు భాగంలోవుంది. నా కారు ఆయన ఆఫీసు ముందుగా ఆపి లోనికి వెళ్ళాను. నాగుడ్డలూ, నావాలకం చాలా అసహ్యంగా వున్నాయి. అక్కడ నర్సుకి ఫెర్గూసన్ అనే పేరు తెలిసి వుండటం వల్ల నన్ను లోనికి తీసుకు వెళ్ళింది లేబరేటరీ (laboratory) లోపలికి ఐదు నిమిషాల తరువాత ఒకాయన లోనికి వచ్చారు.

దక్షిణ ప్రాంతంలోనూ, పశ్చిమ ప్రాంతంలోనూ వుండే డాక్టర్లలాగా, బిల్‌లాగా కాకుండా ఈయన కాలేజీ ప్రొఫెసర్‌లా కత్తిరించిన మీసాలతో, గొర్రెమణిలాంటి గడ్డంతోవున్నారు. కాని వచ్చీ రావడంతో నే ఎంతో సానుభూతితో, నాతో మాట్లాడారు.

"స్నానం చేస్తారా? అదిగో, ఆ గుమ్మంలో నుంచి వెళ్ళి కుడివైపుకి తిరిగితే స్నానాల గది వుంది."

"స్నానం! నిజంగా ఈయన నాకు అందరాని భోగాలన్నీ అందిస్తున్నారు !!"

"పరిశుభ్రమైన దుస్తులసంచి తీసుకొందునా అని అడి

శ్రద్ధగా పరిశీలించారు. నా పిప్పుసాల స్థలంలో ఆయన చాలాసేపు పరీక్షగా చూడసాగారు.

“ఇంక నీవువెళ్ళి దుస్తులువేసుకురా, తరువాత సావకాశంగా మాట్లాడతాను” అన్నారాయన.

ఆయన చెప్పినదేమీ నాకు ఉత్సాహం కలిగించలేదు. ఇంకొకచోట కొత్తగా స్పర్శజ్ఞానం నశించిన ప్రదేశాన్ని ఆయన కనుగొన్నారు.

“ఇక్కడ ఒక ఆరునెలలవరకూవుండి వ్యాధి నయమౌతుందేమో చూడడం మంచిది. నిజం చెప్పాలంటే ఈ వ్యాధి నీశరీరంలో వ్యాపిస్తూంది; ఏం, ఇక్కడ వుండటానికి ఏమీ అభ్యంతరంలేదు కదూ?” అని అడిగారు డాక్టరు. నేను అక్కడ వుంటానని చెప్పాను.

“మిస్టర్ ఫెర్గూసన్, నీవు ఇక్కడ వుంటావని డాక్టర్ థామ్సన్ నాకు వ్రాశారు. నీ వసతి సౌకర్యాలుకూడా ఏర్పాటు చేయవలసిందని ఆయన నాకు వ్రాశారు. అందుచేత ఇక్కడికి సమీపంలో పట్టణానికి సంబంధంలేకుండా (Greenwich) గ్రీన్‌విచ్ అనే పల్లెటూరులో నీకు బస ఏర్పాటుచేశాను. నీవంట నీవే వండుకోవాలి. పాత్రలు కడగటం గది బట్టలు శుభ్రంచేసుకొనడం అన్నీ నీఅంతట నీవే చేసుకోవాలి. అక్కడవుండే ఒక కిరాణాకొట్టులో నీకు కావలసిన వస్తువులన్నీ అందజేస్తుండవలసినదిగా తాఖీదు పంపించాను. అవన్నీ నీమకాం దగ్గరకే వస్తాయి. ఒకవేళ ఏమైనా మార్పుచేయవలసినప్పుడు మన నర్సుకి ఫోన్

చేస్తే ఆమె తగిన ఏర్పాటుచేస్తుంది. నీ మకాంలో ఫోన్ సౌక ర్యం వుండటం నిజంగా చాలా సౌకర్యంగా వుంటుంది. ఒకవేళ ఫోన్ పనిచేయకపోతే నాకు తెలియజేస్తే తక్షణం దానిని సరి చేయడానికి ఎవరినైనా పంపుతాను. ఇక ఎవరికైనా డబ్బు ఇచ్చేటప్పుడు నాణేలను మాత్రమే వాడుతూవుండు. వాటిని ఇచ్చేముందుమాత్రం వాటిమీద బాగా ఆల్కహాల్ పోసి మరీ ఇస్తుండు. ఇది చేసేటప్పుడు బయటికి వెళ్ళేటప్పుడు మాత్రం చేతికి తొడుగులు ఉపయోగించడం మరచిపోవద్దు. ఇదిగో ఈ చిరునామా తీసికో. ఇదిగో ఈ కాగితపుసంచిలో కొన్ని మాత్రలున్నాయి. అవి చాల ముఖ్యాలు. రోజుకు రెండు పూటన ప్రతిరోజూ వాడుతూండు. భరించలేనంతగా వాం తులు వెళుతూంటే మాత్రం మాత్రలు వేసుకోవడం ఆపు చేయి.—ప్రతి శనివారం సాయంత్రం ఐదుగంటలకి నా ఆస్పత్రికి వస్తే బాగుంటుంది. ఆ సమయంలో రోగులుకూడా ఎవరూ వుండరు.

ఆ మాత్రలతోపాటు బూడిదరంగు ఔషధపు సీసాకూడా ఒకటి నా కిచ్చారు.

" శరీరం బాగా శక్తివంతంగా వుంచుకోవడం చాలా ముఖ్యం. నీకు త్రాగుడు అలవాటువుందా ? "

" వుందిగాని, మోతాదుగానే. "

" మంచిదే; అతిగా దేనిని తీసుకున్నా చెడ్డదే—ఇంకొక్క సంగతి ఇతరులతో సంబంధం పూర్తిగా వదలిపెట్టాలి."

"ఈ డాక్టర్‌కి ఏకోశానా దయాదాక్షిణ్యాలున్నట్లు లేదే!"—ఇంతలో నర్స్ వచ్చి నాచేతికి కొన్ని తాళపుచెవుల నందిచ్చింది—బహుశా డాక్టర్ చిన్నబొత్తామునొక్కి పిలిచి వుంటాడు—నేను వాటిని తీసుకొని వెళ్లడానికి లేచాను.

నేను నా కారులో బయలుదేరి మాన్‌హట్టన్ (Manhatta) బ్రూక్‌లిన్ (Bruckleyn) చుట్టూ గిరగిర తిరుగుతూనే వున్నాను. ఎక్కడచూచినా జనసమ్మర్దమే. మొదట నేననుకొన్నట్లు "ఆత్మహత్య" ప్లాను ఏమంత సులువైనది కాదని తేలింది.

ఒకపాడిపరిశ్రమ కేంద్రందగ్గర నా కారునుఆపి ఒక సీసా పరిశుభ్రమైన పాలు తీసుకన్నాను. కాగితంలోచుట్టి అమ్ముతున్న రెండుజతల రొట్టెవొంతర్లనుకూడా తీసుకొని సంతృప్తిగా తిన్నాను. కడుపునిండగానే తిరిగి "సరియైన ప్రదేశం కోసం వేట ప్రారంభించాను. ఆఖరికి నాకు కావలసిన ప్రదేశం (Harlem) హార్లెమ్‌కి దగ్గిర తూర్పునది (East River) వొడ్డున ఒకపాత పడవలరేవూ, దానికి ఆనివున్న పాతిబాటా దొరికాయి. ఈ ప్రదేశాన్ని ఆనవాలుపెట్టుకొని నా బసకి తిరిగి వెళ్ళిపోయాను.

అర్ధరాత్రి రెండుగంటలవేళ నేను ఆ ప్రదేశానికి చేరుకొన్నాను. వీధులు, రోడ్డు, పడవలరేవు, అన్నీ నిర్మానుష్యంగావున్నాయి. పడవలరేవువరకూ కారుని నడిపించుకు వెళ్ళాను. ఇంజను ఆపకుండా, బ్రేకుల్ని సడలించి, గేర్‌లో వుంచి, బయటికి ఉరికాను. కారు తిన్నగా నీటిలోపలికివెళ్ళి

తలక్రిందులై పోయింది. ఎవరో నావైపు పరుగెత్తుకొనివస్తూన్న ట్లనిపించింది! కాని దాదాపు వందగజాలపైగా దూరం వుండ టంవేత రెండోకంట పడకుండా ప్రక్కదారిలోనికి తప్పుకొని వచ్చేశాను.

మరునాటి ఉదయం వార్తాపత్రిక కొనడానికి బయటికి వెళ్ళాను. గ్లోవ్సువున్న చేతితో చిల్లరడబ్బులకోసం జేబులు తడవి, ఒకపత్రిక కొన్నాను. ఆ పత్రిక పద్నాలుగవ పుటలో "నా చావు"కి సంబంధించిన కథని చదివాను! నా కారూ, దానిలోని సంచీ, నా చిరునామావున్న కాగితాలూ వాళ్ళకి దొరికినాయి। కాని శవంమాత్రం దొరకలేదుట!! హార్బరు పోలీసులు నిర్విరామంగా శవంకోసం గాలించారు. కాని, పోటు జోరుగావుండటంవల్ల బహుశా సముద్రమధ్యానికి కొట్టు కొనిపోయి వుంటుందని అనుమానపడ్డారట! 'శవం' మాట తలచుకోగానే నా శరీరం ఒక్కసారి గగుర్పొడిచింది.

న్యూయార్కులో దాదాపు ఒక సంవత్సరం పాటు నేను వున్నాను. నాకు సౌకర్యంగా వుండటంకోసం టాడ్ చేయవలసిన ఏర్పాటులన్నీ చేశారు. ఆఖరు రోజులలో ఆయనంటే నాకు నిండుప్రీతి ఆయన ఇంకాగే ఇంకెవరైనా కుష్టురోగులకి చికిత్సచేస్తున్నారేమో నాకు తెలియదు. వాస్త వంగా నేను ఒక్కర్నీ చూడలేదు. నా చుట్టూవుండే దాదాపు ఏభై లక్షలమంది జనంలో సాధ్యమైనంతవరకూ నేను ఒంటరి గానే తలవుంచారు. కారు దగ్గరికివెళ్ళి బట్టలసంచిని తీసు కొని స్నానాలగదిలోకి వెళ్ళాను—ఆ గదిలో ధారగా స్నానం

చేయడానికీ, తక్కిన అధునాతనసౌకర్యాలన్నీ వున్నాయి. అంత దూరం ప్రయాణంచేసి వచ్చాక ఈ స్నానం ప్రాణానికి ఎంతో హాయిగావుంది. ఆ తరువాత నా శరీరాన్నంతనీ డాక్టరు ఎంతో గానే వుండిపోయాను. రైళ్ళు, భూగర్భపు రస్తాలు నా వరకవి నిషూధమైనవి. అల్లే తీగమీద వెళ్లు బండ్లు నేను బహిష్కరించ వలసిన వాహనాలు! ఆ సంవత్సరం 'నవ్వు' అనేమాటని పూర్తిగా నేను మరచిపోయాను!

ఆ తరువాత డాక్టర్ టాడ్ తన ఆఫీసుకిరమ్మని నాకు ఫోన్ చేశారు.

నేను వెళ్ళగానే డాక్టర్ టాడ్ నావ్యాధి నెమ్మదించ టంలేదనీ, ఈ పరిస్థితికి తాను చాలా విచారిస్తూన్నాననీ నాతో చెప్పారు.

ఈ వ్యాధి లక్షణాన్ని అంతకుముందే నేను ఊహించి వుండకపోతే ఈ వార్త నన్ను మరింత విచారంలో ముంచివుం డేది. కాని, ఫలిత మేవిధంగావున్నా ఈ వ్యాధిని ఎదిర్చి పోరా డాలనే కృతనిశ్చయానికి అంతకుముందే నేనువచ్చి వుండటం చేత నాకీవార్త అంత భయాన్ని కలిగించలేదు—అన్నిలక్షల మంది జనంతో నిరంతరం మహోత్సాహంతోవుండే ఆ నగ రంలో ఊడియు ఉండకుండనట్లు ఒంటరిగా, జీవితం గడపడం ఒక్కరోజైనా దుర్భరమనిపించింది.

అందుచేత క్యాలియన్‌కి తిరిగి వెళ్ళిపోవడానికి నిశ్చ యించుకొన్నాను. ఈ సంగతి డాక్టర్ బిక్‌కి వ్రాయవలసినదిగా టాడ్‌ని కోరాను. ఆ విధంగానే ఆయన బిల్‌కి వ్రాశారు. నేను

తిరిగి నా ఒంటరి మకాముకి చేరుకొన్నాను—బిల్ కూడా తన మాట నిలబెట్టుకొన్నారు. త్వరలోనే శాన్‌ఫ్రాన్సిస్కో వెళ్ళే ఓడ బయలుదేరబోతున్నదనీ, దానిలో ప్రయాణంచేసి వెళ్ళడానికి నన్ను తక్షణం బయలుదేరి రావలసినదనీ డాక్టర్ బిల్ ఉత్తరంవ్రాశారు. డాక్టర్ టాడ్‌తో నేను వెళ్ళిపోవడానికే నిశ్చయించుకొన్నట్లు చెప్పి, తమ్ముడు టామ్‌కికూడా ఒకఉత్తరం వ్రాశాను.

ఆ తరువాత నేను ఉపయోగించిన సామానులన్నీ ఒక చోటికి చేర్చి ముక్కలు ముక్కలుగా చేసి, అంటించి వేశాను. తరువాత నేను నివశించిన చోట క్రిమినాశక పదార్థాలను బాగా చల్లి, రోగాన్ని వ్యాపింపజేసే సూక్ష్మజీవుల భయం లేకుండా డాక్టర్ టాడ్ చెప్పిన విధంగా చేశాను. ఒక్క ట్రంకు పెట్టె, టైప్ రైటరు, టాకింగ్ మిషన్ మాత్రం మిగిలినాయి. వీటిని ఓడలోనికి తాను వెనుక పంపిస్తానని డాక్టర్ టాడ్ చెప్పారు.

తరువాత నేను వున్న మకాముకి తాళం వేసి బయలుదేరాను.

## 8 వ ప్రకరణం

రైలు లైన్లు మొండుగ నుండటచేత పదినొకండవ అవెన్యూ రస్తాను యమునిశాల వీధి అనుదురు. అద్దానికి నడచి వెళ్లి వేచియుండి సమయం వచ్చినపుడు ఒక వాగనులోకి ఎక్కితిని.

నేను శాన్ ఫ్రాన్సిస్కో చేరు కొనడానికి పడిన అవస్థలు తలచుకొంటే ఈ నాటికీ ఒడలు జలదరిస్తుంది. అర్ధరాత్రి వేళ చిన్న చిన్న స్టేషన్లకి చేరుకొంటూ, దొరికిన బండి ఎక్కుతూ, అడ్డదార్లగుండా ప్రయాణం సాగిస్తూ, వెచ్చగా వుండటానికి రాకుసి బొగ్గు ఎగుమతి చేసే పెట్టెలలో కూర్చొని, చలిచేత తిమితమైన చేతితో పట్టుకొనియుండగలనో లేదో అని చింతించుచు ఊచలు పట్టుకొని వ్రేలాడుతూనూ, ఈ విధంగా ప్రయాణం సాగించాను. దారిలో దొరికిన చోట ఆహారం తింటూ, లేకపోతే పస్తువుంటూ, వ్యవసాయదారుల ఇళ్ళ వద్ద తిండికి ముష్టి ఎత్తుతూ, ఆహారానికి నేను డబ్బు ఇవ్వడానికి సిద్ధపడగా నా వైపు కొరకొరా కొందరు చూడగా స్నేహించుటకు వచ్చు పరారీలను దూరాననుంచియు ఇరు సముద్ర మధ్యలో బోవు ఎక్స్‌ప్రెస్సు మొదటి తరగతి కివ్వబడు సౌకర్యాలన్ని గొనుటకు డబ్బుండియు ఇతరుల కంటు నేమో అను భయముచేత అట్లు చేసుకొనకయు మొత్తం మీద అనేక విచిత్రాను భవాలతో శాన్ ఫ్రాన్సిస్కో చేరు కొన్నాను. నేను వెళ్ళబోయే ఓడ కూడా ఆ నాడే ప్రయాణం సాగించ బోతూంది ఎట్టకేలకు అంటు వ్యాధి పరగించుపాపం నాకు రానేరాదు. అందుచేత వెంటనే ఓడల రేవుకి చేరుకొన్నాను. ఓడకి వేసివున్న బల్లచెక్క దగ్గరకి వెళ్ళేసరికి అక్కడ కాపలా సైనికుడు నన్నాపుచేశాడు.

" డాక్టర్ సిడ్నీతో (Dr. Sidney) నెడ్ ఫెర్గూసన్ వచ్చినట్లు చెప్పవలసిందని అతనితో అన్నాను. కొద్ది సేపటిలో వైద్య దళానికి చెందిన ఒక ఉద్యోగి వచ్చి " నీ పేరు ఫెర్గూ

సన్ ” కాదూ అన్నాడు. అవునని చెప్పగానే పైన లోపలికి నన్ను రమ్మని తీసుకు వెళ్ళాడు.

నేను విడిగా ఉండవలసిన గది దగ్గరకు నన్ను తీసుకు వెళ్ళాడు. ఆ గది చిన్నదైనా మంచి సౌకర్యంగా వుంది. స్నానాల గది కూడా దానికి ఆనుకొనేవున్నది. టామ్ దగ్గర నుంచీ, బిల్ దగ్గరనుంచీ వచ్చిన ఉత్తరాలూ, బంగీలూ, గదిలో వున్నాయి. వాటిని ఆలాగే వుండనిచ్చాను. నాబట్టల సంచి విప్పితిని. నా జుట్టు బాగా పెరిగి అసహ్యంగా వుంది. న్యూయార్కులో నా అంతటనేనే జుట్టు కత్తిరించు కొనే వాణ్ణి, కాని ఈ రైలు ప్రయాణంలో ఇదంతా సాగక జుట్టు బాగా పెరుగనిచ్చాను. అందు చేత జుట్టు కత్తిరించు కోడానికి కూర్చొన్నాను. కొంతసేపైన తరువాత నాగది తలుపు ఎవరో తట్టారు ఆయనే డాక్టర్ సిడ్నీ. డాక్టర్ సిడ్నీ చాలా తమాషా అయిన వ్యక్తి. పొట్టిగా, లావుగా, గుండు సూదిలా మెరిసే బట్టతలతో ఎప్పుడూ నవ్వుతూ, నవ్విస్తూవుంటాడు, ఏభై యోపడిలో పడ్డా పొట్ట చెక్కలయేటట్లు నవ్వుతూనన్ను పిలిచి మనిషిలో ఇంతమార్పు రావడం నేనెక్కడా చూడలేదు; ఆఖరికి నీ జుట్టు నీవే కత్తిరించుకొంటూన్నావా ? అయినా బాగానే చేసుకున్నావులే అని తిరిగి నవ్వాడు.

“ డాక్టర్ సిడ్నీ, మీ మెప్పుదలకి నిజంగా కృతజ్ఞుణ్ణి. నన్ను ‘నెడ్’ అని మాత్రమే పిలవండి ఏం ? ”

“ దానికేం, నెడ్ అని పిలవడమే నాకిష్టం; ఇక నీ నిత్య కృత్యం విషయమా ఆహారం ఇక్కడికేవస్తుంది; నీ పళ్ళేలు

మాత్రం నీవేకడిగి శుభ్రం చేసుకోవాలి. కొళాయిలోనుంచి వచ్చే నీరుమాత్రం చాలా వేడిగా వుంటుంది. నిన్నుచూడ డానికి వచ్చేది నేనొక్కణ్ణే అనుకొంటాను!" అన్నాడు గుక్క తిప్పుగోకుండా డాక్టర్ సెడ్నీ.

డాక్టర్ సిడ్నీ అప్పుడప్పుడు వస్తూన్నా, ఎంతకీ రోజు గడుస్తూన్నట్లే అనిపించేదికాదు. ఉత్తరాలతోనూ, బంగీల తోనూ నాకు బాగానే కాలక్షేపం అయేది; టైప్‌రైటరు, టాకింగ్ మిషనూ చెడిపోకుండా చేరాయి. డాక్టర్ బిల్ నాకు వ్రాసిన ఉత్తరంలో డాక్టర్. రావినో (Dr. Raveno) అనే ఫిలిప్పైన్ డాక్టర్ని తాను ఎరుగుదుననీ, నా విషయం అత నికి తెలియపరచానని వ్రాశారు. టామ్ కొన్ని గ్రామఫోన్ రికా ర్డులూ, వాటితో చిన్నఉత్తరం పంపాడు. టామ్‌కు ఉత్తరాలు వ్రాయడమంటే కష్టం నాకైనా ఇతరులకైనా అమ్మకి ఇప్పుడు ఆరోగ్యంగావుందనీ, మేబెల్‌కి పెండ్లిఅయి, ఆమెభర్త త్వరలో మావ్యాపారవిషయములు చూడడానికి రావచ్చుననీ, జేన్ క్లీవ్ లాండ్ (Cleveland)లో సంగీతపు అధ్యాపిగా పనిచేస్తూందనీ ఆ ఉత్తరంలో వ్రాశాడు.

హానోలూలూ (Honolulu) చేరడానికి ఒక వారం రోజులు పట్టింది. మా ఓడలోనుంచి కొందరు అక్కడ దిగి పోయారు. మనిలాకు వెళ్ళేవారికి నేలమీద సంచరించుటకు రజా. వాళ్ళరాకపోకలు చూడనైతి. (నేనుదిగను) హానోలూలూలో మాఓడ ఒకరోజు ఆగి తిరిగి మనీలాకి ప్రయాణం సాగించింది. మనిలా చేరడానికి ఇంకా మూడు

వారాలు పడుతుంది. నాకుమాత్రం ఒకరోజు ఒగయుగంలా అనిపించింది. డాక్టర్ సిడ్నీమాత్రం అప్పుడప్పుడు వచ్చి, తన ఛలోక్తులతో నన్ను ముంచెత్తుతూనేవున్నాడు. తక్కిన సమయాలలోమాత్రం బోనులో పెట్టబడిన జంతువులా ఆ గదిలో అటూ ఇటూ తిరుగుతూ, తలను చేతితో పట్టుకొని చింతల్లోమునిగి ఏదోవింత ఆలోచనలతో కాలం వెళ్ళబుచ్చే వాణ్ణి.

మనిలా అఖాతంలో మాఓడ ప్రవేశించగానే నేనున్న గదివైపు ఒడ్డుకి దిగువైపు వుండటంవల్ల మార్గము అఖాతం ఆ సుందరదృశ్యం నేను చూడలేకపోయాను. నావైపు గట్టు నుండి ఉష్ణదేశపు నిబిడవనౌషధులు అఖాతంలోవున్న చిన్న చిన్న పడవలుమాత్రం అనేకం కనుపించాయి. ఇంతలో రెజిమెంటల్ బ్యాండ్ మ్రోగింది. సైనికులు వరుసలుతీరి క్రిందికి దిగుతున్నారు. నాకు పిలుపువచ్చేవరకూ నేను వేచివున్నాను. ఆమధ్యాహ్నం బాగా పొద్దుపోయిన తరువాత డాక్టర్ సిడ్నీ నాగదిదగ్గరకి వచ్చిన పనిమీాద నుండడంచేత ప్రొద్దైనది తెలియ లేదని కొద్దిసేపటిలో ఆరోగ్యశాఖాధికారి నన్ను చూడడానికి వస్తాడనీ, తక్కిన ఏర్పాటుల సంగతి తనకు తెలియదనీ, నాకోసం భోజనం ఏర్పాటు చేయబడిందనీ చెప్పి వెళ్ళిపోయాడు.

నాకు అసలు ఆకలివేయటంలేదు. డాక్టర్ సిడ్నీ ఒక ఫిలిప్పైన్ దేశస్థుణ్ణి తనవెంటబెట్టుకొని నాగదికి వచ్చేసరికి చీకటి పడుతూంది.

"మిస్టర్ ఫెర్గూసన్, ఈయనే డాక్టర్. రావినో మేజర్. థామ్సన్ స్నేహితులు; ఈయన నీవు వెళ్ళబోయే ప్రదేశానికి ప్రధాన ఆరోగ్యశాఖాధికారి." అని డాక్టర్. సిడ్నీ నాకు మర్యాదపూర్వకంగా డాక్టర్. రావినోని పరిచయం చేశాడు.

డాక్టర్. రావినో ముందుకువంగి అభివందనంచేశాడు. పొట్టిగా చిన్నగావున్నవాడు కొంచెం స్పానిష్ రక్తసంబంధం వానికి గలదని నాఊహ. డాక్టర్ రావినో, ముభావంగా, అణకువతో కొంచెం సిగ్గుపడుతూన్నట్లు, ఎంతో గౌరవభావంతో నన్ను పలుకరించి మిస్టర్. ఫెర్గూసన్ ! మీదేశానికి ప్రశంసాపూర్వకమైన సేవచేసి, తిరిగి ఈ దురదృష్టకరమైన పరిస్థితిలో మనిలాకు తిరిగి రావడంచూచి నేను ఖేదపడుతున్నాను. మేము చేయగలిగిన సహాయమంతా హృదయపూర్వకంగా చేయగలమని మీకు మాట ఇస్తూన్నాను." అన్నాడు.

నేను నా కృతజ్ఞతను తెలియజేశాను. ఆనాటి రాత్రికి మాత్రమే సరిపడేవస్తువులను తీసుకొని బయటికి రావలసినదనీ, తక్కిన సామాను తీసుకురావడానికి ఇంకొక మనిషిని పంపుతాననీ డాక్టర్. రావినో చెప్పారు— తరువాత మేమిద్దరం బయటికి వచ్చాము.

## 9వ ప్రకరణం

మాకోసం డాక్టర్ రావినో అంతకుముందే ఒక గుర్రపు బండిని సిద్ధంచేసివుంచారు. బండిదగ్గరకి వెళ్ళగానే డాక్టర్.

రావినో గౌరవసూచకంగా ప్రక్కకుతప్పుకొని బండిలో నన్ను ముందు ఎక్కవలసినదిగా చెప్పారు. తాను చికిత్సచేయబోయే ఒక రోగివలెకాక, గౌరవనీయుడైన ఒక స్నేహితునిలా ఆయన నన్నుచూడడం నిజంగా నాకెంతో ఆశ్చర్యంవేసింది.

మాబండి "శాన్‌లజ-రోహాస్పిటల్" దగ్గరకువచ్చి ఆగింది. మేమిద్దరం బండిదిగాము. రాత్రికట్టడపు ప్రహారీతో వున్న ఆహాస్పిటల్‌లోపలికి ఒక వరండాగుండా డాక్టర్. రావినో వెనుకే నేనుకూడావెళ్ళి ఆయన ఆఫీసుగదిలో కూర్చొన్నాము.

"మిస్టర్ ఫెర్గూసన్, దురదృష్టవశాత్తు మా అమెరికన్ డాక్టర్. కెంట్, తొందర పరిశోధనపనిమీద ఇంకొకవూరు వెళ్ళారు. మీకు అభ్యంతరంలేకపోతే, నేనే మిమ్మల్ని పరీక్ష చేస్తాను. కొంచెం దుస్తులను తొలగించి, ఎక్కడెక్కడ మచ్చ లున్నాయో చూపిస్తారా?" అన్నాడు డాక్టర్. రావినో.

ఎక్కడెక్కడ మచ్చలున్నదీ చెప్పాను. నాచొక్కా విప్పవలసినదిగా చెప్పి, ఆమచ్చలను ఒకసూదివంటి పనిముట్టుతో నొక్కుతూ, నన్ను కళ్ళుమూసుకోమని డాక్టర్. రావినో పరీక్షచేయడం మొదలుపెట్టారు. తరువాత ఒక పక్షి ఈకతో తిరిగి ఆమచ్చలను పరీక్షించారు.

"మిస్టర్. పెర్గూసన్! మొట్టమొదట చెప్పినట్లే ఈ వ్యాధి కుష్టువ్యాధిఅని నిర్ణయించవలసివచ్చినందుకు విచారిస్తూ న్నాను. అయినా నిరుత్సాహపడవలసిన అవసరంలేదు. ఈచికిత్సలో ఒక క్రొత్తవిధానాన్ని ఇక్కడ ప్రారంభించాము.

ఈపద్ధతివల్ల మీవ్యాధి నివారణఅయే అవకాశం ఎంతగానో వుంది. కొంత ఆలస్యంగా ఫలితంకనపడినా, ఇదివరలో ఈ రోగం తప్పక నయమౌతుందని రోగులకు మేము చెప్పలేక పోయినా ఈ నూతన చికిత్సావిధానంవల్ల, రోగులకు ధైర్యం చెప్పగలుతున్నాం.'' అన్నాడు డాక్టర్. రావినో.

తరువాత నేను పరుండవలసిన స్థలాన్ని ఆయన నాకు చూపించారు. ఇరుకుగా బాగా పొడవుగావున్న అగదిలో గోడకు దగ్గరగా రెండువైపులా వేయబడిన కర్రమంచాలమీద రోగులు నిద్రపోతున్నారు. ఆగదిలో ప్రవేశించగానే ఇద్దరు ముగ్గురురోగులు, కదలడం గమనించాను. నామంచం తలుపుకి దగ్గరగావుంది. ఒక పెద్ద కిటికీగుండా ధారాళంగా గాలివీస్తుంది. నాకిచ్చిన మంచానికి దోమతెరకూడావుంది. ఇక ఏమంచానికీ దోమతెర లేకపోవడంచూచి, నాకొక్కడికే ఈ సౌకర్యం కలిగించడం నాకిష్టంలేదనీ, దానిని తొలగించవలసినదనీ, డాక్టర్. రావినోతో గట్టిగా చెప్పాను. అక్కడవున్న జనం దోమకాటుకి అలవాటుపడ్డారనీ, వాళ్ళని దోమలేమీచేయవనీ, క్రొత్తగా రావడంచేత మలేరియాదోమలు నన్ను కరుస్తాయనీ, అందుచేత దోమతెర వుండితీరాలని డాక్టర్. రావినో నాతో చెప్పారు.

నేను నాకృతజ్ఞతను తెలుపుతూ దోమతెరలోపలికి చేరుకొన్నాను. ఏంతసేపైనా నాకు నిద్రరానేలేదు. ప్రక్కనేవున్న కిటికీలోనుంచి ఆకాశంవైపు శూన్యంగాచూస్తూ అలాగే వుండిపోయాను. గదిలోజనం గుర్రుపెడుతూ నిద్రపోతున్నట్లు శబ్దం వినపడుతోంది. ఒకరిద్దరు నిద్దరలో గట్టిగా కేకలుపెడుతూ

కదలడంకూడా గమనించాను. కాని ఇవేమీ నన్ను బాధించ లేదు. నెడ్‌లాంగ్‌ఫర్డ్ అనే నేను అసలక్కడ ఎందుకు వుండ వలసివచ్చింది? అన్నవిషయమే నన్నెక్కువగా బాధించింది. నెడ్‌లాంగ్‌ఫర్డ్ అనే కుష్టురోగి, ఒక గదినిండావున్న కుష్టురోగుల మధ్య పడివుండవలసివచ్చిందా! ఆనాడు చచ్చిపోయినట్లు నటించి నప్పుడే నిజంగా చచ్చిపోతే ఈ అవస్థ లేకపోయేదికదూ?"—ఆం ఇప్పుడుమాత్రం మించిపోయినదేమిలే? చచ్చిపోవడానికి లక్ష అవ కాశాలున్నాయి — సముద్రంవుంది పడిచావలంటే. — అవును సముద్రమే!

ఇంతలో గదిలో ఎవరో వెక్కి-వెక్కి ఏడుస్తున్న శబ్దం వినపడింది- ఎవరిదో పిల్లవాడికంఠంలావుంది. మోచేతిని ఆన్చుకొని కొంచెంలేచి గదిమధ్యగా చూచాను. అందరికంటె చిన్నవిగ్రహం కదులుతున్నట్లు కనపడింది. ఏడుపు తగ్గుతుం దేమోనని తిరిగి నిద్రపోవడానికి ప్రయత్నించాను. కాని ఆ పిల్లవాడు మెల్లగా వెక్కి-వెక్కి ఏడుస్తూనే వున్నాడు.

ఇకనేను నామంచంమీద వుండలేకపోయాను. దోమ తెరను తప్పించుకొని, మెల్లగా బయటికివచ్చి, తక్కినరోగుల మంచాలమధ్యనుంచి అపిల్లవాడున్న మంచందగ్గరకివెళ్ళి, మంచం మీద ఒక చివరగాకూర్చొని కుర్రవాడు భయపడకుండా వీపు మీద నిమిరాను. ఆకుర్రవాడు బోర్లాపరుండి చేతులమధ్య తలపెట్టుకొని వెక్కి-వెక్కి ఏడుస్తున్నాడు. నాచేయి మెల్లగా తాకగానే ఆకుర్రవాడిశరీరం బిగపట్టాడు. తరువాత నేను మెల్లగా నిమురసాగాను. అంతటితో వెక్కి-వెక్కి ఏడవడం

తగ్గింది. మెల్లగా ప్రక్కకు తిరిగి నావైపు చూడసాగాడు. చంద్రుడు స్వచ్ఛంగా ప్రకాశిస్తున్నాడు. ఆకుర్రవాడు స్పష్టంగా అందంగా నాకు కనుపిస్తున్నాడు. నాకు తెలియకుండానే ఆ కుర్రవాణ్ణి ప్రేమించసాగాను.

"నీపేరేమిటి అబ్బాయి!" అని అడిగాను

"(Tomas) తోమాస్ అంటారండి, (Tomas Aguilar) టామస్ అగిలర్"

"నీకెన్నేళ్ళుంటాయి టోమాస్?"

"దాదాపు పదివుంటాయండి' తొమ్మిదిపై మాటేనండి!"

"మీ ఇల్లెక్కడ?"

"ఇక్కడకి చాలాదూరం వుందండి. ముప్పైమైళ్ళ దూరం వుంటుందండి."

"ఇక్కడికి ఎప్పుడు వచ్చావ్ ?"

"డాక్టరుగారు నన్ను ఇవాళే మా ఇంటిదగ్గరనుంచి తీసుకువచ్చేశారండి."

మధ్యమధ్య పొరలిపొరలి వచ్చే దుఃఖాన్ని ఆపుకొంటూ ఆ కుర్రవాడు తనఇల్లు విడచిపెట్టి రావడం ఇదే మొదటిసారి అనీ, తన తల్లి తండ్రుల్నీ, ఇద్దరు అన్నలనీ, చిట్టిచెల్లెల్నీ విడచి రావడంవల్ల చాలా బెంగగావుందనీ, ముఖ్యంగా అమ్మనీ తన చిట్టి చెల్లెల్ని విడచి క్షణంకూడా తనకి తోచటంలేదనీ చెప్పాడు.

వెలుతురు వచ్చేవరకూ నేను అక్కడే కూర్చుండిపోయాను. ఆ కుర్రవాడు నాకు దగ్గరగావచ్చి, నన్ను గట్టిగా కౌగలించుకొని, హాయిగా నిద్రపోయాడు.

# 10 వ ప్రకరణం

నేను ఉదయం లేచేసరికి చాలా పొద్దుపోయింది. నేను కళ్ళు తెరవగానే నాతరువాత మంచంమీదవున్న వ్యక్తి నావైపు విస్తుపోయి చూస్తూన్నాడు. నేను గోడని ఆనుకొని ఇంకా కునుకుతూనేవున్నాను. పూర్తిగా నాకు తెలివివచ్చేసరికి నాప్రక్క మంచంమీదవున్న వ్యక్తి స్నేహపూర్వకంగా నవ్వుతూ "నమస్తే—మీరేనా మిస్టర్. ఫెర్గూసన్ ?" నమస్తే—మీరు నన్నెరుగుదురా ?"

'ఓ, తెలియకపోవడమేమిటి ? మీరు ఇక్కడికి వస్తూన్నట్లు డాక్టర్. రావినో చెప్పారు" అనిచెప్పి ఆవ్యక్తి "పేకో, పేకో !" (Paco) అని ప్రక్కమంచంమీద పరున్నవ్యక్తిని పిలిచాడు.

"పేకో, ఈయనే మిస్టర్. ఫెర్గూసన్ ! నాపేరు మేన్యుయల్ (Manuel) అంటూ తన మంచంమీదనుంచి లేచి చేతిని చాపుతూ కరచాలనం చేయడానికి నాదగ్గరకి వచ్చాడు—నేను కొంచెం వెనుకకి తగ్గాను. ఇతరులతో కరచాలనంచేసి దాదాపు సంవత్సరం కావస్తుంది. ఇంతలోనూ నేను ఎవరిమధ్య వుంటున్నానో జ్ఞాపకంవచ్చి, తక్షణం ఆ వ్యక్తితో కరచాలనంచేశాను. ఈ విధంగా కరచాలనం చేయడంవల్ల అ వ్యక్తికి ఏవిధంగాను హాని కలిగించలేను. ఈ విషయం నాలో ఎంతో సంతృప్తిని కలిగించింది !

ఇంతలో ఆ గదిలో వున్న అందరూ నాకు స్వాగతం చెప్పడానికి నా చుట్టూ చేరారు. అక్కడ చేరినవాళ్ళలో ఏ వొక్క రికీ వ్యాధి తీవ్రస్థితిలో లేదు.

"ఆ కుర్రవాడు పాపం మీకు నిద్రలేకుండా చేశాడు లాగుంది !" అంటూ నన్నడిగారు.

"లేదు, లేదు ! మేమిద్దరం మేలుకొనే వుండటంవల్ల ఒకచోట చేరాం. అంతలో నిద్దరపట్టేసింది; అంతే!" అన్నాను.

ఇంతలోనే టామస్ నిద్రలేచి "నేను చెప్పినదానికి అడ్డువచ్చి," నన్ను క్షమించండి. నేనే ఆయన నిద్రకి భంగం కలిగించాను. ఆయన నన్ను ఎంతో దయతో సానుభూతితో పలుకరించి, నా విచారాన్ని పోగొట్టి, నా మనస్సుకి హాయిని కలిగించారు.—ఆయనకివే నాహృదయపూర్వక నమస్కారాలు!" అంటూ తనపెద్ద గోధుమరంగు కళ్ళతో, కృతజ్ఞతా పూర్వకంగా నావైపు చూడసాగాడు. నేను చేసినదేమీ లేక పోయినా కొద్దిక్షణాలపాటు ఆ పిల్లవాని హృదయానికి హాయిని కలిగించేమాటలు చెప్పడంవల్ల నేను అందరి మన్ననలకీ పాత్రుడ నయాను। ఫిలిపినోవాళ్లు కుటుంబభక్తులు సుమీ ! "మేము చేయవలసిన దానిని మేము చేయక మిమ్ములను చేయనిచ్చినది మాకు సిగ్గేస్తూంది," అన్నాడు మాన్యుయేల్. పూర్వపరి చయము లేనందున అన్యులలాగ దూరదూరముండడం పెద్ద పాలు తెగదొడగెను, ఆ మాటమీద కుష్ఠురోగులంటే విపరీ తంగా భయపడిన నేను ఆఖరికి వారిమధ్యనే తిరగడానికి అల వాటు పడిపోయాను. భోజనశాలలో అన్నదమ్ములవలె అం

దరూ నా చుట్టూ చేసేవారు. అక్కడ బాగా తీవ్రస్థితిలోవున్న కష్టరోగులుకూడా వున్నారు. కాని వారిని చూడకుండా నా చుట్టూవున్న నా స్నేహితులు చేస్తున్నారా అనిపించింది. తిండి తినాలనికూడా నాకనిపించలేదు. పండ్లు, అన్నం, ఉడకపెట్టిన చేపలు, నాకు వడ్డించారు. కాని నాకు ఆకలి వేయలేదు. కోడి గ్రుడ్లు కావాలాఅని నన్నడిగారు మళ్లీమళ్ళీ! నాకు ఫిలిఫైన్ ఆహారం అలవాటేననీ పెట్టినవానిని తింటాననీ వారితో చెప్పాను. పిమ్మట రోగులందు ఒకపెద్ద అల్లరి లేచింది.

"క్యూలియన్‌కి వెళ్లే పడవ త్వరలో వస్తుందనీ, అక్కడికి వెళితే తిరిగి రామేమోననే భయంతో చాలామంది అక్కడికి వెళ్ళడానికి భయపడతారనీ, కాని అది చాలా మంచిదీవి అనీ, తనమట్టుకి తాను అక్కడికి వెళ్ళడానికి ఇష్టపడతాననీ" మాన్యుయేల్ నాతో అన్నాడు.

మూడవనాటి ఉదయం భోజనాలవేళ మేము క్యూలియన్‌కి వెళ్ళాలో లేక ఇక్కడే వుండిపోవాలో తెలియజేసే చీటీలను మాకందరికీ ఇచ్చారు. పడవ అప్పుడేవచ్చి రేవులో వుంది. రెండువందలమందికి క్యూలియన్‌కి వెళ్ళవలసినదిగా చీటీలను ఇచ్చారు. అందులో నేనొకణ్ణి.

క్యూలియన్ మనిలాకి దక్షిణదిశగా రెండువందలమైళ్లే కాన వాళ్ళకేల ఇంత అధికదిగులు పుట్టింది అనుమాట నాకర్థం కాలేదు. వెనుక తెలిసింది, ఆకారణం. అది ఏమిటంటే, తమ్ము చూడవచ్చువారు అంతగా రానుబోవుదురు. ఏలనగా. వాళ్ళను తీసుకొనివచ్చు ఓడ దారిలోనుండు ప్రత్యేకరేవందు

నిలిచినిలిచి వెళ్ళుతూంది. కాబట్టి ఆలస్యమెక్కువ. మఱియు కష్టం అధికమౌతుంది. మనకేమో ఆ అధికం 'నాంకేవాస్తే'గా నుండినను వాళ్ళకేమో అది నిజమైన ఇబ్బందియే. అక్కడికి మేము చేరుకోవడానికి ఇరవైనాలుగుగంటలు పట్టింది. ఈప్రయాణంలో "తిరిగి ఇంటినిగాని, స్నేతులనిగాని చూడడానికి అవకాశం వుండదని" పదేపదే అనడం నేను విన్నాను. ఈ మాటలు వినడంతో మాతోడి ప్రయాణీకులలో చెప్పలేనిభయం ఆవహించింది. క్యూలియన్ కుష్టురోగుల నివాసంగా పదిసంవత్సరాలుగా మాత్రమే వుంటూంది. అంతకుముందు కుష్టురోగం బాగా ముదిరిన రోగులుమాత్రం ఆస్పత్రులలో చేర్చబడేవారు. తక్కినవారు ఇళ్ళవద్దనే వుండేవారు. క్యూలియన్ కుష్టురోగుల నివాసంగా ప్రత్యేకింపబడినప్పుడు ఫిలిపైన్ ఆరోగ్యసంస్థవారు ఈవ్యాధి సోకినవారిని విధాయకంగా ఈ దీవికి పంపేవారు. కాని చాలమంది ఈ పద్ధతికి ఇష్టపడలేదు. రోగులను అతిక్రూరంగా హింసిస్తారనే కట్టుకథలు ప్రజలలో విపరీతంగా వ్యాపించాయి. కాని మేము అక్కడికి చేరగానే ఈ వదంతి ఎంత సత్యదూరమైనదో మేము గ్రహించాము. కాని చాలమందిలో ఈభయం ఇంకా పోనేలేదు.

మేము క్యూలియన్ అఖాతంలో ప్రవేశించగానే మాపడవమీదికి ఒక అమెరికన్‌డాక్టర్ వచ్చారు. ఆయనపేరు జేమ్సు మార్షల్ (Jamas Marshall) ఆయన ఫిలిపైన్ దీవులకు యునైటెడ్‌స్టేట్సు ఆరోగ్యశాఖ డైరెక్టర్! అతిసామాన్యవ్యక్తివలె మా దగ్గరకువచ్చి ఆయనపేరు చెప్తూంటే నాకు ఎంతో

ఆశ్చర్యంవేసింది. ఆయన వయసు దాదాపు ముప్ఫై అయిదు సంవత్సరాలుంటాయి. ఆడుతూ పాడుతూ ఎంతో చురుకుగా జీవితంఅంటే ఒక ఆటకింద పరిగణిస్తూ మెరిసేకళ్ళతో ఎంతో ఉత్సాహంగా ఆయన కనుపించారు. ప్రతి చిన్నవిషయానికీ హృదయపూర్వకంగా నవ్వుతూ, తనబాధ్యతని ఎంతో సమర్థతతో నిర్వహిస్తున్నారాయన. ఆయన ఈ దీవులకివచ్చి ఎనిమిది సంవత్సరాలైంది. ఆయన మాకు దగ్గరగా కూర్చొని, రోగులనందరినీ ఒక్కసారి పరిశీలనగా చూశారు.

“నాకు ఈ విధంగా ప్రయాణంచేయడమంటే ఎంతో సరదా. ఇది ఒకక్రొత్త యుద్ధరంగం. ఇప్పటికే మేము ఎన్నో రకాల భయంకర వ్యాధుల్ని నిర్మూలించాము. కలరా, మశూచి వ్యాధుల్ని పూర్తిగా జయించాము. కాని కుష్టు వ్యాధిమాత్రం మమ్మల్ని మహాతిప్పలుపెట్టింది. అమెరికా దేశస్థులు మొట్టమొదటిసారిగా ఇక్కడికి వచ్చినప్పుడు, వందల కొలది, వేలకొలది కుష్టువ్యాధిగ్రస్తులు వీధులలో తిరుగుతూ వుండేవారు. ఇంతేకాక దాదాపు నాలుగువందలమంది ఆస్పత్రులలోనూ, ఇతర ఆరోగ్యసంస్థలలోనూ వుండేవారు. రోగుల్ని కల్యాలియన్‌కి పంపించడమే చాలాకష్టమయేది. అయినా వారు ఆరోగ్యవంతులు కావడానికి ఇప్పుడు అవకాశంవుంది.”

“ఆరోగ్యవంతులు కావడానికే!” అని నేను తడుము కోకుండా అడిగాను.

“అవును! ఆరోగ్యవంతులు కావడానికి అవకాశం వుంది!” అని ఆయన సమాధానం చెప్పారు.

నాలో ఒక్కసారిగా ఆశాజ్యోతి తళుక్కున మెరిసింది. నాలో ఒకవింత శక్తి ఉదయించినట్లైంది. ఆయన మమ్మల్ని విడచివెళ్ళినా, మాలో ఆయన రేకెత్తించిన ఆశ క్షణక్షణం మాకు నూతనోత్సాహాన్ని కలిగిస్తూనేవుంది. ఆశలువదలుకొన్న వారిలో ఉత్సాహం, ఉత్తేజం కలిగించగలిగిన చాకచక్యం ఆయనలో వుంది,—ఈ పడవలలో వచ్చే రోగులతో ఆయన సాధారణవ్యక్తిలా ప్రయాణం చేస్తారు. నిజానికి ఆరోగ్యశాఖ డైరెక్టరు పదవిని నిర్వహిస్తూన్న ఆయనకి సాధారణ రోగులతో ప్రయాణం చేయవలసిన అవసరం లేనేలేదు. అయినా, తనకి ఆ వ్యాధి సోకుతుందనే భయమైనా లేకుండా నిరంతరమూ ఈ విధంగా చేస్తూనేవున్నారు !

## 11 వ ప రి చ్ఛే దం

తీరానికి కొంత దూరంలో మా ఓడకి లంగరు వేయగానే ఒక మోటారు లాంచికి కట్టబడిన ఒక దోనెలాంటి పడవ మా ఓడ సమీపానికి వచ్చింది. జట్లు జట్లుగా జనాన్ని తీరానికి ఆ దోనె మీద చేరవేయసాగారు. డాక్టర్ మార్షల్ మాత్రం రోగుల మధ్యకి వెళ్ళి, వారికి ఉత్సాహం కలిగిస్తూ, ఆఖరి జట్టు కాళీచేయబడే వరకూ ఓడలో నేవున్నారు. ఆయనతో పాటే టామస్, నేనూ అందరికంటే ఆఖరున గట్టుకి చేరుకొన్నాం.

మా పడవ తీరానికి చేరుకొంటూవుండగా వరుసగా ఒడ్డు మీదవున్న చిన్న చిన్న పేపర్ములకు ఇళ్ళను నాకు డాక్టర్ మార్షల్ చూపించారు. వాటిలో రోగులే కాపురం వుంటు

న్నారని ఆయన నాతో చెప్పారు. మా నావ రేవుకి చేరుకోగానే అక్కడ మాకు స్వాగతం చెప్పడానికి కొందరు వేచివున్నారు.

"ఆ జనం మనకి స్వాగతం ఇవ్వడానికే అక్కడ గుమి గూడివున్నారు. ఇంతకు ముందు నీవు ఈ దీవులలో వున్నావు కనుక ఇక్కడి ప్రజలు అతిథులకి ఎంతగౌరవం చేస్తారో నీకు నేను వేరే చెప్పనక్కరలేదు" అన్నారు డాక్టర్ మార్షల్ నాతో.

ఈ స్వాగతం నాకు చాలా వింతగా తోచింది. సంఘం నుంచి బహిష్కృతులమైన మాకు, ఈ బహిష్కృతుల సంఘం స్వాగతం చెప్తూంది! అసలిది సంతోషసమయమేనా? క్యూలి యన్‌లోని ఈ జనం బహుశా అలాగే భావించారేమో?

మా నావ తీరానికి చేరుకోగానే నావలోని జనం కొంచెం వెనుకకి తగ్గి డాక్టర్ మార్షల్‌కి దారి ఇచ్చారు. కాని డాక్టర్ మార్షల్ వారిని దిగవలసినదిగా చేతులతో సంజ్ఞచేసి టామస్, నేనూవున్న చోటికి వచ్చారు టామస్, నేనూ దిగ గానే, ఆఖరున డాక్టర్ మార్షల్ గట్టు మీద అడుగు పెట్టారు తక్షణం అక్కడ వున్న 'బ్యాండ్' గీతాలాపనచేసింది. అందరం వరుసలు తీరి నిలుచున్నాం. మమ్మల్ని ఆహ్వానించడానికి నిలిచి వున్న స్వాగతసంఘాన్ని చూచి ఆశ్చర్యపోయాను. మొట్ట మొదట సైన్యదళం ముందుకు వచ్చింది. తరువాత ఒక అమె రికన్ ఆ కాలనీ ప్రధానాధికారి, ఫిలిపైన్ డాక్టర్ల బృందం అందరు డాక్టర్లు ధరించే తెల్లని గౌనులు ధరించివున్నారు. ఆ తరువాత నర్సులు వచ్చారు. తరువాత గౌను ధరించివున్న రోమన్ కాథలిక్ ఫాదిరీ మతగురువు, ఆ వెనుక సెయింట్

పాల్ డి ఛార్ట్రెస్ (St. Paul de chartres) దుస్తులలోవున్న నర్సులు, ఫిలిప్పైన్ ఆరోగ్యసంస్థకి చెందిన నర్సులు వరుసగా వచ్చారు.

డాక్టర్ మార్షల్‌తో కరచాలనం చేయగానే డాక్టర్ వరుసలు తీరి నిలిచివున్న రోగుల నందరినీ ఒక్కొక్కరినే పేరు వరుసగా అభినందిస్తూ, వారికి ధైర్యం కలిగించే మాటలను చెప్తూ వారందరూ మాసంక్తుల మధ్యనుంచి వెళుతున్నారు, ప్రతి డాక్టరూ కొత్తగా వచ్చిన రోగులకి ఆశా సందేశాన్ని అందజేయడం నాకు ఆశ్చర్యం కలిగించింది. అక్కడి ప్రధాన వైద్యాధికారి డాక్టర్ విన్టన్ (Dr. Winton) నా దగ్గర చాలసేపు ఆగి నాతో సంప్రదించారు. తెల్లని గౌనుతో తల మీద టోపీ లేకుండా, ఆయన నా దగ్గర నిలిచి అంతసేపు వుండి మాట్లాడటం నాకు చాలా ఆశ్చర్యం వేసింది.

"నీవు చాలా ఆరోగ్యవంతునిలా కనపడుతూన్నావే; కాని ఒక సారి ఈ విధంగా వచ్చాక ఈ తంతు అంతా జరిగి తీరవలసిందే. ఈ విధమైన పరీక్షల పరంపరవల్ల నీవు నిరుత్సాహ పడకుండా వుండవలసినదిగా హెచ్చరించుతూన్నాను. ఏమైనా నేను చేయవలసిన సహాయం అంతా నేను చేస్తాను. సాధ్యమైనంత త్వరలో మధ్యాహ్నంలోపల తిరిగి రావడానికి ప్రయత్నిస్తాను. నీ నివాసం విషయంలో కొన్ని సూచనలు చేయ దలచాను. ఇప్పుడు నేను చూడ వలసిన జనం చాలా మంది వుండటం చేత వెళ్ళిపోవలసి వచ్చినందుకు మన్నింప వలసింది అంటూ ఆయన వెళ్ళిపోయారు.

ఆయనకి లోలోపలనే కృతజ్ఞత తెలియ జేశాను.

బూడిదరంగు కళ్ళతో, నిశితమైన దృక్కులతో, ఎంత ఉత్సాహంగా వున్నాడు! నాకంటె యువకుడైనా ఆయనలో ఆ చురుకుదనంవుంది. కర్తవ్యనిష్టలో మార్షల్‌కి ఈయన తీసిపోడు.

ఆ తరువాత రోమన్ కేథలిక్ మతగురువు నా దగ్గరకు వచ్చి "మిస్టర్. ఫెర్గూసన్, నా పేరు మారెల్లో (Marello) అంటారు; నీవు ఈ విధంగా తిరిగిరావడం చాలా దురదృష్టకర మైన విషయం. అయినా ఇక్కడ మీకు సుఖశాంతము లభించ గలవని ఆశిస్తున్నాను" అన్నారు.

ఈయనకి బహుశా సాంచోనిగురించి తెలిసివుంటుందని "సాంచో నోలాస్కో" అనేరోగిని మీరెరుగుదురా?" అని ప్రశ్నించాను.

"తెలియకపోవడమేమిటి? సాంచో ప్రస్తుతం హాస్పిటల్‌లో వున్నాడు. నీకు సాంచో ఎట్లా తెలుసు?"

"నేను యుద్ధంలో పనిచేస్తుండగా సాంచో కుటుంబంతో నాకు పరిచయమైంది. నేను ఇక్కడికి తిరిగివచ్చినట్లు సాంచోతో చెప్పగలరా?"

"తప్పకుండా చెప్తాను. నాయనా!"

"అలా అయితే సార్జంట్ నెడ్ ఇక్కడికి వచ్చాడనీ, త్వరలోనే అతనిని చూడడానికి వస్తాడనీ చెప్పండి!"

ఈ లాంఛనాలన్నీ అవగానే మేము ఒకపెద్దకట్టడంలో మకాం వేశాము. అది క్వారంటైన్‌గా (Quarantine) ఏర్పాటు చేయబడింది. దానిలో మాకు కేన్వాసుమంచాలూ, నీటి పాత్రలు, ఇచ్చారు. అందరికీ ఆహారం ఒకే స్థలంలో తయారు చేయబడింది. అరటి ఆకులలో చక్కగా కట్టి, మాకు అన్నపు పొట్లాలు ఇచ్చారు. టామస్ నేనూ ఆ పొట్లాలు తీసుకొని ఒడ్డు మీద వున్న బొబ్బాసి చెట్లనీడలో కూర్చొని వన భోజనంలాగు తింటూండగా డాక్టర్ విన్టన్ మమ్మల్ని పలుకరించి మాకు ఆహారం సరిగా అందిందా అని అడిగారు. ఆ తరువాత తాను ఆలస్యంగా వచ్చినందుకు మన్నించ వలసిందనీ, ఎప్పుడు ఈ విధంగా పడవల మీద రోగులు వచ్చినా ఒకక్షణం గూడా తీరికవుండదనీ, ఆయన అన్నారు. అక్కడికి వచ్చే రోగుల సంఖ్య విపరీతంగా పెరిగి పోతూండడంవలన వారికి వసతి సౌకర్యాలు కలిగించడం చాలా కష్టంగా వుంటూందనీ, ఆస్పత్రుల సంఖ్య కూడా తక్కువగా వుండటంచేత వారికి విడివిడిగా స్థలాలు చూపబడుతూన్నాయనీ, ఆ స్థలాలలో చిన్న చిన్న కుటుంబాలు లేక నలుగురైదుగురు చేరి ఉమ్మడిగా చిన్న చిన్న ఇళ్ళు నిర్మించుకుంటారనీ, వారికి కావలసిన కలప, పని ముట్లు వగైరాలన్నీ ఉచితంగా ఇవ్వబడతాయనీ, డాక్టర్ విన్టన్ చెప్పారు.

ఒక్కొక్కపర్యాయం ఓడ వచ్చినప్పుడల్లా అదనంగా రెండు వందలమందికి వసతి సౌకర్యాలు కల్పించవలసి వుంటుంది.

ఇక నా ఇంటి విషయంలో అంతకు ముందు ఒక అమెరికన్ దేశీయుడు అక్కడ ఒక ఇల్లు కట్టు కొన్నాడనీ,

తరువాత క్షయవ్యాధి వల్ల అతను మరణించాడనీ, మరణించే ముందు ఆ ఇంటిని అమెరికా దేశీయునికే ఇవ్వవలసినదిగా తన కోరిక వ్యక్తంచేశాడనీ అతని కోరిక ప్రకారమే ఒక అమెరికా దేశీయునికే ఆ ఇంటిని ఇస్తానని తాను మాట ఇచ్చాననీ, అందు చేత కాళీగావున్న ఆ ఇంటిలో వుండటానికి ఇష్టపడితే నేనా ఇంటిలో వుండవచ్చుననీ డాక్టర్ విన్టన్ చెప్పారు.

"నేను చాలా అదృష్ట వంతుణ్ణన్న మాట!" అన్నాను

"ఊఁ, నేనలా అనుకోను, ఏమంటే ఇల్లంతా శిథిలావస్థలో వున్నట్లుంది! అయినా లోపలికి వెళ్ళి చూద్దాం" అన్నారు డాక్టర్ విన్టన్.

బాగా ఎత్తుగా వుండే గట్టు మీద నుంచి కొంత దూరంపైకి వెళ్ళాము ఈ దారిగుండా వెళ్ళడానికి ఒక్కొక్కప్పుడు మోకాళ్ళ మీద, చేతుల మీదా ప్రాకవలసివచ్చింది! మేము వెళ్ళ వలసిన స్థలానికి ఆ కొండల మీద ఎన్నో దారులున్నాయి. ఆవిధంగా వెళ్ళి వెళ్ళి ఒక చోట ఆగాము వెదురు గడలను చీలి కట్టిన ఒక ఆవరణకి ముందుగా వున్న కర్రతలుపు, దాదాపు శిథిలావస్థలో వున్నదానిని డాక్టర్ విన్టన్ లోనికనెంటి లోనికి ప్రవేశించారు. ఆయన వెనుకే నేను కూడా వెళ్ళాను, దట్టముగా పెరిగిన తీగలూ డొంకలూ ఆ ఇంటిని కనపడకుండా కప్పి వేశాయి! ఆ తీగల్నీ, డొంకల్నీ తప్పించుకుంటూ పది పది హేను గజాల లోపలవున్న ఇంటి దగ్గరకి వెళ్ళాము.

"ఈ ఇంటిని ఇంతకు ముందే బాగుచేసి ఇవ్వలేక పోయి నందుకు విచారిస్తున్నాను. ఈ దీవికి వచ్చాక ఒక్క నిమిష

మైనా ఊపిరి పీల్చుకో డానికి కూడా ఓరిక లేదు అన్నారు డాక్టర్ విన్సన్.

నీలి నీటి సరస్సులా దూరంగా కనపడే అఖాతం, ఆ నీటి వారకి వెళ్ళడానికి దారులతో ఆ ప్రదేశం ఎంతో చక్కగావుంది, ఇప్పుడు వున్న ఇల్లు కూలి పోయినా ఆస్థలాన్ని విడిచి వెళ్ళడానికి మనస్కరించ లేదు. నాకు ఎంత ఆవరణ కావలిస్తే అంతా నిరభ్యంతరంగా వాడుకొన వచ్చునని డాక్టర్ విన్సన్ అన్నారు. అసలాప్రదేశాన్ని సరిగా వాడు కొనడానికి కూడా అంతకు ముందు అక్కడ వుండే అమెరికా దేశీయునికి ఓపిక లేక తీగల్నీ, డొంకల్నీ అరణ్యంలా పెరగనిచ్చి, ఆ ఇంటిని ఆవిధంగా తయారుచేశాడు. ఆ ఇల్లు మామూలుగా వేప, వెదురుతో కట్టబడినది నలభై అడుగుల పొడవూ ఇరవై అడుగుల వెడల్పువున్న ఆ ఇంటికి ముందు భాగంలో వసారా వుంది. ఆ ఇంటి కిటికీ తలుపులు వేప చెక్కతో చేయబడి వెలుపలికి తెరచుకొనేలా పై భాగంలో మడత బందులు వేయబడ్డాయి. వీటిని పూర్తిగా తెరచినప్పుడు ఇంటిలోపల కూడా దాదాపు బయలు ప్రదేశంలాగావుంటుంది! మధ్యగా చిన్న హాలు రెండు నైపులా రెండు పడక గదులు, ఆ తరువాత ఒక పెద్ద హాలు, దీనినానుకొనే వంటగది, వంటగదికి ప్రక్కగా ఒక కొట్టు గదీ వున్నాయి. స్నానానికి మాత్రం సదుపాయం లేదు. ఇంతకు ముందు ఈ ఇంటిలోవున్న (Wilkinson) విల్కిన్ సన్ స్నానం ఎక్కడ చేసేవాడని డాక్టర్ విన్సన్ని అడిగి నప్పుడు ఆయన నాకు దూరంగా కనపడే అఖాతం వైపు చూపించారు!

ఆ ఇంటిలో రెండు ఇనుపమంచాలు, బల్లలు, కుర్చీలు, వస్తువులు పెట్టుకొనే అరలు ఎన్నోవున్నాయి. వంటగదిలో తుప్పుపట్టిన స్టౌ, కుండలు, పళ్లేలు ఎన్నో పడివున్నాయి. పగిలినవీ, ముక్కలైనవీ పింగాణిపాత్రలు ఎన్నో వున్నాయి.

" నేను వూహించిన దానికంటె ఘోరంగావుందే ఇంటిలోపల ! ఈ విధంగా వుంచుతే మట్టిలో ఈ సామాను కప్పబడి పోతుందికూడా ! " అన్నారు డాక్టరు విన్సన్.

" వీటిని సులభంగా పరిశుభ్రం చేస్తాను ! " అన్నాను.

" భేష్, అంతకంటే ఏమికావాలి; ఇప్పటినుంచే మీరిక్కడవుండవచ్చు. కావలసిన ఆహారపదార్థాలు, సామానూ ఇక్కడికి పంపుతాను. క్వారంటైన్ నిబంధనలన్నీ ఇక్కడవుండే పరిగణించవచ్చును. పక్కకి బట్టలూ, దుప్పట్లు, ఆహారం నేను ఇక్కడికి పంపుతాను " అన్నారు డాక్టర్ విన్సన్.

క్వారంటైన్ నిబంధనలనుంచి ఎప్పుడైతే నేను బయటపడ్డానో నిజంగా నాకు చాలా సంతోషంవేసింది.

ఈ సంగతి డాక్టర్ విన్సన్‌తో చెప్పగానే–" ఇంకొక్క విషయంవుంది; ఆ కుర్రవాడు టామస్ విషయం. ఆ కుర్రవాడంటే మీకెంతో ఇష్టం అని డాక్టర్ మార్షల్ నాతో చెప్పారు. ఆ కుర్రవాణ్ణికూడా మీతో వుంచుకొంటే బాగుంటుందికదూ ? ఇక్కడ మీకు సాయంగా కావలసిన ఇంటిపనులు చేస్తుంటాడు. ఆ కుర్రవాడికి తృణమో పణమో ముట్టచెప్పవచ్చును. మీరు అంగీకరిస్తే ఆ కుర్రవాడు ఎంతో సంతోషంగా ఒప్పుకొంటాడు" అన్నారు డాక్టర్ విన్సన్.

టామస్ చిన్న చేతులు నా చేతులలో వున్నట్లని పించింది.

"నిజంగా ఆ కుర్రవాడంటే నాకు చెప్పలేనంత ఇష్టం. టామస్ చాలామంచి కుర్రవాడు. టామస్ నా దగ్గరవుండటం కంటె కావలసినదేముంది ?"

"ఇహనేం, తక్షణం ఆ కుర్రవాణ్ణి ఇక్కడికి పంపిస్తాను" అని చెప్పారు డాక్టర్ విన్టన్.

డాక్టర్ విన్టన్ వెళ్ళిపోయారు. నా కొత్తఇంటిలో నేను ఒంటరిగా వున్నాను.

అటూఇటూ కొంతసేపు తిరిగి, అఖాతం దగ్గరకివెళ్ళి ఇంటికి తిరిగి వచ్చేసరికి టామస్ అక్కడ నాకోసం వేచివున్నాడు !

"ఆయనా,—— ఆయనండీ, డాక్టర్ విన్టన్ లేరూ, ఆయన నేను మీతో వుండాలని చెప్పారు——నిజమేనండీ !" అని అడిగాడు టామస్ అమాయకంగా !

"అవును టామస్, నిజమే! ఈ ఇల్లువుంది చూశావూ! ఇకనో ఇప్పుడో కూలిపోయేలావుంది. కొంచెం చూసుకొని మసలాలి. డాక్టర్ విన్టన్ మనకి ఆహారపదార్థాలూ, తక్కిన సామానూ పంపుతూన్నారు. ఈ లోపులో కొంచెం శ్రమ అనుకోక త్రాగడానికి ఈ చుట్టుప్రక్కల మంచినీళ్ళు ఎక్కడైనా దొరుకుతాయేమో చూడ్డూ టామస్."

టామస్ తగరపు బాల్చినితీసుకొని నీటికోసం వెళ్లాడు. ఈ లోపుగా డాక్టర్ విన్టన్ పంపినవన్నీ మాకు అందాయి.

చీకటిపడేవరకు వాటితో మాకు సరిపోయింది. మూడు రాత్రులుగా నాకు నిద్రలేదేమో, పగలల్లాపనిచేసి వుండటంవల్ల బాగా అలసిపోయివున్నాను. రాత్రి భోజనానికి టామస్‌నికూడా పిలిచాను. కాని టామస్ నాకుమాత్రం బల్లమీద భోజనం సిద్ధంచేసి, తాను వంటఇంటిలో కూర్చొని తిన్నాడు!

భోజనం అయాక, ఉష్ణమండలప్రాంతపు రాత్రి వాతావరణంలో, దూరంగా అఖాతంలో నక్షత్రాలు ప్రతిబింబిస్తూండగా, నులివెచ్చని ఆవాతావరణంలో పొగపీల్చుతూ, మైమరచి పక్కమీద నడుంవాల్చాను.

## 12 వ ప్ర క ర ణ ం

నేను నిద్రలేచేసరికి బాగా తెల్లవారిపోయింది. కోళ్ళు ఎడతెరిపిలేకుండా కూస్తున్నాయి. అన్నికోళ్ళు ఒక్కసారి కూయడం అదివరకెన్నడూ నేను వినలేదు. ఎనిమిదిగంటలసేపు ఒళ్ళు తెలియకుండా హాయిగా నిద్రపోవడంచేత ఎంతో ఉత్సాహంగా వుంది. పక్కమీదనుంచిలేచి టామస్ ఏమిచేస్తున్నాడో అని వెళ్ళి చూచేసరికి తన గదిలోలేడు.

కోళ్ళుచేసే ధ్వనిని చీల్చుకొంటూ బిగ్గరగా 'టామస్' టామస్' అని పిలిచాను.

" ఇక్కడ వున్నానండి, వంటఇంట్లో; అంటూ టామస్ సమాధానం చెప్పాడు నూతిలోపడిన గొంతుకలా!

తొందరగా నేను వంటఇంటిలోపలికి వెళ్ళాను. టామస్ పాతస్టౌతో తంటాలుపడుతూన్నాడు మోకాళ్ళమీద ముందుకు వంగి! టామస్ ఏడుపుమొహంపెట్టి ఈస్టౌ ఎంతకి మండటం లేదండీ, అగ్గిపుల్లలన్నీ అయిపోయాయి'' అన్నాడు.

నేను నవ్వాపుకోలేక దగ్గరవున్న కుర్చీని ముందుకు ఈడ్చుకొని కడుపుచెక్కలయేలా నవ్వుతూ దానిలో కూలబడ్డాను. టామస్ ఎక్కడికీ వెళ్ళిపోలేదుకదా అనే సంతృప్తితో.

"ఇదిగో టామస్ ఇలాచూడు, ఆబర్నరుకి పక్కగా వున్న మరని తిప్పుతే దానివత్తులు పైకీవస్తాయి. అప్పుడు వెలిగిస్తే స్టౌ వెలుగుతుంది." అనగానే టామస్ లేచి కళ్ళు నలుపుకొంటూ నావైపు చూశాడు విపరీతమైన పొరపాటు చేసినవాడిలా!

"ఈ పొరపాటుచేసినందుకు నన్ను క్షమించండి. ఈ చిన్నవిషయం కూడా తెలియనందుకు నన్ను బయటికి పంపించి వేస్తారేమోనని భయపడ్డాను!" అన్నాడు టామస్.

"అలాంటి భయమేమీ పెట్టుకోకు టామస్ మనమిద్దం 'పాల్స్' కదూ? 'పాల్స్' అంటే అర్థం తెలుసునా?"

"తెలుసునండీ, 'పాల్' అంటే నీళ్లు తెచ్చుకొనే బాల్చీ అని అర్థమండీ."

"నీళ్లు తెచ్చుకొనే బాల్చీని 'పెయిల్' అంటారు. 'పాల్స్' అంటే స్నేహితులన్నమాట. ఒకరి కష్టసుఖాలలో ఒకరు ఆదుకొంటూ, ఒకరి రహస్యాలు ఒకరికి చెప్పుకుంటూ కలసి మెలసివుండే ప్రాణస్నేహితులన్న మాట."

నేనలా అనడంతోనే టామస్ ముఖం వికసించింది.

డాక్టర్ మార్షల్ తీగల్ని తప్పించుకొంటూ మా మకాం దగ్గరికి వచ్చేసరికి ఉదయం పదిగంటలై వుంటుంది. అప్పుడు మేము ఇంటిముందు మెట్లదగ్గర పనిచేస్తున్నాము.

"హలో! (Hallo) అప్పుడే పని మొదలుపెట్టారే. ఈ స్థలం మీకు బాగానచ్చిందని విన్నాను" అంటూ డాక్టర్ మార్షల్ మమ్మల్ని పలుకరించారు.

దానితో నేను మరింత పొంగిపోయి, నేను చేయదలచు కొన్న వాటిని ఏకరువు పెట్టేశాను!

"మనిలాలో మీకు ఏది కావలిస్తే అది దొరకుతుంది. మీకు కావలసినది దొరకకపోతే డాక్టర్ విన్సన్‌ని నాకు వ్రాయ మని చెప్పండి. తక్షణం అది వచ్చే ఏర్పాటు నేను చేస్తాను. నేను మళ్ళీ ఇక్కడికి మిమ్మల్ని చూడడానికి వచ్చేసరికి ఈ ప్రదేశంఆనవాలు పట్ట లేనంతగా మారిపోతుందనుకుంటాను!" అంటూ డాక్టర్ మార్షల్ వెళ్ళి పోయారు.

ఆ నాటి మధ్యాహ్నం మమ్మల్ని చూడడానికి డాక్టర్ విన్సన్ వచ్చారు. మా మకాం ప్రక్కనుంచి, ఒకకుర్చీని ఈడ్చు కొనివచ్చి కూర్చొన్నారు.

"మీకక్కడ బాగా సదుపాయంగావుందని అనుకొం టాను. ఇంకొక్కవిషయం మీకు ముఖ్యంగా చెప్పాలి. మిమ్మల్ని చూడడానికి ఎవరైనా రావడానికి ఏమీ అభ్యంతరంలేదు కాని, కుర్చీల విషయంలో మాత్రం జాగ్రత్తగా వుండాలి. రోగం

వ్యాపించకుండా తీసుకోవలసిన జాగ్రత్తలన్నీ తీసుకోవలసివుంటుంది. మిమ్మల్ని చూడడానికి వచ్చేవారికి పానీయాలుగాని, ఆహారంగాని ఏమీ ఇవ్వకూడదు. వారికి కావలిస్తే వారిఆహారం వారే తెచ్చుకోవాలి. అదిగో ఆ వెనుకవుండే పాకలోనుంచి ఈ కుర్చీ నేను తీసుకువచ్చాను. ఎప్పుడైనా ఆ పాకలోపల చూశారా మీరు ? " అని అడిగారు డాక్టర్ విస్టన్.

టామస్ నేనూ ఆ పాకలోపలికి తొంగిచూచాం. కాని తలుపువేసి వుండటంచేత లోపలికి వెళ్ళలేదు.

" ఈ పాకలలోవుండే సామానంతా మేమే సరఫరా చేస్తాం. ఎప్పుడైనా అతిథి వచ్చినప్పుడు తాను కూర్చోడానికి తనే ఈ పాకలోనుంచి కుర్చీని తీసుకొని, తాను వెళ్ళిపోయేటప్పుడు తిరిగి దానిని పాకలోపెట్టి వెళ్ళిపోతాడు. నేనెప్పుడూ ఈ పద్ధతినే అవలంబిస్తాను. నాతోపాటు తక్కిన డాక్టర్లుకూడా అంతే. అందుచేత రోగులు ఈకుర్చీలను ముట్టుకోనే ముట్టుకోరు. వాటికి మరామత్తు ఏదైనా చేయవలసివుంటే నాకు తెలియజేస్తే ఆ ఏర్పాటు నేను చేస్తాను— ఇక నీ ఆహారం విషయంలో కొంత ఆలోచించవలసివుంది. ఈకాలనీ ఆహారం సరఫరా చేస్తుంది కాని, నీకీ ఆహారంపడదు. అమెరికాదేశపు ఆహారానికి నీవు అలవాటు పడ్డావు. .అందుచేత కొద్దినెలలవరకూ ఆ ఆహారాన్నే తీసుకోవడం మంచిది. నీ ఆర్థికపరిస్థితి ఏలావున్నదో నాకు తెలియదు కాని, ఆ రకపు ఆహారం ఏమంత ఎక్కువ ఖరీదైనది కాదు. టామస్ తనమట్టుకి కాలనీస్టోర్సులోనుంచి రేషన్ తీసు

కుంటాను— అడగడం మరచిపోయాను. నీకు పెన్షన్ వస్తుందా?" అన్నారు డాక్టర్ విల్సన్.

" నేనసలు పెన్షన్‌కోసం దరఖాస్తు పెట్టలేదు; పెట్టవలసిన అవసరంకూడా లేకపోయింది."—కాని టామ్‌కి ఏదైనా సంభవిస్తే......! " అందుచేత దరఖాస్తు పెట్టడమేమంచిది. మరి నేను మారుపేరుతో వున్నానుకదా. అదెలాగ ? "

" మరేమీ ఫరవాలేదు నెడ్, ఈ రహస్యాన్ని బయట పెట్టవలసిన అవసరంకూడా లేదులే దానికి సంబంధించిన వివరాలన్నీ పుస్తకాలలో సరిగానేవున్నాయి. దీనిద్వారా నెలనెలా డెబ్భైఐదుడాలర్లు వస్తాయి. దీనితో ఇంటిఖర్చులు చూసుకొంటూ ఆ కుర్రవానికికూడా కొంతడబ్బు ఇవ్వవచ్చును. "

" ఈ వ్యూహ మంచిదేకానీ, మీకు దీనివల్ల చాలా చిక్కులు వస్తాయేమో డాక్టర్. ఇంతవరకూ నాకు కావలసిన డబ్బు మా తమ్ముడు పంపిస్తున్నాడు. ఇటుపైన ఆ విధంగా తెప్పించుకొనడం నా కిష్టంలేదు. ఇప్పటికే ఆ విధంగా పంపించిన డబ్బు నా దగ్గర చాలావందలువుంది, ఈ డబ్బు ఖర్చుఅయేసరికి బహుశా నాకు పెన్షన్‌డబ్బే అందవచ్చును. "

" అలా ఐతే తక్షణం పెన్షన్ దరఖాస్తు విషయమేదో నేను చూస్తానులే నెడ్—సరి ఈ కాలనీలోవాడే డబ్బుసంగతి నీకు తెలుసునా ? — తెలియదుకదూ— ప్రత్యేకంగా నాణెములు మాత్రమే ఇక్కడ వాడుతారు. కాగితపుడబ్బు వాడకూడదు. అమెరికాదేశపు నోట్లు మార్చి ఇక్కడ ఆ నాణెములు తీసికోవలసి వుంటుంది. ఆ విధంగా మార్చే ఏర్పాటుకూడా 'కాలనీ

హాల్‌లో చేయబడింది. ఇక నీకు కావలసిన పదార్థాలుకూడా నాతో చెప్తే తక్షణం అవివచ్చే ఏర్పాటు నేను చేస్తాను" అన్నారు డాక్టర్ విన్టన్.

మే మిద్దరం కావలసిన వస్తువుల పట్టీని తయారుచేశాము ఈ వస్తువులు వచ్చేవరకూ తన నిలువలలోనుంచి కొన్నిటిని క్వారన్‌టీన్ రాగానే పంపుతాననీ త్వరలో ఫాదర్ మార్సెల్లో మమ్మల్ని చూడడానికి వస్తానని చెప్పారనీ చెప్పి డాక్టర్ విన్టన్ వెళ్ళిపోయారు. ఆ డాక్టర్లు ఆ ఎండలో ఎంతవేగంగా వెళ్ళు తారూ! ఆ మరునాడు డాక్టర్ విన్టన్ పంపిన వస్తువులతో మా పని ప్రారంభించాము. ద్వారబంధపు తలుపులనీ, కిటికీ తలుపులనీ సరిగాఅమర్చి, విరిగిపోయిన కుర్చీలనీ, బల్లల్నీ బాగు చేశాము. ఇంటికి చుట్టూవుండే తీగల్నీ, తుప్పల్నీ బాగుచేసి, మొత్తంమీద ఆఇంటిని వాసయోగ్యంగా, ఆకర్షణీయంగా చేశాము. ఈ విధంగా కొద్దిరోజులు శ్రమపడి అనేక సదుపా యాలు కల్పించాము. ఇంతలో టామ్ నాకు పంపిన పుస్తకాలు అందినాయి. పనిచేసి బాగా అలసిపోయినప్పుడు మా ఇంటి ముందుభాగంలో కూర్చొని, ఆ పుస్తకాలు చదువుతూ, పొగ పీల్చుతూ గ్రామఫోను వింటూ కాలక్షేపం చేసేవాణ్ణి. పుస్తకం చదవడంలో నాకు ప్రీతితగ్గిపోయింది. నివర్శనంగా "సిస్టర్ కారీ అను పుస్తకం ఎంత ఆతురతతో చదువుదురు అమెరికా దేశంలో దానిని చదువనెత్తితిని. గాని అది రుచించలేదు. కారీ గాని ఇతర పాత్రులుగాని ఎక్కైతేయేమి అనియే తోచింది. అట్లుండేసరికి ఫాదర్ మార్సెల్లో ఇంటిముందు భాగంలో మేము

బాగుచేసిన స్థలంలో నిలిచి, "లోనికి రావచ్చునుకదూ ?" అన్నారు.

"దయచేయండి లోపలికి—మీరు వస్తారని ఎదురు చూస్తూనేవున్నాను" అనగానే ఆయన ఇంటివెనుక పాకలో వున్న ఒకకుర్చీని తెచ్చుకొనివచ్చి కూర్చొన్నారు.

"ఈ దీవిలో ఈప్రదేశం ఎంతో చల్లగా వుంది. దానికి తోడు మీరు ఎంతచక్కగా బాగుచేశారు" అన్నారు ఫాదర్ మార్సెల్లో.

"మేము చేసినదెంత వుందండీ—ఇంకా ఎంతో చేయ వలసివుంది" అనగా వింతతో చూశారునన్ను. "మేముచేయ బోయేపనికి మీ ఆశీర్వాదం ముఖ్యంగా అవసరం. నా మాట ఏలావున్నా టామ్‌స్‌కి మాత్రం మీ ఆశీర్వాదం ఏనుగంత బలం ఇస్తుంది......" అరే, ఇంతవరకూ టామ్ మాట మరచి పోయానే—పిలుస్తా నుండండి" అన్నాను.

ఆ తరువాత తనకుర్చీని తిరిగి ఆ పాకలో పెట్టి, టామ స్‌తో సహా ఆయన సముద్రతీరానికి వెళ్ళారు. అక్కడ ఒక స్థలంలో సముద్రంవల్ల మాకేవిధమైన ఉపద్రవమూ రాకూడ దనీ, సస్యసమృద్ధితో భూదేవి మమ్మల్ని చల్లగా చూడాలనీ, మా ఇంటిలోపల నాలుగు గోడలమధ్యా మాకు శాంతిసౌఖ్యాలు లభించాలనీ,—ఫాదర్ మార్సెల్లో భగవంతుణ్ణి ప్రార్థించారు.

ఆ తరువాత ఆయన తిరిగివచ్చి మా ఇంటిభాగంలో నాతో కూర్చొని లద్దాకిలా ముఖంపెట్టి "నెడ్, రేపు సాంచోని

చూడడానికి ఆస్పిటల్‌కి వెళుతావా ? వెళితేమాత్రం జనసమ్మర్ధంలేకుండా ఉదయమే వెళ్ళవలసిందని డాక్టర్ విస్టన్ సలహా ఇచ్చారు" అన్నారు.

"తప్పకుండా వెళుతాను. సాంచో ఏలా వున్నాడు ఫాదర్ ?"

"ఏమని చెప్పమంటావ్ నెడ్ ? సాంచో చాలాప్రమాద స్థితిలోవున్నాడు. అతనివ్యాధి విపరీతంగా ముదిరిపోయింది. క్షయరోగంతోకూడా అతను బాధపడుతూండడమే దీనికి కారణం. వ్యాధిని నిరోధించే శక్తిని పూర్తిగా కోల్పోయాడు. బహుశా అతనిని చూడడంవల్ల నీకు మరింత బాధ కలుగవచ్చును. నీకు తానే ఈ వ్యాధిని అంటించాడని చాలా బాధపడుతున్నాడు."

"అది అర్థంలేని మాట ఫాదర్; మేము ఈ దీవులన్నిటిలోనూ మకాములు వేశాం. వాళ్ళ ఇంటి దగ్గరవున్నపుడే నాకీ వ్యాధి సంక్రమించిందను కోవడానికి ఆధారాలేవీ లేవు—ఏమైనా నేను సాంచోతో మాట్లాడాలి, ఫాదర్; ఇంకొక విషయం సాంచోకి కెరిటా అనే చెల్లెలు వుండాలి ..."

"అవును నెడ్, పాపం కెరిటాకి కూడా ఈ వ్యాధి సోకింది. మొదట అంత ఎక్కువగా లేకపోయినా ఆమెకు శిశువు పుట్టగానే ఎక్కువగా వ్యాపించింది—అలాంటి సమయాలలోనే ఈ వ్యాధి విపరీతంగా వ్యాపిస్తుంది.

"ఇది అసంభవం, ఫాదర్; మీరు బహుశా ఇంకెవరి సంగతైనా చెప్తున్నారేమో. ఆమె ఇప్పుడెక్కడవుంది? ఆమెకు వ్యాధి సోకివుంటే మరి ఇక్కడ ఎందుకులేదు?" అన్నాను.

ఆమె ఇక్కడకి బాగా దూరంలో (Concepcion) కొన్ సెప్సియోన్ అను ఒక ఫ్యాక్టరీ పాఠశాలలో పనిచేసేది. అక్కనుంచి ఆమెకు సేబూ (Cebu) లోని కుష్టురోగ నివారణ కేంద్రానికి పంపించారు" అన్నారు ఫాదర్ మార్సెల్లో.

"అయితే ... అయితే ఆమె సాంచోలాగే వుందా?"

"లేదు నాయనా లేదు ఒక వేళ వ్యాధి ఎక్కువగా వున్న నీవు ఈ విషయంలో అంత బెంగపెట్టుగోకూడదు."

ఫాదర్ మార్సెల్లో మాటలువిని నేను లేని నవ్వు తెచ్చి పెట్టుకొన్నాను. ఆ నవ్వులో జీవంలేదు!

## 13 వ ప్రకరణం

ఫాదర్ మార్సెల్లో కోసం కనిపెట్టుకొని మా ఇంటికి ముందు భాగంలో నేను కూర్చొన్నాను. కొంత సేపటికి గుబురుగా పెరిగిన చెట్ల మధ్య తెల్లని దుస్తులు నాకు కనుపించాయి. తక్షణం నేను క్రిందికి దిగివెళ్ళి ఫాదర్ మార్సెల్లోని కలసికొన్నాను.

కొంత దూరం వెళ్ళేక అక్కడ కొందరు ఫిలిపైన్ స్త్రీలు గుంపుగా చేరి బట్టలు ఉతకడం నేను చూశాను, ఫిలి

పైన్ కుటుంబంలో తండ్రి, భార్య, పిల్లలూ అందరూ నుల్లె పూలలాంటి గుడ్డలు కట్టుకొని పరిశుభ్రముగా వుండటానికి ప్రతిరోజూ ఫిలిపైన్ గృహిణి బట్టలు ఉతికి శుభ్రంచేయడంలో ఎక్కువ భాగం గడపుతుంది. అంతమంది ఒకే చోట చేరి బట్టలు ఉతకడం చూస్తే కన్నుల పండువుగావుంది. కూర్చు కొని తాలంవేసేలాగు చెక్కలతో కొట్టుతారు ఆస్థలంనుంచి కొంతదూరం వెళ్ళి మళుపు తిరుగగానే ప్రత్యేకంగా ఒక కట్టడం కనుపించింది.

“ఇదే జనరల్ హాస్పటల్” అని ఫాదర్ నాతో అన్నారు.

ఎందు చేతనో దానిలో అడుగు పెట్టగానే నాకాళ్ళలో శక్తి క్షీణించి పోయింది! ముందుకి అడుగు వేయడానికి మన స్కరించలేదు. తెరచివున్న తలుపుగుండా ఒక రకపు వింత వాసనతో గాలి వీవసాగింది. నాజీవితంలో మొట్ట మొదటి సారిగా కుష్టురోగపు రాక్షసరూపాన్ని చూడ బోతూన్నాను. ఆ తలుపు దగ్గరనుంచి ఒక వరండా గుండా ముందు ఫాదర్ మారెల్లో, ఆ వెనుక నేనూ నడచి ముందుకు సాగిపోయాము, నా కళ్ళు ఎంతసేపూ అటూ ఇటూ చూడకుండా ఫాదర్ మారెల్లో తెల్లటి దుట్టులని చూస్తూనే వుండిపోయాయి. అటూ ఇటూ చూస్తే ఏయే భయంకరదృశ్యాలు నా కంట పడు తాయోననే భయంతో మెల్లగా అడుగులు వేస్తూ ఒక ఇనుప మంచందగ్గర ఫాదర్‌తోసహా ఆగాను. ఆ మంచంమీద వుండే వ్యక్తి శరీరం ఆ పాదమస్తకం దుప్పటితో కప్పబడివుంది.

“ అతని కండ్లు, కూడా దాదాపు కప్పుకొని పోయాయి పాపం ! అన్నారు ఫాదర్ మాంల్లో.

నా జీవితంలో ఎప్పుడూ ఇంతటి భయంకర దృశ్యాన్ని చూస్తానని కలలో నైనా అనుకోలేదు రోజు రోజూ కృళ్ళి శిథిలమై పోతూన్న ఈ మాంసపుముద్ద సాంచో అంటే నా కళ్ళు నమ్మలేక పోయాయి. ఉత్సాహం తొణికిసలాడే ఆ కళ్ళూ, పరుగు పరుగున వెళ్ళి, దున్నపోతు మీద స్వారిచేస్తూ ఏటికి స్నానానికి వెళ్ళి ఎంతో ఉత్సాహంతో రెక్కలున్న దేవతలా మిల మిల మెరిసే శరీరంతో, యౌవన ప్రాదుర్భావ చిహ్నాలతో చూచేవాళ్ళని సమ్మోహపరచే ఆ సాంచోయేనా ఈ మంచంమీది వ్యక్తి! తన తండ్రి కోడి పుంజుల్ని చేరదీసి, వాటికి దెబ్బలాట నేర్పుతూ, చుట్టు ప్రక్కల పిల్లలకి నాయకత్వం వహించిన సాంచోయేనా ఈ సాంచో ?

ఆ వ్యక్తి కదలలేదు. నేను అలాగే చూస్తూవున్నాను. కనుబొమలు, కంటిరెప్పలూ పూర్తిగా తినివేయబడ్డాయి. నుదుటి మీద మెరుస్తూన్న ఎర్రనిబొబ్బలతో, కొన్ని పుండ్లుగామారి వున్నాయి. ముక్కుదూలం పూర్తిగా పడిపోయి, తెరచిపెట్టు కొని భయంకరంగా ముక్కు ఉబికివుంది. క్షయ జీవులవలన శిథిలము చేయబడిన ఆముక్కు రంధ్రాలగుండా శబ్దం చేస్తూ గాలి ఊపిరితిత్తులలోనికి వెళుతూన్నది. ముక్కుపుటాల వలెనే, పెదిమలుకూడా బాగా ఉబికి, నోరుకూడా పక్షవాతం ప్రారంభించడంవలన తెరచిపెట్టుకొనే ఒక సొరంగంలావుంది.

ఫాదర్ మార్సెల్లో నావైపు చూస్తూ "నాయనా సాంచో, నిన్ను చూడడానికి ఎవరినో తీసుకువచ్చాను." అన్నారు.

ఆ మాంసపుముద్ద కదలింది కళ్లు తెరచిపెట్టుకొని నావైపు చూస్తూన్నాయి, ఆ వ్యక్తి మాట్లాడాడు కాని ఆ మాటలు చాలా నీరసంగా, లోలోపలనే వుండిపోయాయి.— ఆ కంఠధ్వని మాత్రం వికృతంగా, భయంకరంగావుంది— మృతజీవాలతో నేను మాట్లాడటంలేదుగదా! ఫాదర్ ముఖంలోనికి నేను చూచాను.

"ఎవరదీ......మీరా సార్జెంట్." నేను మాట్లాడ దలంచుకొంటే త్వరగా ముగించాలి——

"అవును సాంచో——ఇక్కడకి నిన్ను చూడడానికి సాధ్యమైనంత త్వరలో వచ్చాను. ఇన్నిరోజులుగా నేను క్వారం టైన్‌లో వుంటూన్నాను. అందుచేత ఇక్కడికి రావడానికి సాధ్యపడలేదు.

"అతను తనతలని ఊపాడు. నేను మాట్లాడుతూనే వున్నాను. నారోగానికి తానే కారణమని సాంచో అనుకొంటూ న్నట్లు నేను విన్నాననీ, ఆ విధంగా అనుకొనడం చాలా పొర పాటనీ, ఆ విధంగా జరిగివుండదనీ మరీమరీ సాంచోతో చెప్పాను.

ఇంకా ఏదో మాట్లాడడానికి సాంచో ప్రయత్నించాడు. కాని నేను వినలేకపోయాను. సాంచో నాకు కృతజ్ఞతను తెలుపుతూ నవ్వడానికి ప్రయత్నించాడు. ఆదృశ్యం చూడ డానికి మరీ ఘోరంగావుంది, అంతలో అతని శరీరంలో విష

రీతమైన మార్పువచ్చింది — శరీరమంతా ఉండచుట్టుకుపోయి, బాధ భరించలేక విపరీతంగా అరవడం మొదలుపెట్టాడు. కేరిటాకి ఈ వ్యాధిని తానే సంక్రమింపజేశానని గొణుగుతూ విపరీతమైన బాధపడసాగాడు.

ఇంతలో ఫాదర్ నా భుజంమీద చేయివేసి 'రానెడ్, వెళదాం' అన్నారు. మేము బయటికి వస్తుండగా సాంచో మంచం దగ్గరకి నర్స్ వచ్చింది. సానుభూతితో ఆమె చెప్పేమాటలకి సాంచో నిస్సహాయంగా, నీరసంగా, దయనీయంగా, నీరసంగా "కేరిటా...... కేరిటా...... కేరిటా......" అనడం నాకు వినిపించింది.

అప్రయత్నంగా నా కన్నులనుండి నీరు ధారగా క్రిందికి కారింది. నాయందు దయతలచివచ్చిన ఆ కన్నీరు నా కండ్లను అటూఇటూవుండే మంచాలమీది రోగులు కనపడకుండా నాకండ్లనుకప్పి నన్ను రక్షించింది! ఒకరోగి కాలుకి కట్టుకట్టడానికి అప్పుడే పైనున్న కప్పు తొలగించబడింది. చీముతో నిండివున్న మాంసపుముద్ద భయంకరంగావుంది. సమీపాన తెల్లటిదుస్తులతో దానికి కట్టుకట్టడానికి సిస్టర్ విక్టోరీ ముందుకువంగి, ఈ నిర్భాగ్యులపాలిటి దేవతామూర్తిలా వున్నది. !

"గుడ్‌మార్నింగ్ ఫాదర్, గుడ్‌మార్నింగ్ మిస్టర్. ఫెర్గూసన్ !" అని ఆమె మమ్మల్ని అభినందించిది.

ఈమె, ఆ కాలికి కట్టుకట్టబోతూన్న దన్నమాట ఇక నేను అక్కడ నిలువలేక వడివడిగా ఫాదర్‌ని తప్పించుకొని

బయటికి వచ్చేశాను. నాశరీం అంతా జ్వరంవచ్చి నల్లబోయింది. కొద్దిరోజుల తరువాత సాంచో మరణించినట్లు విన్నాను.

## 14 వ ప్రకరణం

మొట్టమొదటిసారిగా నాజీవితంలో ఒక క్రమపద్ధతిని ఆలోచించడం అప్పుడే మొదలుపెట్టాను. ఒకగమ్యం నిర్ణయించుకోకుండా ఈవిధంగా భయభ్రాంతమైన జీవితాన్ని గడపడం వినాశనాన్ని కొనితెచ్చిపెట్టుకోవడమే అవుతుంది. ఆనాటి ఉదయం ఇంట్లో అటూ ఇటూ తిరుగుతూ ఈవిషయాన్ని గురించే అనేకవిధాల ఆలోచించసాగాను. కాని సంతృప్తికరమైన సమాధానమేమీ దొరకలేదు. ఇక ఈవిషయంలో భయపడదలచుకోలేదు. వాస్తవాన్ని ఎదుర్కొనడానికే నిశ్చయించుకున్నాను. నేనాబలవంతుణ్ణి; ఈ ఒంటరితనాన్ని మరచిపోవాలంటే ఏదోఒక పనివుండితీరాలి.

కాని ఈలాంటి ప్రదేశంలో పని ఎక్కడదొరుకుతుంది? ప్రతిది కష్టపడకుండానే అమర్చబడివుంది. తిండి, బట్టలు, ఔషధాలు, అన్నీ! అందుచేత పనిచేయువలసిన అవసరంకాని, అవకాశంకాని ఎక్కడిది?

మనిలానుంచి ఆనాడే నావ ఒకటివచ్చింది. నాకుగాని తనకుగాని ఉత్తరాలేవైనా వచ్చాయేమో చూడడానికి టామస్ కాలనీహాల్‌కి వెళ్ళాడు. టామస్ తిరిగివచ్చేసరికి నేను సముద్రపుటొడ్డున వున్నాను. టామస్ తనతో ఒక కొత్తవ్యక్తిని తీసుకువచ్చాడు. అతనిపేరు మిస్టర్ హడ్సన్ (Hudson)

మనీలాకి వెళ్లేముందు కొద్దిరోజులు ఇక్కడ గడపడానికి మిస్టర్ హడ్సన్ వచ్చాడు. ఆయన ప్రాటెస్టెంట్ మతగురువు వస్తూనే ఆదుర్దాగా హడ్సన్ నావైపుచూచాడు. నేను సాంచోని చూడడానికి వెళ్ళడం ఫాదర్ మార్సెల్లో బహుశా హడ్సన్‌కి చెప్పివుంటారు. 'నిన్నుచూచింది చాలా సంతోషమిస్తుంది,' అన్నారు పెక్కుగంటలు గడచినపిదప హడ్సన్ కాన్సాస్ ( Kansas ) నుంచి రావడంచేత త్వరలోనే మేమిద్దరం మంచి స్నేహితులమయాం.

ఆమరునాడు తనతో నౌకావిహారానికి రావలసినదిగా మిస్టర్ హడ్సన్ నన్ను ఆహ్వానించాడు. నేను తక్షణం దానికి సంతోషంతో ఒప్పుకున్నాను.

మరునాడు నాభోజనం ముగించుకొని మిస్టర్ హడ్సన్‌ని కాలనీ పడవలరేవుదగ్గర ఆయన చెప్పినట్లు కలుసుకున్నాను. ఇద్దరం పడవమీద లోపలి అఖాతంనుంచి, క్యాలియన్ తీరంగుండా ఎదురుగావుండే చిన్న చిన్న దీవులమధ్యనుండి ఏటవాలుగాపోరంకనబడని చైనాసముద్రంలో ప్రవేశించాము. మేము తిరిగివచ్చేటప్పుడు 'కోరాన్‌దీవి' (Coron) ప్రకృతి రమణీయకతకి ముగ్ధులమై పోయాము. అతికష్టంమీద మాపడవని ఆదీవికి కొద్దిదూరంలో ఆపి, లోనికివెళ్ళాము. ఒక పెద్దరాతిమీద కూర్చొని, నీలి నీటి సముద్రాన్ని చూస్తూ మమ్మల్ని మేమే మరచిపోయాం, లోతుతెలియని ఈ నీలినీటిసముద్రాన్ని చూస్తే ఎందుచేతనో ఒక వింత భయం నాలోరేకెత్తింది. మేము తిరిగి పడవదగ్గరికి

వచ్చేదారిలో ఒక పెద్దరాతిమీదవున్న ఒక పూలచెట్టుమీదికి నా దృష్టిపోయింది.

ఏమిటది అని మిస్టర్. హడ్సన్ అడిగాడు. ఆ పూలు ఎంత చక్కగా వున్నాయో, నేను ఒకపువ్వు కోసితీరాలి" అన్నాను.

ఆ చెట్టు చాలాముసలిచెట్టు. దానిమీద ఎక్కితే ప్రమాదం సంభవించవచ్చు"అన్నాడు హడ్సన్.

ఏఁబాగై తేనేం ఆ చెట్టుఎక్కి ఒక పూలగుత్తిని అతికష్టం మీదకోసి, దిగివచ్చి హడ్సన్ కి అందిచ్చాను. అచక్కనిపూలగుత్తి పరిమళానికి నామనస్సు సంతోషంతో ఉప్పొంగిపోయింది. అంత ఎత్తునుండి నీలినీటితోనిండిన అఖాతాన్ని చూస్తుంటే ప్రపంచంలో వున్న అందమంతా అక్కడే రాశీభూతమైనదా అనిపించింది.— అందం, అందం, ఎక్కడచూచినా అందమే! క్యాలియన్‌లో అనేకమంది రోగులుపడే బాధకిమారుగా ప్రక్కనే ఈ సౌందర్యం ఎక్కడనుంచి వచ్చింది? నాలో ఏదో చెప్పరాని అనుభూతి హృదయాంతరాళాలనుంచి పొంగిపొంగి పైకి రావడానికి ప్రయత్నించింది.

ఏ నాడో నేను చూచిన పురాతన దేవాలయాల, చర్చిల, యాత్రాస్థలాల చిత్రాలు నా ఊహాపథంలో కదల సాగాయి! సిథిలాలపైన సుందరమందిర నిర్మాణం!! మానవుని విషయంలో ఇది ఎందుకు నిజంకాదు? ఇన్నాళ్లుగా నన్ను బాధిస్తున్న ప్రశ్నకి అప్రయత్నంగా ఇక్కడ సమాధానం దొరకింది?

నేను చేయవలసినది నేనే నిర్ణయించుకొంటాను. శూన్య మైన ఈ దీర్ఘమైన దినాల్ని మోసగిస్తాను! సౌందర్యాన్ని సృష్టిస్తాను. మా ఇంటికి చుట్టూ ఒకసుందరనంద వనాన్ని సృష్టిస్తాను.

ఈ క్రొత్తభావాలతో నేను క్వ్యాలియన్‌కి వెళ్ళాను. అంతవరకూ మాఇంటినిమాత్రమే పరిశుభ్రంగావుంచుతూ వచ్చాను. ఇప్పుడీ క్రొత్తప్రణాళికప్రకారం ఇంటి చుట్టుపట్ల కూడా ఒ క్రమపద్ధతిలో రకరకాల పూల, పండ్లచెట్లను పాత డానికి నిశ్చయించాను. సముద్రపుటొడ్డుకి నడచివెళ్లి, నీటివారగా నిల్చుని, ప్లాను తయారుచేయడం మొదలుపెట్టాను. ఆతీర ములో వరుసగా కొబ్బరిచెట్లువేస్తే, అవి ఎత్తుగా పెరిగి, వాటి బోదెలమధ్యనుంచి, నీలిసేటిసముద్ర, అఖాతం, క్వ్యాలియన్‌కి ఆవలవుండే దీవులూ కన్నులపండువుగా కనుపిస్తాయి. మా ఇంటి ఆవరణలో ఒక అంగారవృక్షం! నాటడానికి మాఇంటికీ, సముద్రపుటొడ్డుకీ మధ్యగా తీవిగావున్న రెండు మామిడిచెట్లనూ ఆలాగే వుంచడానికి నిశ్చయించాను. ఇంటిచుట్టూవున్న ఆవ రణపైన, ఎరుపు, పసుపురంగు పూలతీగని పాకించడానికి నిర్ణ యించాను. ఈ ఆవరణలో ఒకమూలగా చక్కని పరిమళాన్ని వెదజల్లే సిందూరమల్లెవృక్షాన్ని నాటుతాను. టామస్ నేను అడివిలోపలికివెళ్లి అనేకరకాల అడవితీగల మొక్కల్నితీసుకువచ్చి బొల్చెలలో మట్టిపోసి, వాటినిపాతి మావరండాలో వ్రేలాడ తీస్తాము. ముదురు ఆకుపచ్చరంగులో వాటి తీగలూ, ఆకులూ కంటికి ఎంతో చల్లదనాన్నిస్తాయి. వరండా అంచులవరకూ,

ఎరుపు, రక్తవర్ణపు భోగవిలాసతీగలు పెంచుతాను. ఆకుల లాంటి ఎర్రపూలతో దాదాపు ఐదడుగుల ఎత్తువరకూ పెరిగే ఒకరకపు క్రోటన్ మొక్కలు వరండాకి మరింత అందాన్ని మార్చుతాయి. ప్రస్తుతం ఇంటి ఎదటి భాగంలో కూరల మొక్కలువేసి, వెనుకభాగం ముందుభాగంగా తయారుచేస్తాను.

ఈవిధంగా ప్లానువేసి, చెత్తా, చెదరాం బాగుచేయడం ప్రారంభించాము. టామస్‌మాత్రం ఫిలిప్పైన్ దేశీయుల అల వాటుప్రకారం ఇంటిలో ఒకభాగాన్ని మాత్రమే చక్కగాశుభ్రం చేసి, పదేపదే దానికే వన్నెలూ, చిన్నెలూ దిద్దడానికి అలవాటు పడ్డాడు. కాని నాప్రణాళికప్రకారం నాతో పూర్తిగా సహాక రించడానికి నడుంకట్టాడు. మొదట పని అంతచురుకుగాసాగక పోయినా క్రమంగా నిర్ణీతపద్ధతిని మేము పనిచేయసాగాము.

ఇంతలో డాక్టర్ విన్సన్ దగ్గరనుంచి ఉత్తరం వచ్చింది. తాను ఎక్కువపనిలో మునిగివున్నాననీ, ఒకవారంలో మా ఇంటిని చూడడానికి వస్తాననీ దానిలో వ్రాశారు.

"మిస్టర్ ఫెర్గూసన్ - చాలా విశాలంగా తయారు చేశావే. రాత్రింబవళ్లు కష్టపడి పనిచేసినట్లు కనపడుతూంది." అన్నారు డాక్టర్ విన్సన్ వచ్చీరావడంతోనే.

నేను నా ప్లానంతా ఆయనకి చూపించి, ఆయన సహా యం, సహాకారంలేనిదే దానిని అమలులో పెట్టడం సాధ్యం కాదని చెప్పాను. ఆయన స్వయంగా అన్నిటినీ తనిఖీచేసి గంభీ రంగా ఆలోచిస్తు నిల్చున్నారు. ఇంతలో నేను "స్నానాల గది" సంగతి ప్రస్తాపించాను.

ఈ సమీపంలో నీరెక్కడైనా దొరుకుతుందా అని ఆయనను అడిగాను.

సంతోషంపట్టలేక, సమీపంలోనే ఒక నీటిధారవున్నదనీ, టామస్ అక్కడనుంచే నీరు తీసుకువస్తాడనీ చెప్పాడు. ఆ ప్రదేశం నుంచే గొట్టంద్వారా నీటిని తీసుకురావచ్చుననీ, గొట్టాలు నీటిధారకి పైగా అమర్చితే మంచిదనీ, క్రిందభాగంలో ఎప్పుడూ జనం గుడ్డలు ఉతుకుతూండడంవల్ల ఆ నీరు మంచిదికాదనీ, డాక్టర్. విన్టన్ చెప్పారు.

ఆ తరువాత ఆ ప్రదేశాన్ని పరీక్షించడానికి డాక్టర్ విన్టన్‌తో నేను వెళ్ళాను. ఆ నీరు బట్టలు ఉతకడానికే కాకుండా మాస్నానానికీ, మా ఇంటితోటకీ పుష్కలంగా సరిపోతుంది.

ఈ విధంగా వారాలూ? నెలలూ మార్పేమీ లేకుండా గడచిపోతూన్నాయి. టామస్ మాత్రం ఇంటి విషయాలలో చక్కగా తర్ఫీదు పొందాడు. అమెరికాదేశపు వంటకాలుకూడా టామస్ నాదగ్గర నేర్చుకొన్నాడు. ఈవిధంగా మా భోజనం అమెరికన్ ఫిలిప్పైన్ వంటకాలమిశ్ర భోజనంఅయింది. మాగుడ్డ లిని ఉతకడానికి ఒకచాకలినికూడా సంపాదించగలిగాను. నాపె న్షన్ సక్రమంగా రావడానికి డాక్టర్ విన్టస్ ఎంతగానో సహాయం చేశారు. నాకింక ఇంటిదగ్గరనుంచి డబ్బు పంపనవసరంలేదని తమ్ముడు టామ్‌కి వ్రాశాను. (ఈ వృత్తరాలీదీవినివిడచి బగు టికి వెళ్ళేముందు అన్నిటినీ అక్కడి ఆరోగ్యశాఖాధికారులు క్రిమినాశక పదార్థాలతో పూర్తిగా పరిశుద్ధం చేస్తారు.) క్రీస్టు

మన్‌కి తొమ్మిది రెండువందల డాలర్లు పంపించాడు. కుర్చీలు మొదలైన కొన్నిసామానులూ, స్నానాలగదిలోపల అమర్చే సామానులూ ఈ డబ్బుతో కొన్ని తెప్పించాను. స్నానాలగదిలో నీటి "షవర్" అమర్చాము. వంటఇంటికినీటితొట్టెకూడా అమర్చాము. జలధార నీటినుండికీడులు పుట్టకుండుటకు ఆ నీటికి క్రిమివినాశక బావికట్టబడెను. నీటిపరిశుభ్రత విషయంలో తీసుకోవలసిన జాగ్రత అంతా తీసుకొన్నాము. ఇక అక్కడి వాతావరణాన్నిబట్టి నీటిని వెచ్చచేయవలసిన అవసరమే లేకపోయింది.

నీవిగా, ఎత్తుగా పెరిగిన మామిడిచెట్లమధ్యనుంచి, సముద్రపు నీలి అఖాతం కన్నులపండువుగా కనపడుతూంది. నా సంతృప్తికి, గర్వానికి ఇదే ముఖ్యకారణం. ఈ మామిడిచెట్ల నీడలో తెల్లగారంగువేయబడిన కుర్చీలు కొన్నివున్నాయి. ఈ కుర్చీలకు రంగువేయడం పూర్తికాగానే, క్రిమివినాశక ద్రవ్యంతో వాటిని పరిశుభ్రం చేయడానికి డాక్టర్ విన్సన్ ఎవరినో ప్రత్యేకంగా పంపించారు. ఎవరైనా మమ్మల్ని చూడడానికి వచ్చినప్పుడు తమకి ఏర్పాటుచేయబడిన కుర్చీలపైననే వారు కూర్చొనేవారు. టామస్, నేనూ వాటిని తగలకుండా ఎంతో జాగ్రత్తగా, ఆకాలనీలో మమ్మల్ని చూడడానికి వచ్చినవారినికూడా వాటిని తగలకుండా చూసేవాళ్ళం.

## 15 వ ప్రకరణం

క్యూలియన్‌కి నేనువచ్చి దాదాపు రెండు సంవత్సరాలైంది. ఆ దేసమయంలో అమ్మ మమ్మల్నివిడచి స్వర్గస్థ

రాశైనట్లు టామ్ వ్రాశాడు. మా అమ్మ ఏమంతబలమైన మనిషికాకపోయినా ఇంటిపనులు చక్కబెట్టుకుంటూ కాలక్షేపం చేస్తూంది. క్రిందటి సంవత్సరంనుంచీ బాగా నీరసించిపోయింది. అరవై ఏండ్ల వయసులోవున్నా అది ఏమంత ముసలివయస్సు కానేకాదు. అమ్మ లేకుండా మా ఇంటిని తలచుకొంటే గుండె నీరై పోతూంది.

"అమ్మ ప్రాణపదంగా దాచిన నీలిగిన్నెలు నీకు పంపుతున్నాను. అవిఅంటే నీ కెప్పుడూ ఎంతో ఇష్టంకదూ!" అని టామ్ వ్రాశాడు.

ఆ గిన్నెలమాట తలచుకొంటే గడచిన దినాలు నాఊహాపథంలో మధురస్మృతులుగా గోచరించాయి. అమ్మకి ఆగిన్నెలు పెండ్లి కానుకగా వచ్చినవి. ఆ గిన్నెల్ని బహుఅరుదుగా, పుట్టినరోజు పండుగకో, అమ్మా నాన్నల పెండ్లి సాంవత్సరికోత్సవానికో మాత్రమే ఉపయోగించేవారు. ఆ నాటిరాత్రి వాటిని ఎంతో భద్రంగా దాచేసేది మా అమ్మ. నీలిరంగు పట్టీలపైన బంగారపుటంచుల చైనా, ఇంగ్లీష్ పింగాణీసామాను తెల్లగావుండే మధ్యభాగంలో ఎరుపు; నీలిపువ్వులతో ఎంతో చక్కగావుండేది. టామ్ ఈ సామాను కాక ఖరీదైన ఏ ఇతర సామాను పంపినా, నాకంత సంతోషంగా వుండేదికాదు, ప్రయాణంలో పగిలిపోకుండా అవి జాగ్రతగా నాకు చేరుతాయని అనుకుంటూన్నాను.

తిరిగి ఇంకొకసారి టామ్ వ్రాసిన ఉత్తరాన్ని చదువుతున్నాను.

వ్యాపారం ఏమంత బాగాలేదుట - కాని యూరప్‌లో యుద్ధం రాబోతూందనీ, అందుచేత అమెరికాలో మాంచి గిరాకీ తగులుతుందనీ జనం అనుకుంటూన్నారట! "యుద్ధమేవస్తే మాబోటిగాళ్ళు బయటవుండటానికి వీలుపడవని అంటూన్నారు. అందుచేత సైనికదళంలో చేరడానికే నిశ్చయించుకున్నాను" అని టామ్ ఉత్తరాన్ని ముగించాడు. ఈ ఆఖరిమాటలు నిజంగా ఎంతగానో బాధించాయి. ఒక్కసారిగా మాకుటుంబ వ్యవహారాలన్నీ నామనస్సులో గిరగిరతిరిగినాయి. (American Revolution 1776-1784) అమెరికన్ "తిరుగుబాటు" దగ్గరనుంచి ఇంతవరకూ ప్రతిఒక్క యుద్ధంలోనూ విడవకుండా మా కుటుంబంతరఫున పాల్గొంటూనేవున్నాము. నేను యుద్ధమంటే భయపడేవాణ్ణికాను. కాని, ఏవిధంగానైనా టామ్ యుద్ధానికి వెళ్ళకుండావుంటేనే మంచిదనే నిశ్చయానికి వచ్చాను. "యుద్ధం" ... ఒక్కసారిగా నాగాయాలన్నీ జ్ఞాపకంవచ్చాయి. నా కష్టమ్నాన్ని కూడా యుద్ధంప్రేరేపించిందే !!! ఏమైనా యూరప్ వెళ్ళినా టామ్‌కి ఈరోగంరాదనే ధైర్యంనాకువుంది.

## 16 వ ప్ర క ర ణ ము

ఇంకా వర్షాలు ప్రారంభంకాలేదు. ఒకనాడు డాక్టర్ విస్టన్ నన్ను చూడడానికివచ్చారు, మేమిద్దరం బయటికి షికారు బయలుదేరాము. భోగవిలాసతోటలలోనుంచి కీచురాళ్ళు చెవులు చిల్లులుపడేలా అరుస్తున్నాయి. ఆధ్వని భరింప శక్యంకాకుండా వుంది. మళ్ళీఒక్కసారి నిశ్శబ్దం. ఆనిశ్శబ్దాన్ని భంగపరుస్తూ ఊసరవెల్లి అరుపు. తిరిగి కీచురాళ్ళహోరు !

"ఈకీచురాళ్ళు ప్రాణాలుతీసేస్తున్నాయి!" అన్నారు డాక్టర్ విన్టన్.

"అవును నిజమే; కాని ఇంతకంటె సోమరితనంగా రోజులు వెళ్ళబుచ్చడం మరీ ఘోరంగావుంది. నేను వచ్చినప్పటి కంటె ఆరోగ్యం క్షీణించకపోయినా, అట్టే అభివృద్ధికూడా కనుపించటంలేదు" అన్నాను.

"అవును, ఆసంగతినాకు తెలుసును కాని నిరుత్సాహ పడకూడదు నెడ్. ఈకొత్తరకం ఇంజక్షన్లు బ్రహ్మాండంగా పని చేస్తాయని అందరం విశ్వసిస్తున్నాం."

"వచ్చినచిక్కేమిటంటే అంతులేకుండా వేచివుండటం. దీనికొక హద్దూ పద్దూఅంటూ లేకుండావుంది. సోమరితనంగా ఈవిధంగా ఎన్నాళ్ళు గడపాలో తెలియకుండావుంది. ఈఇల్లుకట్టడం పూర్తిఅయింది. తరువాత చేయడానికి ఏపనీ లేదు. ఈవిధంగా ఉదయం మొదలు సాయంత్రంవరకూ పనీ లేకుండా కూర్చొని, వరుసగా ఒక్కొక్క అవయవమే శిథిలమై పోతూంటే చూస్తూ ఆఖరినిమిషాలకోసం లెక్కపెట్టుకొంటూ కూర్చొనడం నాకు చేతకానిపని!" ఈవిధంగా నెలలతరబడి నాలో చెలరేగుతూన్న భావాలనన్నిటినీ ఒక్కసారిగా శర వేగంతో వచ్చే మాటలతో వ్యక్తంచేసాను మనస్సువిప్పి!

"నీవన్నది నిజమే! కాని ఇలాంటి స్థలంలో అందరికీ పనిచూపించడం సులభమైనపనికాదు" అన్నారు విన్టన్.

"కాని అందరికీ పనిచూపించిలీరాలి. ఈవిధంగా చాల మందిని సోమరిపోతులలా వదలివేస్తే ఎలాగ?" అన్నాను.

"మనం ఇళ్ళలోదూరి, తండ్రినికాని, కొడుకునికాని కుష్టువ్యాధిగ్రస్తుడనే నెపంతో బయటికి తీసుకువచ్చి, ఇష్టంలేక పోయినా ఈకాలనీకి తీసుకువచ్చి వాళ్ళచేత బలవంతంగా పని చేయించలేముకదా? ఆవిధంగా వచ్చినవారిలో పనిచేయలేని వారు కొందరుంటారుకదా?" అన్నారు విల్సన్.

"ఆమాట నిజమేకాని, డాక్టరు గావొ అభిప్రాయం ఈరోగులచేత తగినంతగా పనిచేయిస్తే వాళ్ళ ఆరోగ్యానికి భంగ కరమనేనా?" అని ప్రశ్నించాను.

"ఈప్రశ్నకి సమాధానం నీవే ఊహించుకోవచ్చును నెడ్. ఎవరికైనా తాము చేసేపనిలో ఉత్సాహంవుంటే దానివల్లవారికి మేలుచేకూరుతుంది. అవసరైనా వారికి శక్తికిమించి చేయనీయ కూడదు."

"మరి ఇక్కడ దాదాపు 3500 మంది జనంవున్నారు వీరిలో చాలామంది తిరిగి వారివారి ఇళ్ళకు వెళ్ళరుకూడా. వీరంతా తమ జీవనంకోసం ఏదోఒకపని ఇక్కడే చూసు కోవాలి."

"అవును కొందరికేమాత్రం ఇక్కడ స్టోర్స్‌లో పనిదొరి కింది. కొంతమందిని ఉపాధ్యాయులుగా నియమిస్తాం. అయినా నీవన్నదినిజం. ఒక నిర్ణీతపద్ధతిలో అందరికీ పనిలేదు."

"నేనున్న ఈప్రదేశంచూడండి. దీనిపనిలో నేను చాలామందిని నియమించాను. కాని ప్రతిరోజూ వారికి నేను పనిచూపించలేకపోయాను. అందుచేత ఈపనిలో వారు స్వల్పం

గానే సంపాదించగలిగారు. నేను మాట్లాడినదానినిబట్టి ఈ జనమంతా ఏదో ఒకపనిచేయడానికి సంసిద్ధంగా వున్నట్లు తేలింది."

"నీవుచెప్పినది అక్షరాలా నిజం నెడ్! వీళ్ళకి పని చూపించాలంటే సంవత్సరంపొడవునా పనిఎక్కడిది? ఒకవేళ అలాంటిదేదైనావుంటే సలహాఇవ్వమని కోరుతున్నాను."

"అలా అయితే వినండి. ప్రస్తుతం చేపల్ని సరఫరా చేయడానికి ఒకకంపెనీతో ఒప్పందం చేసుకున్నారు కదా. ఇక్కడవున్న రోగులలో చాలమంది పల్లెవారు. అందరికి చేప లిని పట్టడం బాగా తెలుసును. ఇక్కడ కావలసినన్ని చేపలు దొరుకుతాయికూడా. అలాంటప్పుడు అవకాశం మనవాళ్ళకే ఎందు కివ్వకూడదు."

"కాని ఇది అసంభవం. నాలుగువేలమందికీ చేపల్ని సరఫరాచేయడం మాటలలో అయేపనికాదు; అదీకాక వీరిదగ్గర దానికి సరిపోయే సాధన సామగ్రికూడాలేదు. ఒకవేళవున్నా వీరి మీద ఆధారపడలేము. ఈ పనిమాత్రం వీళ్ళచేత కాదన్నది నిజం!"

"వీరిలో చాలమందిపైన ఆధారపడి వుండలేమన్న మాటనిజమే. కడుపునిండా తిండిపెడితే వెచ్చగా ఎండలో కూర్చొని కాలం వృథాగా గడిపేస్తారు! కాని వీరిలోకూడా హృదయపూర్వకంగా, సమ్మకంగా పనిచేసేవారు చాలమంది వున్నారు. అయినా ఏపనైనా విజయవంతం కావాలంటే వారిలో నిర్మాణాత్మక కృషి పెంపొందించాలి. అయినా

విజయం సాధించవచ్చును. ఈ నాలుగువేలమందికీ రేపే చేపల్ని సమృద్ధిగా సరఫరా చేయడం కష్టమే. అయినా కొంతభాగం సరఫరా చేయడం కష్టమైనపనికాదు. ఈవిధంగా సోమరితనంగా ఇంతమంది జనం కాలంగడపడం వాంఛనీయంకాదు. వాళ్ళకి పనిచేయ ప్రోత్సహించడమేదియులేదు. ఇక్కడి స్త్రీలు గంటల తరబడి బట్టలు ఉతుకుతూ మల్లెపూలలా వాటిని తయారుచేయడం బాగానేవుంది కాని, ఏ పనిలేకుండా ఇంతమంది మగవాళ్లు అమూల్యమైన తమకాలం వ్యర్థం చేయడం దుర్భరం!

వాళ్ళకి బయిటి మార్కెట్లులేవు; ఇచ్చట మార్కెట్టు ఒకటేవుంది. దానిని ఇచ్చటిరోగులకివ్వక స్వస్థులకివ్వడం ఉచితం కాదు. ఈమాటల్ని విని విన్టన్ దీర్ఘాలోచనలో పడ్డారు.

"అయితే ఇప్పును నీవు చేయమనేదేమిటి, నెడ్?"

ఈ ప్రశ్నవేసి విన్టన్ నన్ను పెద్దచిక్కులోనే పడవేశారు. నేనడిగేదేమిటి? పైకి చెప్పకపోయినా, నాఉద్దేశ్యం స్పష్టంగా తెలుస్తూనేవుంది.

"నాకు కావలసినది అంతా కాకపోయినా ఒకభాగమైనా చేపల్ని సరఫరా చేయడానికి ఒప్పందం, ఇంకొకరికి ఇచ్చే పద్ధతిగానే నాకూ యివ్వండి. పనిచేయుటకు ఆతురత పడు వారున్నారు. నేను జనాన్ని సమకూర్చుకొని ఈపని ప్రారంభం చేస్తాను."

"కాని దీనిలో ఇంకొక చిక్కువుంది. కొందరి అభిప్రాయం కుష్టురోగులు ఏ పనీ చేయకూడదని; కాని ఈ విధంగా పనిచేయడంవల్ల వీరి ఆరోగ్యానికేమీ భంగంకాదని మెడికల్ డైరెక్టరుగా హామీ ఇవ్వవలసిన బాధ్యత నాపైవుంది."

ఈ విషయంలో ఫాదర్ మార్సెల్లో, మిష్టర్ హాప్సన్ లిద్దరూ తప్పక మనకి అండగా వుంటారని నవ్వుతూ అన్నాను.

" అది బాగానేవుంది — కొంతభాగం చేపల సరఫరాకి నిన్ను నియమించుతాననుకో. ఈకాలనీలోవున్న రోగులలో నీవు నియమించిన ఒకరోగి ఆరోగ్యం ఆపనివల్ల క్షీణిస్తుందనుకో అప్పుడు నేను చిక్కులో పడతాను. మామూలు సమయంలో ఈచుట్టుప్రక్కలకి వందలకొలది మైళ్ళదూరంకూడా దాని రాజకీయవేత్తలు, ఈసంఘటన జరిగిన మరుక్షణంలో ఈరోగులపట్ల ఎక్కడలేనిశ్రద్ధా కనపరుస్తారు. ఇక మేనేజరుగా నీకు నెలనెలా జీతంవస్తుంటుంది. నీఅధికారం తక్కువవాళ్ళపై సాగుతూంటుంది. 'మావూళ్ళో జనులనుండి డొబ్బుకొని పోవడానికి వచ్చేశాడండి అమెరికన్వ్యక్తి ఒకడు, చురుకైనవాడు అంటారు' అని చెప్పుచు దీర్ఘాలోచనలో దిగబడ్డాడు. అయినా ఈ విధానం ఏలా వుంటుందో దానిలో దిగుతేకాని తెలియదు.

"డబ్బువిషయం ఏమంతపెద్దదికాదు. నాకు నెలనెలా పెన్షన్వస్తుంది. నాకు ఇల్లువుంది, నాకు ఖర్చులు చాలా తక్కువ. నాకు జీతం ఏమీ అక్కరలేదు. రాజకీయవేత్తల నోళ్ళు ఈవిధంగా మూయవచ్చును. తక్కువవారిని కూడ సహకారరీతి గట్టుకొని ఈపద్ధతి ఏవిధంగా నడుస్తుందో చూడాలని వుంది. డబ్బుసంపాదన ముఖ్యవిషయంకాదు. "

ఆయన దీర్ఘాలోచనలో దిగబడ్డాడు. చల్లగావీచేగాలికి దూరంగావున్న తాటిచెట్లు తలలూపుతున్నాయి. కొబ్బరిచెట్ల

ధ్వని క్రమంగా తగ్గిపోయింది. త్వరలో వర్షాలు కురియడానికి ఇది సూచన అనిచెప్తారు.

విన్టన్ లేచి తనపైపులోవుండే బూడిద ఎడమచేతి మణికట్టుమీద పైపునికొట్టి, దులిపి, గేటుదాకా నడచివెళ్ళి, ఒక్కసారి వెనుకకుతిరిగి నావైపుచూసి, "చేపలసరఫరా విషయంలో నీవుచెప్పిన సలహాను గురించి ఆలోచించి చెప్తాను నెడ్. మరి వెళ్ళివస్తా." అని విన్టన్ వెళ్ళిపోయారు.

నేను ఆయనవైపేచూస్తూ నిలుచుండిపోయాను. ఒక వైద్యప్రముఖుని దృక్పథంలోకాక, సామాన్యుని దృక్పథంలో ఈసమస్యను విన్టన్ ఆలోచిస్తున్న సంగతి స్పష్టంగా నేను గ్రహింపగలిగాను.

## 17 వ ప్ర క ర ణ ం

సేబూనుంచి రోగులను తీసుకువెళ్ళే ఓడమీద రెవరెండ్ హడ్సన్ మనిలాకు వెళ్ళేముందు మమ్మల్ని చూడడానికి ఒక నాడు వచ్చారు.

ఆయన మాఇంటికివచ్చే సమయానికి టామస్ తన కోడి పెట్టని తనఒడిలో పెట్టుకొని ఎంతో ప్రేమతో దానిని దువ్వుతున్నాడు.

"టామస్, ఎంతబాగుందీకోడిపెట్ట ఎక్కడనుంచి సంపాదించావ్ దీనిని?" అని రెవరెండ్ హడ్సన్ ప్రశ్నించారు.

"నాపుట్టినరోజుకి కానుకగా మిష్టర్ ఫెర్గూసన్ దీనిని నాకిచ్చారు. ఇన్నాళ్ళనుంచీ ఆయన నన్నెంతో ప్రేమగా చూస్తున్నారు.

టామస్ ఎప్పుడైతే ఇలాచెప్పాడో నాకు లోలోపల అదోలా అనిపించింది. వాస్తవంగా టామస్ నాకు చేస్తున్న చాకరీతో పోల్చిచూస్తే, నేను టామస్‌కి చేసినది ఏమీలేదనే చెప్పాలి. బహుశా టామస్ ఋణాన్ని నేను ఎన్నటికీ తీర్చుకోలేనేమోకూడా. పుట్టినరోజు పండుగవస్తే టామస్‌కి గండమే! ఇట్లా ఇంటిదగ్గర జనం జ్ఞాపకంవచ్చి, టామస్ చెప్పలేని బాధపడతాడు. అందుచేత అదంతా మరచిపోవడానికి ఒక చక్కని కోడిపుంజుని మాపొరుగునవున్న హిలారియోలా రోసా (Hilariola Rosa) దగ్గరకొని, తెల్లవారకుండా టామస్ నిద్రపోయిన గదిలో వదలిపెట్టాను. టామస్ విచారంలో పడకుండా ఆకోడిపుంజే నన్ను రక్షించింది! తనదగ్గర నానా హడావిడీ చేస్తున్న ఆకోడిపుంజు తనదేనన్న ధీమాలో తనతల్లిని, చిట్టిచెల్లెల్ని మరచి, టామస్ దానికి ఆహారంవేస్తూ, పూర్తిగా దాని సంరక్షణలో మునిగిపోయాడు !

"పందేనికి తీసుకువెళుతావా దీనితో అని రెవరెండ్ హడ్సన్ టామస్‌ని ప్రశ్నించారు."

"అవునండి, ఈ కోడిపుంజుని దెబ్బలాడకుండా వుంచేటంత మూర్ఖుణ్ణి కానండి. అందులో స్వాతంత్ర్యదినోత్సవంనాడు ఈ అవకాశాన్ని పోగొట్టుతానా?"

'దీనిద్వారా స్వాతంత్ర్య దినానికే ఒక బ్రహ్మాండమైన గౌరవం తెస్తున్నావన్నమాట టామస్. అయితే జూలై నాల్గవతేదీన ఫిలిప్పైన్ దేశస్థులు రైజల్‌దినం లాగానే అమెరికా స్వాతంత్ర్య దినోత్సవానికికూడా ఎంతో హడావిడి చేస్తారుకదూ సరి - టామస్; నీకూ నీకోడెపుంజుకు నా శుభాకాంక్షలు ? "

దానికి టామస్ ఇట్లన్నాడు :-

ఏలంటే, అమెరికన్ మిగుల గొప్పవాడును శక్తిమంతుడును రీజాలు ఫిలిపినోలువలె మా స్వాతంత్ర్యమును ఆకాంక్షించువాడు పెద్దయుద్ధనౌకలుతో వచ్చి స్పానిష్‌నౌకలను ముంచేశాము, ఫిలిపినోలకు చెప్పాడు :-

ఇకమీద మీకు స్వతంత్రతతో నుండు విధానాన్ని
నేర్పిస్తాం. ఇంగ్లీషుభాష కలిపించి మంచి
అమెరికన్ పౌరులుగా నుండుటకును రానురాను
స్వతంత్రులుగా నుండుటకును నేర్పిస్తాం' అని.
జూలై నాల్గవతేదినాడు అమెరికన్‌లు
పెద్దకేకలు వేస్తారు; ఫిరంగీలు
కాలుస్తారు; బొస్టన్ టీపార్టీ (Baston
tea party) స్మరించుకొని మిగుల హాయిగా నున్నారు!
అట్లే ఫిలిపినోలుకూడ టీపార్టీ విందుతో శీఘ్రకాలంలోనే
హాయిగ నుండబోతారు. " అని.

[ఈ మాటలో విశేషార్థం :- బోస్టన్ టీపార్టీ అనునది ఒక చరిత్రాత్మక గొప్పసంభవము. అమెరికన్ ముఖ్యులు కొందఱు ఈస్టిండియా ఓడలు తేయాకు పెట్టెలతో రాగా మోహన్

కూలీల వేషముదాల్చి వాటిని దింపేలాగు సముద్రంలో ముంచే శారు. ఇది బ్రిటిష్‌తోటి స్వతంత్రయుద్ధమునకు ధ్వజారోహ ణాలలోనిది. కాని టామస్ భావమేమో అసలు తేయాకుఎందే]

జూలై రెండవతేదీనాటికే ఆ కాలనీవీథులన్నీ ఫిలిప్పైన్, అమెరికన్ జెండాలతో కలకలలాడుతున్నాయి, విన్టన్‌కోసం కబురు పంపించారు. నేను కాలనీహాల్‌దగ్గరకి వెళ్ళగానే నాల్గు నైపులనుంచీ అందరూ అమెరికా పౌరునిగా నన్ను అభినందిం చారు. విన్టన్‌కూడా నన్నభినందించి, స్వాతంత్ర్య దినోత్స వానికి మా జెండాస్థంభం తయారైందా అని అడిగారు.

ఇంకా సిద్ధంకాలేదనీ, నాల్గవతేదీకి తయారవుతుందనీ, మామిడిచెట్లకీ సముద్రపుటొడ్డుకీ మధ్యగా ఒక పెద్ద స్థంభాన్ని జెండాకి ఏర్పాటు చేస్తున్నామనీ చెప్పాను.

ఆతరువాత విన్టన్ కార్యాలయములో అనేకమంది రోగులతో నేను మాట్లాడి, మేము త్వరలో నిర్వహించబోయే చేపల సరఫరా ప్రణాళికలో వీరిలో ఎంతమంది ముందుకు వస్తారో అని పరిశీలించాను. ఇంతలో డాక్టర్ విన్టన్ నాకొక శుభవార్త తీసుకొనివచ్చాననీ - సాంచో చెల్లెలు త్వరలోనే అక్కడికి రోగులని తీసుకువచ్చే ఒకనావలో రాబోతూన్నదని - ఆయన నాతో చెప్పారు.

"ఇంతకుముందుకూడా ఐదారు పర్యాయములు కేరిటా వస్తున్నట్లు విన్నాననీ, కాని ఆశాభంగం కలిగిందనీ, ఈసారికూడా ఆమెరాక అంతేనిజమనీ - అన్నాను.

"ఈ మాట అబద్ధంకాదనీ,—ఆ నావమీదనే ఆరోగ్య శాఖ డైరెక్టరు డాక్టర్ మార్షల్ కూడా వస్తున్నారనీ, ఆయన ఆ పదవికి రాజీనామాచేసి ఫిలిప్పైన్స్ దీవుల్ని విడచి ఈ నెలలోనే వెళ్ళిపోబోతూన్నారనీ, అందుచేత ఆఖరుసారిగా ఇక్కడికివచ్చి, రోగుల్ని పరీక్షించి వెళ్ళిపోదలచారనీ, ఆయన మనిలాకి తిరిగి వెళ్ళేలోపుగా నన్నుకూడా ఒకపర్యాయం చూడాలని అన్నారనీ" విన్టన్ నాతో అన్నారు.

"అంతేకాదు. మా కార్యాలయంలో పనిచేసే ఒక వ్యక్తి మనిలానుంచి, మీ తమ్ముడు టామ్ పంపిన ఒకపత్రమూ నాన్నికూడా తీసుకురాబోతూన్నాడు" అన్నారు విన్టన్.

ఈ మాట వినడంతోనే నాగుండె ఆగిపోయినంత పని అయింది.

"టామ్‌కి మరేమీ ప్రమాదం జరుగలేదుకదా? ఒక వేళ టామ్‌కి......కుష్టువ్యాధి సోకలేదుకదా?"

"లేదు, లేదు, నెడ్—అలాంటి దేమీకాదు—నిన్ను ఇంత గాబరాపెట్టినందును క్షమించు—టామ్ నీకొక ప్రత్యేక బహుమానం పంపించాడు—అంతే!"

విన్టన్ ఈ మాట చెప్పగానే నామనస్సు కుదుటపడింది.

నీ కింకొక శుభవార్త చెప్పబోతూన్నాను నెడ్—ఇవాళ అంతా వార్తలమయమే! నీవుచెప్పిన చేపల సరఫరా ప్రణాళికని అమలు పరచడానికి నాఆమోదాన్ని తెలియపరచుతూన్నాను. ఇప్పటికే కొన్ని ఒప్పందాలు అమలులో వున్నాయనుకో,

అయినా ఈ 'కాలనీ' అభివృద్ధిచెందుతూన్నకొలదీ ఎక్కువగా, చేపల్ని సరఫరా చేయవలసిన అవసరం ఎంతైనావుంది. కాని మధ్యలో ఏ అడ్డంలేకుండా నిర్ణీతప్రకారంగా, తాజా చేపలు సరఫరా అయేటట్లుమాత్రం నీవు చూడాలి. అందుచేత ఈ మొత్తం విషయంలో నీవు బాగాఆలోచించి, నాతో త్వరలో చెప్తే, నేను అధికారపూర్వకంగా తాఖీదు జారీచేస్తాను. " అన్నారు డాక్టర్ విన్టన్,

ఆ తరువాత ఈ సమస్యనిగురించి ఆలోచనలతో నాతల బరువెక్కి పోయింది. ఈ ప్లాజాలిబర్తాద్ (Plaza Liberted నాటకరంగం) చోటుకు పండుగదినానికి గుంపులు గుమిగూడుదురు. పొడుగుమెట్లెక్కి నేను వచ్చేవాళ్ళను గమనించుచు వాళ్ళలో ప్రణాళికకు నేను ఉద్దేశించువాళ్ళున్నారో అని చూచు చుండగా జోస్‌క్రుజ్‌కూడా అప్పుడేవచ్చాడు. జోస్‌క్రుజ్ నామకాముకి చాలా దగ్గరలో వుంటూన్నాడు. మొట్టమొదట ఆ మకాముని తయారుచేయడంలో జోస్ నాకు ఎంతగానో తోడ్పడ్డాడు.

" అయితే దీనిద్వారా మనం డబ్బు సంపాదించవచ్చు నంటావా మిస్టర్. ఫెర్గూసన్ ? " అన్నాడు జోస్ నమ్మలేకుండా ?

" నా ఉద్దేశ్యం అదే, జోస్. కాని ఎంతవరకూ కొనసాగుతుందో తెలియదు. " అన్నాను.

" డబ్బు సంపాదించడానికే అయితే ఎంతపని చేయడానికైనా నేను సిద్ధమే ! నేను రోగిష్టివాణ్ణి అయినా, ఏమంత

ప్రమాదస్థితిలో లేను. మనబోటివాళ్ళకి పనిలేకపోతేనే రోగం మరింత ఎక్కువౌతుంది. నా శరీరంలో ఓపిక వున్నంతకాలం నేను పనిచేసి తీరుతాను. ఇక్కడికి వచ్చేముందు నేను పడవల నిర్మాణంలో సహాయపడుతూవచ్చాను. చేపలు పట్టడంలో అంత ప్రవీణత కలదని చెప్పలేను కాని, నన్ను ఈపనిలో నియమిస్తే, శక్తివంచన లేకుండా పనిచేయగలనని మాట ఇస్తున్నాను."

"అంతకంటేనా! తప్పకుండా రేపు నామకామకిరా. వచ్చేటప్పుడు (Manyel Zanulla) మేన్యూల్ జనిల్లానికూడా తీసుకురా. నేను మరికొందరిని తీసుకువస్తాను. అందరంకలసి ఈ విషయంలో సంప్రదించుకొనవచ్చును."

శాన్‌లజారోలో తెల్లవారి లేవగానే టామస్ ప్రక్కని వున్నప్పుడు నాతో మొట్టమొదట మాట్లాడినవాడు మేన్యూల్ జనిల్లా, మేన్యూల్ క్యూలియన్‌కి రావడం ఆలస్యమైననువచ్చి అప్పుడే చాలా నెలలైంది.

మరునాటి మధ్యాహ్నం అందరికంటె ముందుగా జోస్ మాఇంటికి వచ్చాడు. జోస్‌లో ఉత్సాహం వెల్లివిరుస్తూంది. మేన్యూల్‌కూడా అదేవరసలో వున్నాడు. వచ్చీ రావడంతోనే "రేపు స్వాతంత్ర్యదినం. ఈనాడు మనం మనస్వతంత్ర జీవనానికి ప్రారంభోత్సవంజరుపుకొనడం గమనార్హం అన్నాడు. "(Frederi-ko Arang) కూడావచ్చాడు. ఫెడరికోమాఇంటికి కొత్తేమీ కాదు. దాదాపు రెండుసంవత్సరాలుగా టామస్‌కి పాఠాలు నేర్పుతూన్నాడు. మూడుసంవత్సరాలక్రితమే అరాంగ్‌కి భయం

కరవ్యాధి సోకింది. అరాంగ్ అతిప్రాచీనమైన (1611 లో స్థాపితం) శాన్ టామస్ విశ్వవిద్యాలయంలో (San Tomas University) న్యాయశాస్త్రంలో పట్టభద్రుడైనాడు. ఇక న్యాయవాదవృత్తిలో ప్రవేశించడానికి సిద్ధంగా వుండగా ఈ వ్యాధికి గురిఐనాడు. మొదట శాన్ లజారోకీ, తరువాత కుల్యాలియన్‌కీ అరాంగ్‌ని పంపించారు.

నేను ఎన్నోవిధాల ప్రార్థించగా, అరాంగ్ ఇప్పుడిక్కడికి వచ్చాడు. అరాంగ్ ఇటువంటి ప్రణాళికల నిర్వహణలో సిద్ధహస్తుడు. మేము ముందు చేయబోయే విషయాలన్నిటినీ అరటిపండు వొలిచి చేతిలో పెట్టినట్లు మాఅందరికీ వివరించిచెప్పాడు. నేను మొదట తయారుచేసిన చిత్తు ప్రణాళికకు సమగ్రస్వరూపం ఇచ్చినదికూడా అరాంగే, చేయవలసిన విధానములు అన్యోన్య సంబంధాలు అన్నియు తేటతెల్లం చేసాడు. అరాంగ్ సలహా విన్నతరువాత మా అందరిలో ఒకనూతనోత్సాహం వెల్లివిరిసింది. ప్రతిఒక్కరూ ఈ పనికి కావలసిన జానాన్ని సమకూర్చడానికినడుములు బిగించారు. నేనక్కడవున్న రెండుసంవత్సరాలలో అక్కడ వున్నవారిలో అంత ఉత్సాహం నేనెన్నడూ చూడలేదు. దేశ నాయకుల గౌరవార్థం అనేక ఉత్సవాలు, సభలు, సన్మానాలూ జరుపుతారు. కాని సంఘంనుంచి వెలివేయబడిన ఈకుష్ఠురోగుల అభివృద్ధికోసం, స్వయంశక్తిమీద ఆధారపడి వారికీ వారి సంసారాలకీ పనికివచ్చే ఒకడబ్బు సంపాదించుకొనుదోవ ఈ ప్రణాళికని మొదలుపెట్టి మా స్వాతంత్రతకు ఒకసమగ్ర స్వరూపం దానికివ్వబడిన ఈ సంతోషసమయం మాకు వాటన్నిటికంటె ఎంతో గొప్పదనిపించింది.

టామస్ మాకు పేయని చల్లార్చిన వెంకాయనీళ్ళు అందించాడు. అరాంగ్ కూడా ఆసమయంలో ఎంతో ఉత్సాహంగా కనుపించాడు. మేనహ్యాల్ సంగతి సరేసరి. అమెరికన్ పతాకగీతం దోనలో పాడుతూ వెళ్ళాడు.

ఈవిధంగా ఆనాటి సమావేశం జయప్రదంగా ముగిసింది. అందరూ వెళ్ళిపోయిన తరువాత నా టైప్ రైటర్ దగ్గర కూర్చొని ఈప్రణాళికనంతనీ ఒకకాగితంమీద టైప్ చేశాను. మొట్ట మొదటదానిని అరాంగ్ కే, తరువాత విన్టన్ కీ చూపించడానికి నిశ్చయించుకొన్నాను.

ఆనాటిరాత్రి నాకు మహోద్భృతంగా 'డింగీ' జ్వరం వచ్చింది. అనుకొన్న కార్యక్రమం అంతా తారుమారై పోయింది. జూలై నాల్గవ తేదీనాటి ఉత్సవాలలో నేను పాల్గొన లేక పోయాను. 104 డిగ్రీల జ్వరంవచ్చింది. తల, కళ్ళు, కీళ్ళు నరాలు ఒకటేపోటు.

విన్టన్ నన్ను చూడడానికివచ్చి ఏవిధమైన ఆలోచనలూ లేకుండా విశ్రాంతి తీసుకొమ్మని సలహా ఇచ్చారు. దీనివల్ల నాలోని ఉత్సాహం మరింత దిగజారిపోయింది. ఈ పరిస్థితిలో నన్నువిడచి, కోడిపందేలకి వెళ్ళడమా అనే సందిగ్ధావస్థలో టామస్ పడ్డాడు. కాని 'మిస్టరీ' — (మాకోడిపుంజు పేరు) తప్పక నెగ్గి తీరుతుందనీ, పందేనికి వెళ్ళితీరవలసిందనీ నేను టామస్ కే నచ్చచెప్పి ఐదునాణేలు పందెములో ఒడ్డడానికి ఇచ్చాను.

టామస్ వెళ్ళిపోగానే నాలో విపరీతమైన బాధ చెల రేగింది. నాశ్రీరము లోపలలో శరీరమంతా ముక్కలైగలు గుచ్చు

తూన్నట్లూ, నరకంలో నానా యాతనలూ పడుతూన్నట్లూ అనిపించింది.—ఈవిధంగా ఎంతసేపు గడచిందో నాకు తెలియదు— ఇంతలో " మిస్టర్. ఫెర్గూసన్, మిస్టర్. ఫెర్గూసన్, మనం గెలిచాం, మనంగెలిచాం, అంటూ టామస్ కోడిపుంజుతోసహా తిరిగివచ్చాడు.

" ఈ కాలనీటిని కోడిపుంజులన్నిటినీ మన 'మిస్టరీ' ఓడించి, ఛాంపియన్ అయింది. అందరూ ఎంతోడబ్బు పోగొట్టు కొన్నారు. మనడబ్బేమీ పోలేదు. ఇదిగో మీరిచ్చిన డబ్బుతీసు కోండి. నాదగ్గర గెలచినడబ్బు ఇంకా చాలావుంది. అన్నాడు టామస్.

నేను లేచి కూర్చొన్నాను. తలలోపల సింహాలు గర్జిస్తున్నట్లుంది. అయినా ఏవో ముళ్ళతీగలతో గుచ్చుతూన్నట్లు వున్నదానికంటె ఈబాధ కొంతనయమే అనిపించింది !

" అయితే పందెం వొడ్డడానికి నీకు డబ్బెక్కడనుంచి వచ్చింది టామస్ ? " అన్నాను.

" మీరు ఇన్నాళ్లుగా నాకిచ్చిన నాణేలనుదాచి, ఈ విధంగా ఉపయోగించాను. ఈ పందాలలో బాగా పోట్లాడి ఏ కోడిపుంజు గెలుస్తుందో నాకు బాగా తెలియడంవల్ల నేను పందెంవేసిన డబ్బంతా గెలుచుకొన్నాను.

" మరి ఈ డబ్బంతా ఏమిచేస్తావ్ టామస్ ? "

" ఆ విషయమే మిమ్మల్ని అడుగుదామని అనుకుంటూ న్నానండి. మీ ఆరోగ్యం సరిగాలేదు. అందుచేత మిమ్మల్ని ఈ వివరాలతో బాధ పెట్టదలచుకోలేదు. " అన్నాడు టామస్.

"మాట్లాడటానికి ఎవరైనా వుంటేనే నాకీబాధ తగ్గుతుంది, టామస్—ఆ విషయమేమిటోచెప్పు" అన్నాను.

"ఈ కాలనీ ప్రధానాధికారితో మాట్లాడి, మా అమ్మకి ఈ డబ్బులో ముప్పైనాణేలు పంపవలసినదిగా కోరండి. మా అమ్మకి కొత్తదుస్తులు వుంటేనేకాని ఇక్కడికి రావడానికి ఇష్టపడదు. ఈడబ్బు ఆమె మనిలాకి రావడానికీ, కొత్తదుస్తులు కొనడానికీ సరిపోతుంది. నాదగ్గర ఐదునాణేలు వుంచుతూన్నాను. ఎందుకంటే వచ్చే 'రైజల్‌డే' నాడు పెద్దకోడిపందెం జరుగబోతూంది. ఈనాడు (Dr Crisolgo) డాక్టర్. క్రిసోల్గోతో కోడిపందేనికి వచ్చిన అతిథిదగ్గర బాగా పోట్లాడే ఒకకోడిపుంజు వుందని విన్నాను. 'రైజల్ దినం'నాడు దానిని తప్పక తీసుకు వస్తానని ఆయన చెప్పాడు. ఆనాడు ఈపుంజు తప్పకగెలిచి తీరుతుంది. ఈ ఐదునాణేలు దానికోసమే వుంచాను." అన్నాడు టామస్.

"టామస్, నీఉద్దేశం భలేబాగుంది— మీ అమ్మ వచ్చినప్పుడుమాత్రం తప్పకుండా ఇక్కడికి ఆమెను తీసుకురావాలి. ఆవిణ్ణి చూడాలని చాలారోజులనుంచి అనుకొంటూన్నాను" అన్నాను. ఈ మాటలు వినగానే టామస్ కళ్ళనుండి నీళ్ళుకారసాగాయి!

## 18 వ ప్రకరణం

గవర్నమెంట్ నావ 5వ తేదీన రోగులతో రేవుకుచేరింది. నేను కేరిటాని కలుసుకోడానికి వెళ్ళలేకపోయాను. ఫాదర్.

మూరెల్లో ఈ విషయం కేరిటాతో చెప్పి, సాధ్యమైనంత త్వరలో తీసుకు వస్తానని చెప్పారు. ఈ నా అస్వస్థతలో టామ్ నాకు పంపిన బహుమతి సంగతికూడా మరచిపోయాను. టామ్ పంపినది ఒక మేలిరకపు రైఫిల్ అని తెలియగానే నా సంతోషానికి అవధిలేకపోయింది. చట్టరీత్యా ఆ దీవులలోనికి ఇలాంటివి తీసుకొనిరావడానికి ఎన్నో ప్రతిబంధకాలున్న వాటి నన్నిటినీ పాటించి, ఒకప్రత్యేక వార్తావహునిద్వారా నాకా రైఫిల్ అందజేయబడింది. క్రిస్మస్ బహుమతిగా తెనకులభించే మొట్టమొదటి గాలి తుపాకీకి కుర్రాణ్ణి పట్టరాని సంతోషమెక్కడ నా ఆనందానికి డాక్టర్. మార్షల్ నన్ను చూడడానికి వచ్చే సరికి మంచంమీద కూర్చొని ఆ రైఫిల్‌తో ఆడుకొంటూ న్నాను. వస్తూనే "చాలా బాగుందే రైఫిల్" 'తమరో' మృగాన్నికూడ కొట్టనగు. అంతపెద్దది" అన్నాడు ఆయన "అట్లా! ఒకే ఒకతూరనైన ప్రయత్నించాలని ఆశిస్తాను," అంటిని. అన్నారాయన. ఆ తరువాత యూరప్‌లో చెలరేగు తూన్న యుద్ధాన్నిగురించి ప్రెసిడెంట్ విల్సన్ తాటస్థ్యవిధా నాన్ని గురించీ మేము మాట్లాడుకున్నాం.

"ఇప్పుడు ఒక మేలిరకపు చాల్మూగ్రా చికిత్సావిధానం అమలులోనికివచ్చినదనీ, అవిధానం ద్వారా నేను త్వరలోనేమా మూలుమనిషిని కానున్నాననీ డాక్టర్ మార్షల్ వెళ్ళిపోయేముందు నాతో అన్నారు. నేనాక్షణం ఆయననుపూర్తిగా నమ్మాను. వెంటనే పూర్వస్థితికి తిరుగబడ్డాను. ఈ చికిత్సావిధానంద్వారా అనేకమందికి రోగం నయంకావడం నేను ప్రత్యక్షంగాచూచాను. నాలో అంతగుణం కనుపించకపోయినా వచ్చినప్పటికంటె ఏమంత

క్షీణించలేదు నాపరిస్థితి. అయిన ఈచికిత్స నాలో రోగం వృద్ధి పొందకుండా నిరోధించివుండాలి.

పదిరోజులతరువాత రోగులను తీసుకువచ్చినఓడ వెళ్ళి పోయింది. కేరిటా ప్రస్తుతం రోగులకి ప్రత్యేకింపబడిన ఒక భవనంలో వున్నదనీ, ఆమె ఉత్సాహంగానే కనపడుతున్నదనీ, నాఆరోగ్యం ఎలావున్నదీ ఆదుర్దాగా అడిగినదనీ ఫాదర్ మార్సెల్లో చెప్పారు.

ఈపరిస్థితులలో ఆమెను ఇక్కడకు ఆహ్వానించడం మంచి దేనా" అని ఫాదర్‌ని అడిగాను. కేరిటా రావడంవల్ల నాకు మరింత ఉత్సాహంగా వుంటుందనీ, నాఆహ్వానాన్ని కేరిటాకు అందచేస్తాననీ చెప్పి ఫాదర్ మార్సెల్లో వెళ్ళిపోయారు. గడచిన మూడు సంవత్సరాలలో ఇదియే నామొదటి విందివ్వడం ఇదే మొదటిసారి. ఆనాడు మామూలుకంటె చాలాత్వరగా నిద్ర లేచి, టామస్‌నికూడా నిద్రలేపాను. వచ్చే అతిథికోసం (Hightea) హైటీ, ఫలహారాలు తయారుచేయడానికి టామస్ నేనూ సన్నాహాలు ప్రారంభించాం. మేమిద్దరం బాగా వంట చేయగలవాళ్ళమైనా ఆనాడు (Iced Cake) మంచుచిలికిన కేక్స్, సరిగా రాక మాప్రాణము తీశాయి. మధ్యాహ్నమయే సరికి ఒక్క కేకుకూడా సరిగా రాలేదు సరికదా, మేమిద్దరం పూర్తిగా అలసిపోయాం. ఆఖరికి టామస్ వెర్రిమొహంవేసి "ఏమండీ, ఆవొచ్చేవాళ్ళెవరో చాలా పెద్దవాళ్ళై వుండాలి-గవర్నర్ జనరల్‌గారు కాదుకదా, మీరే స్వయంగా వంటకి పూను కున్నారు!" అన్నాడు టామస్.

టామస్ నోటినుంచి అప్రయత్నంగా వచ్చిన ఈమాట లతో కేక్సు చెడిపోయినందుకు టామస్ ఎంతబాధపడుతున్నాడో నాకర్థమైంది - దానిలో సందేహమేమీలేదు.

“మరేమీఫరవాలేదు టామస్. గవర్నర్ జనరల్ కాదు ఎవరూకాదు. నాస్నేహితురాలు చూడడానికివస్తుంది. అందుచేత ఈ నాణేలు తీసుకొనివెళ్ళి బజారులో దొరికేవాటిలో చక్కని కేక్సు తీసుకురా.— పంచదారవిసురూ (With icing all over) మరచిపోకు బాగా మంచుచిలికివుండాలి.”

“తీసుకువస్తానండీ - మంచివి తీసుకువస్తాను. ఆవిడ బాగా మెచ్చుకొనేరకం తీసుకువస్తాను. బజారులో అమ్మే కేక్సు చాలా బాగుంటాయి!” అంటూ టామస్ కేక్సు కొనడానికి వెళ్ళాడు.

సాయంత్రం ఐదుగంటలకి మాయింటికివచ్చే అందాల అతిథిని ఆహ్వానించడానికి నేను సిద్ధంకాకుండానే ఫాదర్ మార్సెల్లో కేరిటాతో మాయింటి ఆవరణలో ప్రవేశించారు. నేను మాలాస్కా కుటుంబంతో వుండేటప్పుడు కేరిటా పదహారేళ్ళపిల్ల. పుష్టిగా చురుకుగా, కొంచెం సిగ్గుతో నాదగ్గర ఇంగ్లిష్‌పాఠం నేర్చుకొనేది. పదమూడేళ్ళు గడచినతరువాత, ఈనాడు, నాజూగ్గా, పొడుగ్గా, ఎంతో అందంగా, ఒక వింతదీప్తితో తల్లి శుద్ధస్పానిష్ రక్తంగలది యగుటచే పురాతనపు గజదంతపు రంగుతో అందమైన నిబిడశరీరపుష్టి కాంతితో, రోగలక్షణా లేమీ కనపడకుండా కేరిటా మాయింటికివచ్చింది. నల్లగా మిస

మిసలాడే కురులు ఉంగరాలుతిరిగి మెడమీద పడుతుండగా కేరిటా దేవకన్యలావుంది.

ఆమెను చూడగానే హఠాత్తుగా నాలోకలిగిన తీయని బాధనుంచి తేరుకోనడం కష్టమేఅయింది. నా షైు, మెడ కట్టుబట్ట (Tie) సరిగావుందోలేదోకూడా చూసుకోడానికికూడా అవకాశంలేకపోయింది. ఫాదర్ మారెల్లోతో ఒకటిరెండు ముక్కలేవో హడావిడిగా మాట్లాడాను. ఇంతలో కేరిటా అందమైన తన చిన్నచేతుల్ని నావైపుచాపింది.... నాశరీరం గగుర్పొడిచింది – సాధారణంగా నేనెవ్వరితోనూ కరచాలనం చేయను.

"నీవు ఇక్కడ వుండవలసివచ్చినందుకు నాకు చాలా విచారంగావుంది నెడ్;—అయినా ఇన్నాళ్ళకు నిన్ను చూడగలిగి నందుకు నాకు చాలా సంతోషంగావుంది." అన్నది కేరిటా.

విద్యావంతురాలైన ఫిలిప్పైన్ యువతిలోవుండే సహజ మైన ఘనత ఆమెలో గమనించాను. నా సమాధానం మరింత అధ్వాన్నంగావుంది !

"నీవిషయం, సాంచో విషయం తెలిసినప్పుడు నేనునమ్మ లేకపోయాను కేరిటా." అన్నాను.

"పాపం—సాంచో వెళ్ళిపోవడమే మంచిదయింది !" అన్నది కేరిటా విచారంగా.

ఇద్దరం క్షణకాలం నిశ్శబ్దంగా వుండిపోయాం. ఆ తరు వాత కేరిటా తేరుకొని చిరునవ్వు నవ్వసాగింది.

" మీ ఇంటినిగురించీ, అందమైన మీ తోటని గురించి పాదర్ మార్చెల్లో నాతో చెప్పారు. ఆయన చెప్పడమేమిటీ, నేను కలసికున్న ప్రతి ఒక్కరూ మీతోటనిగురించి చెప్పే వారే!"

" నీ అభివందనలకి ధన్యవాదాలు కేరిటా ఒక్కపర్యాయం నాలుగుమూలలా తిరిగివద్దాం. ఇక్కడ ఇక్కడ అన్నిటిలో ఆ మామిడిచెట్లకింద కూర్చుంటే చాలా హాయిగా వుంటుంది."

మేము మామిడిచెట్లక్రింద కూర్చొన్నపిదప, మార్చెల్లో ఫాదరివారు కనురెప్పవేయుచు, 'నెడ్! ఆమె ఇంత అందకత్తె అని నాతో ఎన్నడైనా చెప్పనేలేదే!" అన్నారు. దానికి కేరిటా ఆక్షేపించింది. "గురువుగారూ! చర్చిచేరిన పాదిరివారు అతిశయోక్తితో పలుకుట ఇతరులకు మంచిమాదిరి జూపడం కాదని తలచెదను," అని తనపెద్దకండ్లనువిప్పి ఎంతసుందరములవి! "నేను చెప్పినదినిజమే," అన్నాను నేను. "అప్పుడది ఒక మంచిపిల్లయే కాని సౌందర్యవతికాదు, పాదరివారు చెప్పిన విషయమో, సౌందర్యము ఎక్కడకనబడినా సౌందర్యమే. ఆ విషయంలో పాదరివారి అభిప్రాయమే నాదియును." ఫాదర్ వారితో తాను హాస్పిటల్‌కి వెళ్ళవలసివున్నదనీ, కేరిటాకి దారితెలియదుకనుక నన్ను దిగబెట్టవలసినదనీ చెప్పివెళ్ళిపోయారు. తప్పక ఆలాగే హాస్పటల్ వరకు నాగారానికి దిగబెడతానని మాట యిచ్చాను. ఆయన వెళ్ళిపోయేముందు 'చేపలసరఫరా'

విషయం తాను కేరిటాతో చెప్పలేదనీ, ఆవిషయం సావకాశంగా ఆమెతో చెప్పవలసినదనీ ఫాదర్ మార్కెల్లో అన్నారు.

ఇంతలో టామస్ చెట్లకొంబల్లమీద నీలికప్పల్ని వరుసగా సర్దుతున్నాడు. కేరిటా నావైపుతిరిగి 'చేపలసర ఫరా విషయం అన్నారు – ఏమిటది? " అని అడిగింది.

మాప్రయత్నమంతా ఆమెతో చెప్పి, నాకు డింగీ జ్వరం రావడంవల్ల మధ్యలో అది ఆగిపోవడాన్ని గురించి చెప్పాను.

"ప్రజావసరానికి పనికివచ్చే ఈప్రణాళికని చేపట్టడం నిజంగా గొప్పదే.— ప్రజలకి తృప్తికివస్తుందనే ఉద్దేశ్యంతోనే నేను సేబూలో పిల్లలకి నృత్యంనేర్పడం ప్రారంభించాను.— సేబూకి వెళ్ళిన మొట్టమొదటి రోజులలో రోజులు గడపడం చాలా కష్ట మనిపించింది. అన్నంకూడా తినేదాన్నికాను. నెలలతరబడి మంచంపట్టాను. ఆత్మహత్య చేసుకోందామనికూడా ప్రయ త్నించాను. కాని అక్కడ చర్చికిసంబంధించిన ఒక సిస్టర్ నన్ను చేరదీసింది, ఆమెసహాయంతోనే ఆడపిల్లలతో కలసిమెలసి పనిచేయడం నేర్చుకొన్నాను.— నాకులేనిధైర్యం ఆపిల్లలలో వుంది.

ఇంతలో టామస్ టీ తీసుకువచ్చాడు. కేరిటా టామ స్ని ఆప్యాయంగా దగ్గరికిపిలచి, "టామస్, నీదగ్గర చక్కని కోడిపుంజువుందని విన్నాను. నాకు దానిని తప్పక చూపిం చాలి. జులై నాల్గవతేదీన దానిద్వారా నీవు చాలాడబ్బు సంపాదించావని విన్నాను. 'రైజల్ డే' నాడు నీవు మరింత భాగ్యవంతుడివై పోతున్నావన్నమాట!"

టామస్ పళ్ళికిలించి నవ్వుతూ "మీరు చెప్పినది నిజమేనండి అమ్మగారూ! మిస్టర్ ఫెర్గూసన్, మీరూ టేసీరు తాగినతరువాత నా కోడిపుంజుని చూడడానికి తప్పకరావాలండి. మీరు చూడడానికివస్తే అంతకన్నానాండి. ఆకోడిపుంజుని నాకు మిస్టర్ ఫెర్గూసన్ ఇచ్చారండి. ఆయనకి నేనంటే ఎంతో అభిమానం. ఆమాటలకి అడ్డంవచ్చి "నీ కోడిపుంజు మిస్టరీని చూడడానికి మేమిద్దరం వస్తాంలే!" అన్నాను.

టామస్ తీసుకువచ్చిన మంచుచిలికిన కేక్సు, టీ ముగించుకొని కోడిపుంజుని చూడడానికి కేరిటాతో నేనూవెళ్ళాను. కోడిపుంజుల పరీక్షలో కేరిటా అనుభవం అద్వితీయం! రైజల్ డే నాడు ఈపుంజు తప్పక గెలుస్తుందని కేరిటా జోస్యంచెప్పింది.

కేరిటాతో సముద్రపుటొడ్డున నడచివెళుతూండగా నేను ఒక్కసారిగా ఆరోగ్యవంతుణ్ణయినట్లుగా అనిపించింది!— సముద్రపుటొడ్డున ఓడల్నిగురించీ, కోళ్ళనిగురించీ, కుష్టురోగుల కాలనీలనుగురించీ, లూజాన్‌లో మేము గడపినరోజులగురించీ, కేరిటా తల్లిదండ్రులగురించీ, అనేకవిషయాలు మాట్లాడుకున్నాం.

క్రమంగా సూర్యుడు అస్తమిస్తుండగా నీడలు పొడవుకాసాగాయి, ఆడుతూపాడుతూ, మనసారా నవ్వుతూ ఎంతసేపు గడిపేమో! పునర్జన్మ కలిగినట్లనిపించింది!!

కేరిటాలేచి 'ఇక నేనువెళ్ళిపోవాలి. నాకోసం ఇంటిల్లపాదీ కనిపెట్టుకొనివుంటారు. ఇన్నిగంటలూ నిమిషాలల్లా గడచిపోయాయి. ఇక్కడికే నాకడుపు నిండుగావుంది. ఇంటికివెళ్ళి

ఏదోతింటానని కాదుకానీ, నాకోసం పదార్థాలన్నీ వేడిగా మూతపెట్టి, కనిపెట్టుకొని వుండాలని పాపం!" అన్నది.

తక్షణంలేచి మేము ఇళ్ళకి బయలుదేరాం. సంవత్సరాలుగాలేని నూతనోత్సాహం నాలో ఆనాడు కనుపించింది.

## 19 వ ప్రకరణము

ఈదీవికివచ్చాక నేను ఇంతవరకూ ఏస్త్రీతోనూ సంబంధం పెట్టుకోలేదు. కాని ఏపార్టీకివెళ్ళినా, ఏవిందుకివెళ్ళినా కేరెటా, నేనూ కలసివెళ్ళవలసిందే! క్రమంగా కేరెటా మా యింటికి రాసాగింది. ఒక్కొక్కప్పుడు టీలేకాక, రాత్రి భోజనానికికూడా కేరెటా నాతో వుండిపోయేది. కేరెటా నాతో వుండగానే టామస్ మెరిసే తనకళ్ళల్లో వాళ్ళఅమ్మని మాదగ్గరకు తీసుకువచ్చాడు.

కేరెటా తన సహజమైన చాకచక్యంతో టామస్ తల్లిని తన స్వంతమనిషిగా చూడసాగింది. ఆఖరున టామస్‌తల్లి మావద్ద సెలవుతీసుకొని వెళ్ళబోయేముందు విచారంతో క్రుంగిపోయింది. తన కొడుకు టామస్‌కి ఒకదారిచూపినందుకు ఏడుస్తూనే నాకు కృతజ్ఞత తెలిపింది. కేరెటా ఆమెను సముద్రపు టొడ్డుకి తీసుకువెళ్ళింది. అక్కడ వారిద్దరూ చాలాసేపు మాట్లాడుకొన్నారు. చివరకి టామస్‌తల్లి తృప్తిగా మావద్ద నుంచి వెళ్ళిపోయింది.

"ఆమె పిల్లలలో కనీసం ఒకనికైనా పని చూపినందుకు నిన్ను ఆమె ఏంతగానో పొగడింది. టామస్‌కి నీవు కేవలం భగ

వంతుడివే నెడ్—ఆమె నిజంగా నీ ఔదార్యానికి ఎంత సంతో షించిందో!"

"ఆ, నేను చేసినదేముంది. టామస్ తన స్వశక్తివల్ల సంపాదించుకొంటూన్నాడు. టామస్ చేసినదానికి మించి నేనిచ్చినవేమీలేదు!" అన్నాను కేరిటాతో.

"కేరిటా! నా దగ్గరకొన్ని కొత్తరికార్డులున్నాయి. మనిద్దరం నృత్యం చేద్దాంరా." సాధారణంగా సాయంత్రపువేళ మేమిద్దరం కలసి ఎంతోసేపు నృత్యంచేసేవాళ్ళం అంతేకాక కేరిటా చేస్తున్న పనినిగురించీ, మా వ్యాపారంగురించీ, అక్కడ మనుష్యులను గురించీ గంటల తరబడి మాట్లాడుకొనేవాళ్ళం.

ఆ నాటిరాత్రి మేమిద్దరం సముద్రపుటొడ్డు షికారుకని బయలుదేరాం. పున్నమిచంద్రుడు పాలవెన్నెలను కుమ్మరించుతున్నాడు—ప్రకృతి రామణీయాన్ని ఆస్వాదిస్తూ ఇద్దరం కొంత దూరం నడచి వెళ్ళాం. అప్రయత్నంగా కేరిటావైపు చూచాను. కేరిటా తన గౌనులో దేవకన్యలావుంది. ధైర్యం చిక్కబట్టుకొని ఆమెతో మాట్లాడటానికి ప్రయత్నించాను. ఆమెచేతిని మెల్లగా నా చేతిలోనికి తీసుకున్నాను. ఆమె తనచేతిని వెనుకకి తీసుకొనే ప్రయత్నమేమీ చేయలేదు. ఇంతలో హఠాత్తుగా చెవులు చిల్లులుపడే భయంకరధ్వని గట్టుమీదనుంచి వినపడింది. ఆకూత వెనుక అనేక కంఠాల నుండి ఎవరో ఏడుస్తున్నట్లుకూతలు వినవచ్చాయి; కేరిటా కెవ్వునకేకవేసి, నాచేతులలో వాలిపోయింది. అతిప్రయత్నంమీద కేరిటాను సముదాయించడానికి ప్రయత్నించాను.

"భయమేమీలేదు కేరిటా! శ్మశానంలో కుక్కలరు స్తున్నాయి."

"శ్మశానంలోనా" కేరిటా భయంతో వణకిపోయింది. ఆమెమీదవంగి, ఆమె భయం పోగొట్టడానికి అనేకసార్లు ముద్దు పెట్టుకొన్నాను. ప్రమాదాన్నీ, ఈవింత పరిస్థితినీ, పరిసరాల్నీ మరచిపోయి ఇద్దరం నాటిరాత్రి మాకు తెలియకుండానే గడి పాం. తెలతెలవారుతూండగా కేరిటాని మెల్లగా కొంతదూరం ఇంటివైపు నడిపించుకొని వెళ్ళాను.

"ఇంక నేను వెళ్లిపోతాను నెడ్" అంది కేరిటా.

"ఒంటరిగా వెళ్ళగలవా? నీవంట్లో ఎలావుంది?" అన్నాను.

నేను వెళ్ళగలనులేనెడ్. రోమరో (Romero) ఇంటికి వెళ్ళుతాను. గెటూలియోరోమరో (Getilio Rcmero) నాన్నకు సమానంతర బంధువు. ఎక్కడికి వెళ్ళావని ఇంట్లో ఎవరూ నన్నడగరులే—మరి వెళ్ళివస్తానెడ్—"

రెండువారాలు గడచింది—కేరిటా నాకు కనపడలేదు... ఆమెను చూడాలని కళ్ళు కాయలు కాచిపోతున్నాయి. కేరిటా మామ గెటూలియో ప్లాజా వీధిలో కనుపించగా కేరిటా విష యం అడిగాను.

"కేరిటా వంట్లో బాగాలేదు." అన్నాడు. ఇంటికి వెళ్ళి కేరిటా విషయమే ఆలోచిస్తూ కూర్చొన్నాను. కేరిటాకి నిజంగా వంట్లో బాగాలేదా. లేకపోతే నన్ను తప్పించుకోవా

లని ప్రయత్నిస్తూందా? బహుశా కేరిటాకి పాప పుట్ట బోవటం లేదుకదా!"

"కేరిటానువిడచి నేను వుండలేను. కేరిటా నన్నెంతో ప్రేమించింది. మేమిద్దరం ఎందుకు పెళ్ళిచేసుకోకూడదు? పట్ట రాని సంతోషం నన్నునింపివేసింది— నన్నన్నాళ్ళుగా ఆవహిం చిన దురదృష్టాన్ని ఆఖరికి ఓడించాను! నా జీవితం ఇకసుఖంతో నిండివుంటుంది. కాని, మాకు పిల్లవాడు పుడితేనో? ఆ కుర్రవాడుకూడా కుష్టురోగి అవుతాడేమో!

ఈ కాలనీలో ప్రతిసంవత్సరం ఒకపందమంది పిల్లలు పుడతారనీ, పుట్టినప్పుడు ఆ పిల్లలు ఆరోగ్యంగానే వుంటారనీ, వాస్తవంగా కుష్టురోగం సాంక్రామికరోగంకాదనీ, కాని ఆ పిల్ల లని తల్లిదండ్రుల దగ్గరనే వుంచుతే సులభంగా వారివ్యాధి పిల్ల లకు సోకుతూందనీ, అందుచేతనే ఆ పిల్లల్ని తల్లిదండ్రుల దగ్గర నుంచి దూరంగా తీసుకొనిపోయి అక్కడ పెంచుతారనీ, తల్లి తండ్రులవ్యాధి తగ్గుతే ఈ పిల్లల్ని చూడడానికి వారికి వుంటుం దని, లేక ఆ పిల్లలకే వ్యాధి సోకితే తల్లిదండ్రులతోనే వుంచే అవకాశంవుందనీ, డాక్టర్ విన్టన్ నాతో చెప్పిన విషయం నాకు జ్ఞాపకంవచ్చింది. ఈ ఆలోచనతో నేను నర్సరీకి వెళ్ళాను. నర్స రీలో తెల్లనిదుస్తులతో ఒకసిస్టర్ చిన్నపాపని తనచేతులలో పెట్టు కొని బయటికి వస్తూంది. ఇంతలో "ఆ—హా!" అంటూ చాలా చిన్నవయస్సులోవున్న ఒక స్త్రీ అటువైపు వచ్చింది. ఆ సిస్టర్ చేతిలోవున్న పాప తల్లి ఆమె! సిస్టర్ ఆ పాపచేతిని ఆడిస్తూండగా పాప కిలకిల నవ్వింది—తన ఆనందంపట్టలేక తల్లి

కూడా నవ్వింది—మరుక్షణంలో సిస్టర్ లోపలికి వెళ్లిపోయింది. ఆతల్లి దుఃఖం పట్టలేక కుప్పకూలిపోయి వెక్కి-వెక్కి ఏడ్వ సాగింది. ఈ దృశ్యం నన్ను కదల్చివేసింది. నాలో ఏదోవింత భయం కలచివేస్తున్నది. కేరిటా గతికూడా ఇంతే కాబోతూ న్నదా ? ఒకానొకప్పుడు నేను ప్రేమించిన జేన్‌ని మరచిపోవలసి నప్పుడు కాని, నాకు కుష్ఠురోగం సోకిందని డాక్టర్ చెప్పినప్పుడు కాని నేనింత బాధపడలేదు — ఈ ప్రపంచంలో కుష్ఠువాడు కాబోయే పిల్లవాడు నాద్వారా ఎన్నటికీ పుట్టకూడదనే నిశ్చ యానికి వచ్చాను.

ఐదారు రోజులవరకూ నేను ఇంటిలోనే వుండిపోయాను. రాత్రింబవళ్లు విపరీతంగా త్రాగసాగాను. టామస్ ఇదంతా చూస్తూ నిస్సహాయంగా వుండిపోయాడు. నాతో మాట్లాడ డానికి ప్రయత్నించాడు. కాని లాభంలేకపోయింది. ఆవుదృ తంలో ఒకటి రెండుపర్యాయాలు టామస్‌మీద చేయికూడా చేసుకొన్నాను ! ఇంతలో కేరిటావచ్చింది.

మాసినగడ్డంతో, అసహ్యంగా, చేతిలో విస్కీ-సీసాతో నేను మామిడిచెట్లక్రింద వుండటం కేరిటా చూసింది. తూలుతూ ఆమెవైపు నడచివెళ్ళాను. కేరిటా నాబుజంమీద చేతులు వేసింది ప్రేమతో.

"కేరిటా నాతోచెప్పుమరి. నీకు పాపవుట్టబోతున్నాడా!"

"అయ్యో వెర్రివాడా! అందుకా ఈహడావిడంతా. అంతావొట్టిది. అలాంటిదేమీకాదు. నిజంగా నావొంట్లో బాగాలేదు, 'అందుకనే ఇన్నాళ్లూ రాలేకపోయాను. ఇలారా,

కూర్చొని మాట్లాడుకొందాం" అన్నది కేరిటా. నేను బల్ల మీద తలఆన్చుకొని వెక్కివెక్కి ఏడ్వసాగాను. కేరిటాకూడా విచారంతో కూర్చొని, నాఏడుపు తగ్గగానే నాతో మాట్లాడింది.

"ఇది క్రిస్ట్‌మస్ పండుగరోజులన్న సంగతి మరచి పోయావా నెడ్?"

"అవును క్రీస్ట్‌మస్, క్రీస్ట్‌మస్."

"అవును నెడ్ – రాత్రిభోజనానికి నీతో వుండమంటావా? వద్దా!"

"నిజంగా వుంటావా కేరిటా?"

గడ్డంచేసుకొని, స్నానంచేసి రావడానికి నేను ఇంటిలోపలికి వెళ్లాను.

తిరిగి కేరిటా నాదగ్గరికి తిరిగివచ్చేలోపున పూలమొక్కల దగ్గరకివెళ్లి అనుకోకుండానే వాటికొమ్మలు ఒకగుత్తిగాచేర్చి కేరిటాకి క్రిస్ట్‌మస్ బహుమతిగా ఇచ్చి, "కేరిటా, ఈ సమయంలో ఇంతకంటె మంచి బహుమతి ఇవ్వలేకపోయినందుకు విచారిస్తూన్నాను." అన్నాను.

ప్రాణంపదంగా పెంచుకొంటూన్న పచ్చపచ్చని మొక్కల నుండి సేకరించి కట్టిన ఈగుత్తి కంటె మంచిబహుమతి వేరే ఏమి వుంటుంది? ఈ ఆకులెంత పచ్చగావున్నాయో ఈ బహుమతి కూడా నాకు అంత మరపురానిదిగా వుంటుంది. అంతకంటే ఏమి కావాలి?" అన్నది కేరిటా.

ఒకగంట తరువాత టామస్ మా ఇద్దరికీ ఫలహారం తీసుకువచ్చాడు. కేరిటా తననల్లనిగౌనులో దివ్యసుందర విగ్రహంలావుంది.

తలవనితలంపుగా, "మరి—మరి నువ్వు నన్ను పెళ్ళాడుతావుకదూ కేరిటా?" అని అడిగాను.

కేరిటా నిట్టూర్చి "లేదు, నెడ్!" అన్నది.

"మరి నన్ను నీవు ప్రేమిస్తూన్నదెందుకు?" అన్నాను.

"దానికి సరియైన సమాధానం ఈనాటిరాత్రి నీవే ఇచ్చావు నెడ్!"

"చాలా తెలివితక్కువగా మాట్లాడాను కేరిటా! తిరిగి ఈ పొరపాటెప్పుడూ చేయను. నామాటనమ్ము—కొడుకనే వాడెప్పుడూ నాద్వారా నీకు పుట్టబోడన్నసంగతి జ్ఞాపకం వుంచుకో!"

అవును నెడ్—నేనునిన్ను పెళ్ళిచేసుకోకపోవడానికి కారణం అదే—అది నా మతానికి విరుద్ధం."

"మతం కష్టసుఖాలన్నీ కని ప్రపంచంలో విడిచిపెట్టమని చెప్పదుకదూ?

"ఈ విషయంలో ప్రశ్నించే అర్హత నాకులేదు."

"నేను నిన్ను వాంఛిస్తున్నాను కేరిటా—సంఘానికి వెలియైన మనజీవితా లీవిధంగా శూన్యంగా గడచిపోవలసిందేనా?"

"నెడ్, వాస్తవాన్ని గ్రహించడానికి ప్రయత్నించు. నేను నిన్ను పెళ్ళాడి; పిల్లల్ని కనకుండా జాగ్రత్తపడటం కూడని

పని. అది నామతానికీ, భగవంతునిమీద నాకుండే నమ్మకానికీ విరుద్ధం. జీవితమంతా మిధ్యఅని నీ వంటావు, కాని భగవంతుడు మిథ్యకాదు.—భగవంతుడు తథ్యమే మన జీవితాలలోనే భగవంతు డొకభాగం. ”

నేను కేరిటావైపు తదేకధ్యానంగా చూచాను. ఆ వెన్నెలలో కేరిటా దైవాంశసంభూతురాలుగా కనుపించింది. జీవిత సుఖాల్ని త్యాగంచేయగల మహత్తరశక్తి ఆమెలో నాకు గోచరించింది. ఆమె ప్రశ్నకి సమాధానమేమీ నాకు దొరకలేదు. ఆమె జీవితవిధానమే వేరు. చర్చిలో అప్పుడే గంటలు చల్లగా మోగుతున్నాయి.

“ అర్ధరాత్రి ప్రార్ధనలకి ఇక అరగంటే వ్యవధివుంది, నెడ్; క్రిస్టమస్ ప్రార్థనలు ప్రారంభం కాబోతూన్నాయి. నాతో చర్చికి వస్తావా ?” అని అడిగింది కేరిటా.

ఇద్దరం బాటవెంబడి మెల్లగా చర్చివైపు బయలుదేరాం. చెట్లనీడలుదాటి వెన్నెలలో కేరిటా, శరీరం పాలిపోయి వెలవెలబోతూన్నట్లుంది. కేరిటా వంట్లో బాగాలేదన్నసంగతి అప్పుడు నాకు జ్ఞాపకం వచ్చింది. మెల్లగా ఆమె చేతిని నాచేతితో పట్టుకొని ముందుకు నడిపించుకొని వెళ్లాను.

రాతిగోడలు, రాతినేల—ఈ చర్చి మూడునందల సంవత్సరాలక్రితం నిర్మింపబడింది ! చర్చిలోపల ప్రతిఅంగుళం భక్తులతో క్రిక్కిరిసిపోయింది. ఫాదర్ మార్సెల్లో దైవపీఠందగ్గర నిలువబడివున్నారు. ఆయన ఒక్కరే ఆరోగ్యవంతుడు, అక్కడ తక్కిన వారందరూ కుష్ఠురోగులే !

కొద్ది నిమిషాలతరువాత నన్ను అక్కడే వుండమనిచెప్పి తాను జనంమధ్యగావున్న దారిగుండా దైవపీఠందగ్గరకువెళ్లి, మొక్కి తిరిగివచ్చింది. వందలకొలది భక్తులు అదేవిధంగా చేయడం నేను గమనించాను. తెలతెలవారే సమయంలో కేరిటా, నేనూ చర్చిబయటికివచ్చి, మెట్లుదిగి, కేరిటా వుంటూన్న ఇంటివైపు నడచివెళ్ళాం.

నేను నిశ్శబ్దంగా కేరిటాతో నడువసాగాను. కేరిటా పైన చర్చిప్రభావం ఎంత బలంగావున్నదీ అప్పుడు నేను గ్రహించాను. అందుచేతనే నన్ను కేరిటా ఎంతగా ప్రేమిస్తూన్నా వివాహం విషయంలో తన అభిప్రాయాన్ని మార్చుకొనలేకపోయింది. కాని దానివలన ఆమెపైన నాకుండే గౌరవం కొంచెంకూడా తగ్గలేదు.— కేరిటాకీ నాకూ వివాహం జరగడం అసంభవం. కాని ఈ విషయంలో నాకామెపైన ద్వేషం లేదు. తడబడుతూనే ఈ విషయం కేరిటాతో చెప్పగలిగాను.

"నీ ఆదరానికి నేనెంతో కృతజ్ఞురాలిని, నెడ్; నాహృదయం ఎంతో బరువుగావుంది. కాని ప్రశాంతంగావుంది—మనకి పుట్టబోవని కొడుకు ఈరాత్రి మనకి ఎన్నోవిధాల నమస్కరిస్తాడు!"

ఇంతలో కేరిటా వుంటూన్న ఇంటిదగ్గరికివచ్చి ఆగాము.

"అయితే ఇటుపైని మనం ఏవిధంగా నడచుకోవాలి?"

"కొద్దిరోజులవరకూ మనం నలుగురిలో మాత్రమే కలసికొంటే మంచిదని తోస్తూంది నెడ్. ఇంతలో మనగాయాలు

మానిపోగానే, స్నేతులుగా వుండటానికి ప్రయత్నిద్దాం; నిన్ను పూర్తిగా పోగొట్టుకొనడం నాకిష్టంలేదు నెక్!"

"నా ఉద్దేశ్యంకూడా అదే కేరిటా!"

కేరిటా తనముఖాన్ని నావైపు తిప్పింది. నేనామెను ముద్దుపెట్టుకొన్నాను.

ఇదివరకెన్నడూ పొందని ఒంటరితనంతో, జీవితమంతా ఒంటరిగానే గడపవలసివుంటుందనే విషయం తెలుసుకొని ఖిన్న హృదయంతో ఇంటికి చేరుకొన్నాను.

## 20 వ ప్రకరణం

1917 వ సంవత్సరంనాటికి మా చేపల సరఫరా మంచి అభివృద్ధిలోవుంది—దీనికి ఒకసహకార సంస్థని స్థాపించాము. దీనిలో ప్రతిఒక్కరికీ జీతం ముట్టుతూంది. మొదటనెలకి పది నాణేలు, ఆ తరువాత ఇరవై నాణేలకీ ఈ జీతం పెరిగింది. ఈజీతాలకి సరిపోగా మిగిలిన లాభంలోకూడా వంతువచ్చేది. పెట్టుబడిలో చాలాభాగం, పడవలు, వలలు మొదలైనవాటికి వినియోగించాము. ఈలాభాల పంపకంకాగా మిగిలినది నాటికి నలభై వంతులు నా భాగానికివచ్చింది. నేను జీతం తీసికొనక పోవడంవల్ల మేనేజరుగా నాకిది ముట్టేది లాభాలలో మిగిలిన అరవై వంతులూ పనివారలకి ఆ నెలలలో వారువారు పనిచేసిన గంటలనిబట్టి డబ్బుముట్టేది కొందరు డాక్టర్లసలహా ననుసరించి తక్కువగంటలు పనిచేసేవారు 'ఈవిధంగా తక్కువగంటలు పని

చేసే నెలవారీ జీతాలవారు, తాము విశ్రాంతి తీసుకొనే గంట లలో తమ బదులు ఇంకొకరు పనిచేయడానికి, బాధ్యతవహించి ఆవిధంగా ఒప్పందంచేసుకొనేవారు. ఈ విధంగా సంవత్సరాలు గడచినకొలదీ నావంతు అధికలాభాలను మొదట నూటికి ముప్పై వంతులకీ, తరువాత ఇరవై వంతులకీ తగ్గించుకొన్నాను. డబ్బు సంపాదించడం నాకు గొప్పగావున్నా. దాని అవసరం అంతగా నాకు వుండేదికాదు. నేనువుండే స్థలానికీ, తిండికీ నాకువచ్చే పెన్షన్‌డబ్బే సరిపోవడంవల్ల ఈ విధంగావచ్చిన లాభాలలో నా వాటాసొమ్మును రిజర్వునిధిగా కేటాయించి వుంచాను.

పడవల నిర్మాణంలో ఏదో తాను సాయంచేసేవాడినని చెప్పిన జోస్‌క్రుజ్ (Jose Cruj) మాకంపెనీకి ఎంతో సహాయ కారి అయ్యాడు. మాకు వచ్చిన మొదటిపడవమాత్రం మనిలా నుంచివచ్చింది. ఆతరువాత మాకు కావలసిన పడవలన్నీ జోస్ పర్యవేక్షణక్రింద తయారైనవే ఒక పెద్ద మోటారునావనీ, ఎన్నో చిన్ననావలనీ, వలలను మోకులనూ మోసుకువెళ్లే పడవ లనూ మేమే నిర్మించుకున్నాం. గడలతో నిర్మింపబడిన ఆవర ణలలోనికి చేపలువచ్చేటట్లుచేసి, వలలతో సులువుగా చేపలు పట్టి పడవలలోనింపేవాళ్ళం - ఈ చేపలసరఫరాలో పనిచేసే మనుష్యులందరినీ నేను బాగా ఎరుగుదును. వారితో టాగ లాంగ్ (Tagalog) (Visayan) విసాయన్ భాషలలో మాట్లా డడంకూడా నేర్చుకున్నాను. వీరిలో చిన్నవారుమాత్రం ఇంగ్లీషుభాష నేర్చుకొనడంచేత అంత ఇబ్బంది లేకపోయేది. అమెరికా పరిపాలనక్రింద వచ్చాక పాఠశాలలలో ఇంగ్లీష్‌భాష నేర్పడంవల్ల ఈయువకులకి ఇంగ్లీష్ అలవాటైంది.

ఈవ్యాపారం మొదలుపెట్టడంవల్ల, నేను ఆత్మహత్య గాని, వెర్రివాణ్ణవడంనుంచిగాని, పూర్తిగా చెడిపోవడంనుంచి గానీ – రక్షింపబడ్డానని చెప్పడంలో అతిశయోక్తి ఏమీలేదు. ఈవిషయం డాక్టర్ విస్టన్‌కి తెలుసు. ఈవిషయం నాలాగే వున్న తక్కినవారి విషయంలోకూడా యథార్థమే. ఈవిధంగా పూర్తిగాకాని, రోజులలో కొంతిభాగంకాని పనిచేసేవారు మా కంపెనీలో దాదాపు ఏభై మందిదాకా వున్నారు. వీరు సంపాదించేడబ్బువల్ల వీరి భార్యలూ, పిల్లలూ, వీరిమీద ఆధారపడే ఇతరులూ లాభం పొందుతున్నారు. కాలనీకి బయటవున్నా ముగ్గురు పెండ్లికానివారు తమ కాపురానికి ఇంటిపని వంటపని ఇస్త్రీపని అనుదినం జరగడానికి ఒకవ్యక్తికిని అతని భార్యకిని వృత్తికలిగించిరి. ఒక పెద్దతటాకములో ఒక చిన్నకప్ప వంటి దైనను తన చురుకుతనముచేత అలలులేపించే కప్పఅది.

ఈసమయంలోనే మేము మొట్టమొదటిసారిగా మాలో ముప్పైమందికి 'పెరోల్' (Parole) లభించింది. (Parole) పెరోలనగా షరత్తులుతో లేక స్టినగడువులోగా తిరిగి రావడానికి మాటయిచ్చి బయటికివెళ్ళడం. డాక్టర్ వీరివ్యాధి నిరోధింపబడిందని ప్రకటించారు. సంఘానికి వారివల్ల ప్రమాదమేమీ లేదనీ, వైద్యపరీక్షలో 'నెగెటివ్' ఫలితం తెలిందనీ అన్నారు. ఈవిధంగా వారివ్యాధి తగ్గడంలో ఆశ్చర్యంమేమీ లేదనీ, ఇతరవ్యాధులవలె నీ కుష్ఠురోగంకూడా తనంతటతానే అదృశ్యంకావడం కద్దనీ డాక్టర్ విస్టన్ అన్నారు. ఈసంఘటన డాక్టర్ల దృక్పథంలో ఆశ్చర్యాన్ని కలిగించేదికాకపోయినా రోగు

లలో మాత్రం సంచలనం కలిగించింది. అందుచేత ఈ కాలనీకి పంపబడినవారు యావజ్జీవం గడపాలనే అపోహ ప్రజలలో క్రమంగా తొలగి, తిరిగి ఇళ్ళకి వెళ్ళే అవకాశం వున్నదనే ఆశా రేఖ గోచరించింది. ఈ ముప్ఫైమందికీ ఘనంగా వీడ్కోలు ఇవ్వబడింది.

వీరిని తీసుకువెళ్ళి, తిరిగివచ్చిన నావలో వాల్టర్ సింప్సన్ (Walter simpson) అనే అమెరికాదేశస్థుడు వచ్చాడు. స్పానిష్ యుద్ధంలో సింప్సన్ ఎంతో పేరుప్రఖ్యాతులు గడించాడు. ఈతడు వచ్చాడని తెలియగానే నాలో ఉత్సాహం కలిగింది. అతడు తన బసలో స్థిరపడగానే అతనిని చూడడానికి వెళ్ళాను. బొద్దుగా, గోధుమరంగు జుట్టుతో, నాకంటె పెద్దవాడైన సింప్సన్ ఇక్కడికి రావలసివచ్చినందుకు విచారంలో మునిగివున్నాడు. అతనికి ఉత్సాహం కలిగించడానికి ఎన్నో విధాల ప్రయత్నించాను కాని లాభం లేకపోయింది. సింప్సన్ పెన్సిల్వేనియా (Pennselvania) నుంచి వచ్చాడు. యుద్ధంనుంచి తిరిగివచ్చిన ఏడుసంవత్సరాలకి రోగలక్షణాలు అతనిలో కనుపించాయి. ఆతరువాత నేబూాకి వెళ్ళాడు. అతనినిగురించి అంతమాత్రమే నాకు తెలుసును. ఇంకొకవిషయంలో మాఇద్దరికీ పోలికవుంది. ఆతడూ ఇంజనీరింగ్ పట్టభద్రుడే నేనూ అంతే. మాబండారులు కూడడం మాకంతగ ప్రియపడలేదుగాని ఫిలిపైన్స్ హితులంటే మాఇద్దరికీ ఇష్టమే. కాని వచ్చినచిక్కేమిటంటే ఏ ఒక్కవిషయంలోనూ మాఇద్దరికీ ఏకాభిప్రాయం కుదిరేదికాదు.

పనిచేయడమంటే సింప్సన్ ఎందుచేతనో ఇష్టపడేవాడు కాదు. మా దేహలసరక్షణాభిషయంలో అతనిని చేరవలసిందని

అంతగా నేను బలవపించేచులేను. అతడికనచ్చలేదు. అతని యిష్టంవచ్చినట్లు అతనిని వదలివేశాను. అయినా ఇద్దరం ఒకే దేశంవాళ్ళం కాబట్టి ఏవైనా కొత్తసంగతులు చేసుకొన్నప్పుడు మాత్రం టామస్‌చేత సింప్సన్‌ని పంపేవాణ్ణి. క్రమంగా మా స్నేహం మరింత వృద్ధిపొందింది. అయినా సింప్సన్ ఎవరితోనూ అంత చనువుగా వుండలేడన్నసంగతి అప్పుడు గ్రహించాను.

ఒకనాడు మాకు అమెరికాదేశం యూరప్‌యుద్ధంలో పాల్గొనబోతూన్నదని బలాలో (Balalo) రేడియోద్వారా వార్తఅందింది. అది 1917 వ సంవత్సరం.

కొన్నాళ్ళపిదప నేను 'కాలనిహాల్'నుండి (Colony Hall)వెళ్ళుసరికి కేకలు వినబడింది. ఒకకుర్రాడు తనవెనుక జనుల వరుసతో అవసరవసరంగా పరుగెత్తివచ్చి మెట్లపైకేగి నిట్టూర్పులు విడిచాడు, నిర్ఘోషించాడు:—

అమెరికా జర్మనీమీద యుద్ధం ప్రకటించింది. అని ఈ వార్త వినగా జనులు తమటోపీలును పైకెగరవేశారు. కేకలు పెట్టారు, అంతలో ఒకకుర్రాడు బైసికల్‌మీదపాడుచు "నాటకరంగంలో అరగంటలో జనసభ కూడుతుందోయ్! ఇట్లు ప్రెసిడెంట్‌వారి ఆజ్ఞ" ఘంటాపథం వేశాడు. ఆయన పాల్ రెవెరే (Paul Revere) ఫిలిపినోవాడు! ఆశ్చర్యంగదూ! పతాకాలు రాదొడగినవి. ప్లాజా లిపక్ తాకు వెళ్ళుగుంపులతో నేను కలిసికొంటిని. ఆ బయట నాటకరంగంజేరాం. వైపులు మూసినమేడ ఒకకొనలో. చెక్కలబల్లమీద వరుసలు నిండి పోయి ప్రక్కలందు ఎనిమిదివరుసలు జనులు నిలిచిరి. కుష్ఠులు

సభాధ్యక్షుడగు పెడ్రో కనటి (Pedro Canete) పాదరివారు మార్సెల్లో సభ్యులు కొందరు మేడమీద కూడారు. డాక్టర్ విన్‌టన్‌వచ్చిచేర ఆ చోట బాండు మ్రోగదొడగె. కరతాళాలు లేచాయి. ప్రెసిడెంట్‌గారి సైగమీద సంయుక్తరాష్ట్రపు దేశీయగీతము పాడిరి. దేశమునుండి పదివేలమైళ్ళదూరాన కుష్టురోగులమధ్య నుండెడి ఒకకుష్ఠుడైన నాకు ఏఒకటీ గొంతు పట్టినట్లు మాటలు లేవలేదు. దీనికంటే ఎక్కువార్ద్రముగల సమావేశము అమెరికాలోగూడ నుండునా, అని ఆశ్చర్యపడితిని. ఫిలిపైన్ దేశీయ గీతము పాడితిమి. పాదర్‌మార్సెల్లో ఒకకీర్తనజేసిరి. ప్రెసిడెంట్ కనేటే మిగుల తీవిగను తిన్ననిస్వరముతో ఈ కొద్ది మాటలు వక్కాణించారు. "మన సొంతదేశముమారి విదేశీయులై యున్నాము. మనలను పోషించు ఈ అమెరికన్ దేశానికి చేయజాలిన విషయాలుకొద్దియే. మనమంచి నడతచేతను మనకు మనమేతోడను సూత్రముగ్రహించి కొన్నిడాక్టరులును నర్సులను మనసేవనుండి మానుకొనిచ్చి యునైటెడ్‌స్టేట్స్‌సేవకు జేరే అవకాశము కల్పించుతాము అదియే మనలను వొచ్చెడిమాట."

నే నెఱుగకయే నా గుండెమీదిభారం దిగబడ్డది. మీటింగునుండి ఇంటికి వెళ్ళునప్పుడు అచ్చట సంభవములను పరికించితిమి.

కొద్దిరోజుల తరువాత అమెరికా జర్మనీపైన యుద్ధం ప్రకటించింది' అంటూ వీధులలో జనం గుంపులుగుంపులుగాచేరి అరువసాగారు. ఫిలిపైన్ దేశస్థులుకూడా ఈ యుద్ధంలో ఉత్సాహంగా శత్రువులతో పోరాడటానికి సిద్ధంకావడం నాకాశ్చర్యం వేసింది.—దానికి అనుగుణంగా యుద్ధపుబాండులు (Liberty

Bonds)కూడా విపరీతంగా అమ్ముడు పోయాయి. వందనాణేలు ఇవ్వగల ప్రతివ్యక్తీ ఈ'బాండు'ను కొన్నాడు. ఒకవ్యక్తి దగ్గర అంతడబ్బులేనప్పుడు కొంతమందిచేరి వారిలో ఒకరిపేరుమీద వీటిని కొనేవారు. తక్కిన వాటాదారులకు అతడు వారి వాటాకి రసీదు ఇచ్చేవాడు. ఈ విధంగా క్వ్యాలియన్‌లోవున్న కుష్టురోగులు ప్రపంచయుద్ధంలో ప్రవేశించారు.

నేషనల్ గార్డ్'లో ఆఫీసరుగా పనిచేసిన టామ్ హుటా హుటిని యుద్ధంలో చేరడానికి ముందుకు వచ్చాడు. ఈచొరవ టామ్‌ని 'లెఫ్టినెంట్' గా సమోదు కావడానికి తోడ్పడింది! నాకీఉత్తరం టామ్ దగ్గరనుంచి అందేలోపుగానే టామ్ ఓడలో మహాసముద్రాలపైన ప్రయాణంచేస్తూ వుంటాడు యుద్ధనౌక పైన!

నెడ్, మనఇద్దరంకలసి యుద్ధంలో పాల్గొనివుండివుంటేనా మనకుటుంబపు కీర్తిపతాక తారాపథాన వుండివుండేది. అయినా ఫరవాలేదులే నెడ్—మనవంశ గౌరవాన్ని నేను కాపాడతానుగా ఇంతవరకూ మనలో యుద్ధానికివెళ్ళిన వారంతా ఇంటికి తిరిగి వచ్చారు. నేనూ తిరిగివస్తాననే అనుకొంటూన్నాను. ఒకవేళ నేను తిరిగి రాకపోయినా నీవు విచారించవలసిన అవసరంలేదు. జేన్ విషయంలోకూడా నీవేమీ బెంగపెట్టుకోనక్కరలేదు. ఆమె చికాగోలో (Chicago) సంగీతపాఠశాలలో ప్రధానా ధ్యాపికగావున్నది. నాకేదైనా ప్రమాదం సంభవిస్తే నీకు తెలియ పరచబడుతుంది! మేజర్. థామ్సన్‌ద్వారా చేయవలసిన ఏర్పా ట్లన్నీచేశాను. బిల్‌కూడా ఈ విషయంలో తన సంతోషాన్ని

వ్యక్తంచేశాడు —ఒక వైద్యదళంలో అప్పుడే చేరాడుకూడా. ” అని వ్రాశాడు టామ్.

టామ్ దగ్గరనుంచి మరియొక ఉత్తరం రావడానికి చాలా కాలం పట్టింది. టామ్ ప్రస్తుతం ఫ్రాన్స్‌లో వున్నాడట. త్వరలో తమదళం యుద్ధంలో ప్రత్యక్షంగా పాల్గొనబోతూన్న దట. ” తిరిగి ఉత్తరం రావడానికి చాలారోజులు పట్టింది—— ఈసారి బిల్ దగ్గరనుంచిఉత్తరం వచ్చింది——రణరంగంలో అడుగు పెట్టగానే టామ్ దెబ్బలాటలో మరణించాడు !! ”

నా దుఃఖానికి మేరలేకపోయింది. టామ్ మరణవార్త ఒక్కసారిగా నా ఆలోచనలను ఇంటివైపు మరలించింది. తక్షణం ఇంటికి వెళ్ళాలనే ఆ కాంక్ష నాలో ప్రబలమై నన్ను బాధ పెడుతూంది. ఎంతగా మారిపోయివుంటుందో. మా ఇల్లు ! టామ్‌నీ, అమ్మనీ, జేన్‌నీ, మేబెల్‌నీ, ఆఖరికి తండ్రినీ చూడా లని ఎంతగా నామనస్సు తహతహలాడింది। వీరిలో జేన్, మేబెల్ ఈ ఇద్దరూతప్ప, తక్కినవారంతా మరణించారుకదా !

ఈ విచారంలో క్రుంగిపోయిననాకు కేరిటా దేవతలా దొరికింది. ఆమె సన్నిధిలో నామనస్సు ఊరటచెందేది. క్రమంగా నా ఆలోచనలను క్యూలియన్ వైపు మళ్ళించి, అదే నాఇల్లుగా మార్చింది కేరిటా !

## 21 వ ప్రకరణం

కాలనీలోవున్న రెఫ్రిజిరేటింగ్ యంత్రాన్ని పెద్దదిచేసి, ఆప్రాంతానికంతటికి విద్యుచ్ఛక్తిని సరఫరాచేసి, దానిద్వారా ఇళ్ళకీ, వీధులకీ విద్యుద్దీపాల సౌకర్యం కలుగచేయాలని చాలా రోజులుగా నేననుకొంటున్నాను. దీనికోసం ఒక 'స్టాక్ కంపెనీ'గా ఏర్పడి, అక్కడిజనానికి వాటాలను అమ్మడానికి ప్రారంభించాము. కాలనీలో వాటిని కొనగలిగిన ప్రతిఒక్కరికీ వాటిని అమ్మి నాము,

విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే క్రొత్తయంత్రాలను కొనే ప్రయత్నంలో అంతవరకూ ముభావంగావున్న నాస్నేహితుడు సింప్సన్‌లో ఒక నూతనోత్సాహం కలిగింది. సింప్సన్‌ని అసి స్టెంట్ మేనేజరుగా నియమించాను. ఏమీఆలోచింపక ఒప్పుడే ఒప్పుకొన్నాడు. వాటిస్థానంలో క్రమంగా కిరసనాయిలుదీపాలు పోయి విద్యుద్దీపాలు రాసాగాయి. సాధ్యమైనంత త్వరలో మేము విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడానికి స్థంభాలూ, తీగలూ వేశాం. క్రమంగా ప్రతిచోటా సామానులనమ్మే షాపులు ఎలెక్ట్రిక్ వస్తువుల గ్గి కొన్నారు. వాళ్ళందరికి కావలసినవి ఇవ్వడానికి చాలాఏండ్లుపట్టింది. అయినను మా పవర్ స్టేషన్ చిన్నదైనను మాకు పని పూరాయిచ్చింది. మోటార్ పడవని స్వంతానికి కొన్నాను. టామస్ దీనిని నడపడంకూడా నేర్చు కన్నాడు. టామస్, నేనూ ఆపడవమీద వెళ్ళి రకరకాల చేపల్ని పట్టేవాళ్ళం.

ఒకనాడు టామస్ నేనూ క్వ్యాలియన్ అఖాతంలో కోరన్ తీరానికి దూరంగా మామోటార్ పడవలో వెళుతుండగా మాకొక స్టీమరుకనపడింది. అది తూర్పుదేశాలనుంచి రోగుల్ని తీసుకువచ్చే స్టీమరు. అఖాతంలో అది ప్రవేశించగానే ఒక్కసారిగా ఓడలోపలిజనంలో కలకలంబయలుదేరింది. అందరూ స్టీమరు చివరకువచ్చి ముందుకువంగి నీటిలోపలికి చూస్తున్నారు. ఏదోప్రమాదం జరిగివుంటుందని మాపడవని ఆవైపు వడివడిగా పోనిచ్చాను. ఇంతలోనే ఆస్టీమరుపైనుంచి ఒక చిన్నపడవని క్రిందికిదింపారు. కాని ఆపడిపోయినవ్యక్తికి మేము చాలాదగ్గరలో వుండటంచేత టామస్ తక్షణం నీటిలో కొట్టుకొంటూన్న ఆవ్యక్తిని పైకితీసుకువచ్చాడు. టామస్ గజ ఈతగాడు. అందుచేత ఏమీకష్టంలేకుండా సునాయాసంగా ఆవ్యక్తిని ఎత్తి అపుడే సమీపించిన ఆరెండో పడవలోనికి సురక్షితంగా చేర్చి, తిరిగి మాపడవదగ్గరికి ఈదుక వచ్చేశాడు.

వచ్చి "అది ఎవరో ఒకపిల్లండీ-చచ్చిపోవాలని నీటిలో ఉరికింది - ఆపిల్ల ఇక్కడకి రావడమంటే మహా భయపడుతూందని ఆపడవలలోవాళ్ళుచెప్పారు." అన్నాడు నాతో టామస్.

మొదటిరోజులలో నాతో వచ్చిన ప్రయాణీకులు ఎంత ఇక్కడ అడుగుపెట్టడమంటే ఎంతగా భయపడినదీ నాకు తెలుసు. కాని క్రమంగా అక్కడ కల్పింపబడే సౌకర్యాలకు అందరూ సంతోషంగా రాసాగారు. ఆత్మహత్యలకి తావేలేదు. అందు టామస్ చెప్పినట్లు ఈ 'పసిపిల్ల' విషయంలో మరీను!

కొద్దిరోజులతరువాత ఆపిల్లనిగురించి కెరిటానిఅడిగాను.

"ఆమె అంతపసిపిల్ల కాదనీ, పన్నెండేళ్ళపైగా వుంటుం దనీ, టామస్ ఆమెని రక్షించాడు కనుక ఆమె కథవినడానికి టామస్‌కూడా వస్తే బాగుంటుందనీ, కేరెటా అన్నది. టామస్‌ని తీసుకురావడానికి నేను వెళ్ళాను. మాతోపాటువచ్చి కూర్చొని ఆపిల్లనిగురించి వినడానికి టామస్ సిగ్గుపడ్డాడు. ఎందుచేతనంటే ఆపిల్లని రక్షించినప్పటినుంచీ అందరూ టామస్‌ని ఒక 'హీరో' వీరశూరుడు (Hero) అంటూ చంపుకు తింటున్నారు.

కేరెటా ఆపిల్లనిగురించి చెప్పడం మొదలుపెట్టింది. ఆపిల్లపేరు కార్మెన్‌టోలినో (Cormen Tolino) కార్డోవా (Cordova) నగరానికి కొద్ది కిలోమీటర్ల మైళ్ళ దూరంలోవున్న మేక్టన్ (Maktan) దీవికి చెందినదామె. కార్మెన్‌తండ్రికి ఒక చిన్న అనాసతోటవుంది. అక్కడిభూమి అంత సారవంత మైనది కాకపోవడంచేత పంట అంత బాగుండేదికాదు. కార్మెన్ పుట్టేటప్పటికి ఆమెసోదరుడు విసెంటి (Vicente) కుష్టురోగంతో బాధపడుతున్నాడు' కుష్ఠువ్యాధిగురించి భయంకరమైన కట్టు కథలు విన్న విసెంటి తల్లిదండ్రులు ఆరోగ్యశాఖాధికారులకు తెలియకుండా విసెంటిని దాదాపు పన్నెండు సంవత్సరాలవరకూ దాచివుంచారు. ఆఖరికి ఆరోగ్యశాఖవారికి ఈవిషయం తెలిసి అతనిని సేబూ కుష్ఠురోగుల శరణాలయానికి పంపించారు. త్వరలో విసెంటిని ఇక్కడకి పంపిస్తారు.

"కేరెటా, కార్మెన్ వ్యాధిబాగా ముదిరిపోయిందా?"

"లేదుగాని అప్పుడే ఈవ్యాధివల్ల ఆమెవ్రేళ్ళు దెబ్బ తిన్నాయి. అయినా ఆమె ఎంతో చక్కగా ఎంబ్రాయిడరీపని

(Embroideri) కసీదాపని చేయగలను. ఆమె తయారుచేసిన వస్తువులను క్రిమినాశక ద్రవ్యాలతో పరిశుభ్రంచేసి, వాటిని అమ్మకానికి ఎందుకు పంపించకూడదు? ప్రస్తుతం ఇక్కడ అవి అమ్ముడుపోయే అవకాశంలేదుగా?"

అప్పుడే నీరెండలు వ్యాపిస్తున్నాయి. సూర్యు డస్త మిస్తున్నాడు. టామస్ మాకు టీ తీసుకువచ్చాడు. కేరిటా నేను క్షణంసేపు నిశ్శబ్దంగా వున్నాము. ఆమెకు తెలుసు ఎప్పుడూ మేము మౌనంగా వుండాలని ఆసమయంలో కేరిటా ఒక ముఖ్యమైన వార్తతీసుకువచ్చింది.

"నెడ్, నావ్యాధీ......నావ్యాధి అరికట్టబడిందని... డాక్టరు చెప్తున్నారు."

సంతోషంపట్టలేక "అయితే నీకు పూర్తిగా తగ్గిపోయినట్లే కేరిటా! ఇక నీవు మనిలాకి తిరిగి వెళ్ళిపోవచ్చును."

"ఇంకా అప్పుడేకాదు నెడ్, కొంతకాలం ఇంకా వేచి వుండాలి. అయినా ఇక్కడనుంచి ఇక నేను తిరిగి వెళ్ళనని ఒకసారి నీకు చెప్పాను. నిన్ను వదలివెళ్ళడం అసంభవం. ఇక్కడే నాకు హాయిగావుంది. నీకు దగ్గరగావుండి పనిచేయడం నాకిష్టం."

"సరే, అది నాకూ మంచిదే" అన్నాడు. కేరిటా శరీరంలో గడువుసమయంలోపల మరేవిధమైన చెడ్డలక్షణాలూ లేకుండా, రోగం పూర్తిగా నిరోధింపబడినట్లు డాక్టర్లు ప్రకటిస్తే ఆమెను తిరిగి వెనుకకు పంపివేయాలని నేను ఒక అభిప్రాయానికి

వచ్చారు. కేరిటా ఇంకా చిన్నవయసులోనే వున్నది. ప్రపంచంలో ఆమె చూడవలసిన దెంతో వున్నది — ఆమె ఈ ప్రదేశాన్ని వదలి వెళ్ళడమే మంచిదని అనిపించింద.

ఒకసంవత్సరం తరువాత మరికొంతమంది రోగులు తిరిగి పంపివేయబడుతున్నారని డాక్టర్ విన్టన్ నాతో అన్నారు.

"కేరిటావ్యాధి పూర్తిగా నిరోధింపబడిందా?" అని అడిగాను.

"అవును" అన్నారు డాక్టర్ విన్టన్.

తరువాత కొంతసేపటికి కేరిటా నాతో టీ త్రాగడానికి వచ్చింది.

"ఇక నీవు ఇక్కడ వుండకూడదు కేరిటా, మామూలు ప్రపంచంలో నీవు చూడవలసినదీ, చేయవలసినదీ ఎంతోవుంది!" అన్నాను.

"నేను వెళ్ళటంలేదు, నెడ్. నేను తిరిగి నలుగురిలోకి వెళ్ళి, అసహ్యంతోనూ, అనుమానంలోనూ చూచేవారిమధ్య జీవించలేను. ఇక్కడ నాకు చేయవలసిన పనివుంది. అక్కడ ఆలాంటిదేమిాలేదు."

"నీకే అలా అనిపిస్తే మరి తక్కినవారి సంగతేమిటి, కేరిటా; ఈలాంటి అవమానాలకి భయపడకూడదు. సంఘాన్నెదుర్కోవాలి. నీవు ఇక్కడే వుండాలని అనుకుంటే వుండవచ్చును కానీ, ఈప్రదేశం శాశ్వతంగా ఆరోగ్యంపొందినవారిని

కూడా ఎంతకాలం భరించగలదు ? తనవారంటూ ఎవరూలేని వాళ్ళ విషయమైతే అనుకోవచ్చు. మరి నీకు నీభర్తతరఫువాళ్లూ, నీతరఫువాళ్లూ వున్నారు. అందుచేత నీవు తిరిగివెళ్ళి, నీలాగే విడుదలైన రోగులకి సంఘంలో సముచిత స్థానందొరకేలా పాటు పడాలి. ఈ మహత్తరకార్యానికి నీకంటె ఇంకెవరూ నాకు కనుపించటంలేదు. ''

'' అయితే నీవే నన్ను వెళ్ళిపొమ్మంటూన్నావన్న మాట ? ''

నాలో అణువణువునా ఈ మాటలు ప్రతిధ్వనించాయి. కాని గత్యంతరంలేదు.

'' అవును, నీవు వెళ్ళితీరాలి కేరిటా-క్యూలియన్‌కి వచ్చి, రోగం నయమై తమతమ ప్రదేశాలకి ఆరోగ్యవంతులుగా తిరిగి వెళ్ళవచ్చుననే నమ్మకం ప్రజలలో కలిగించే బాధ్యత నీ బోటివారిమీదనే వున్నది కేరిటా. ఇక్కడికివచ్చిన రోగులందరూ శాశ్వతంగా ఇక్కడనే వుండిపోవలసివస్తే ఇంతకంటె వేరే నరకం ఇంకొకటుంటుందా ! అందుచేత మా అందరిలో ఆలాంటి ఆశ, నమ్మకం కలిగేలాచూడు కేరిటా. ''

'' అయితే నేను వెళుతాను '' అన్నది కేరిటా. క్షణం సేపు ఇద్దరం నిశ్శబ్దంగా కూర్చున్నాం.

'' మరి ఎక్కడికి వెళుదామనుకుంటూన్నావ్ కేరిటా.''

'' నెడ్, నాభర్త ఇంటికిమాత్రం వెళ్ళను. అక్కడ నన్నెవరూ ఆదరించరు. మాతండ్రి దగ్గరకే వెళ్ళాలనుకొంటూ

న్నాను. ఆయన అక్కడొక చిన్నఉద్యోగం చేస్తూన్నారు. నేను వెళితే ఆయన సంతోషంగా నన్నాహ్వానిస్తారు. కాని నేను అక్కడికివెళ్ళి చేయగలిగినదేమిటా అని ఆలోచిస్తూన్నాను. తిరిగి వచ్చిన కుష్టురోగిగా అసహ్యించుకొని ప్రజలు బహిష్కరిస్తారేమోనని భయంగావుంది.—నెడ్, నేను బాగా అలసి పోయాను. తిరిగి సోమవారంనాడు నీతో భోజనానికివస్తాను." అని చెప్పి కేరిటా వెళ్ళిపోయింది.

వాల్టర్ సింప్సన్ నేనూ మా విద్యుత్ యంత్రాగారం దగ్గర వున్నాం. ఇప్పుడు ఒక్క 'రెఫ్రిజిరేటింగ్ ప్లాంట్' మాత్రి మేకాక రంపపుమిల్లు, విద్యుద్దీపాలకి విద్యుత్తును సరఫరాచేసే యంత్రం—ఇవన్నీ వున్నాయి—మేమీ యంత్రాలున్న కట్టడానికి బయట, కలప దింపుతూన్న పడవలదగ్గర వున్నాం. హఠాత్తుగా ఈ కలపదింపేజనంలో కలకలం బయలుదేరింది. ఇంతలో ఒక చిన్నకుర్రవాడు సైకిలుమీద వేగంగా వస్తూ—

"సంధి జరిగింది! సంధి జరిగింది!" అంటూ అరిచాడు.

సింప్సన్ యంత్రాగారం లోపలికవెళ్ళి. ఒక చిన్న త్రాటిని క్రిందికిలాగి మూడుపర్యాయములు ఆవిరియంత్రాన్ని కూత పెట్టించాడు. ఈ విధంగా తొమ్మిదిసార్లు కూతవేయించి, ఒక కుర్రవానిచేతికి కూతవేయించే త్రాటిని అప్పగించి, బాగా ఆవిరిమంచు! పెట్టుట వదలవద్దని ఫైర్‌మన్‌తో చెప్పడానికి సింప్సన్ అటువైపు పరుగెత్తాడు.

చెవులు గింగురుమనే ఈధ్వని వినగానే నాలో చెప్పరాని ఆరాటం బయలుదేరింది. ఆ ప్రదేశాన్ని వదలి ఒంటరిగా ఎక్కడికైనా పోవాలనిపించింది ఇన్నాళ్ళుగా మరచిపోయినవిషయమేదో ఆ కూతలో ఠటాలున జ్ఞాపకానికి వచ్చినట్లనిపించింది. దాచినా దాగని సత్యం ఏదో నా గుండెలలోనుంచి వదలించుకొని బయటపడాలని ప్రయత్నిస్తున్నట్లనిపించింది——నెడ్ లాంగ్‌ఫర్డ్ అనే నేను నెడ్ ఫెర్గూసన్‌వైపు చూస్తున్నా—నాలో వుండే అంతరాత్మ యథార్థాన్ని ఒప్పుకుతీరమని నన్నాదేశిస్తున్నది——తక్షణం అక్కడనుండి మామిడిచెట్లక్రిందికి వెళ్ళాను. ఎన్నడూ నేను వాంఛించే స్నేహం, ఆప్యాయత, ప్రేమ—నాకా మామిడిచెట్ల నీడలలో కనుపించింది.

నెడ్ లాంగ్‌ఫర్డ్ మాట్లాడాడు. సంధిపత్రాలమీద సంతకం అయిపోయింది. నాలో పోరాటంకూడా ముగిసిపోయింది..

యథార్థవిషయం నాకప్పుడు తెలిసింది. అంతవరకూ ఓటమిని నేనెన్నడూ అంగీకరించలేదు. వీధులలో వెళ్ళేటప్పుడుగాని సమావేశాలలోకాని నాచేతికి ఎప్పుడూ 'గ్లవ్స్' వుండేవి. "మూర్ఖుడా! ఒకరిని వంచించడానికి చేతికి తొడుగులు వేసుకొన్నావా?" అని నా అంతరాత్మ అడిగింది. అప్పటికే మొదటి కణుపువరకూ తినివేయబడిన నా వ్రేళ్ళవైపు చూసుకున్నాను.

మొట్టమొదట ఇరవై ముప్పైమందీ, ఆతరువాత దాదాపు వందమందీ, ఈవిధంగా రోగం నెమ్మదించి, ఇళ్ళకి

వెళ్ళడం నేను చూచాను. ఒకనాడు నేనుకూడా ఈవిధంగానే విడుదలచేయబడతాననే ఆశతో రోజులు గడుపుతూవచ్చాను. ఈ ఆశే నన్ను అక్కడశాశ్వతంగా బంధించివేసింది. ఒకవైపు శరీరం క్రమంగా ఈదారుణ వ్యాధికిగురియై క్షీణించిపోతున్నా ఇంకా ఏదో వెర్రిఆశతోనే కాలంగడుపుతూ వచ్చాను. ఈనాడు నాకు యధార్థం తెలిసింది. ఈ నిరంతరయుద్ధంలో నేనే ఓడిపోయాను.

డాక్టర్లు ఈవ్యాధిని నిరోధించడంలో విజయంసాధించారు - నావిషయంలో కాకపోయినా తక్కినరోగులవిషయంలో నాచేతులు క్రమంగా రోగానికి బలిఅయిపోతున్నాయి. కాని వ్యాధిని నిరోధించవచ్చునని డాక్టర్లు చెప్తున్నారు. నా విషయంలోకాదు! ఆమెవిషయంలో!— నాలో ఇతర దుర్లక్షణాలుకూడా వ్యాపిస్తున్నాయి! "సైనికుడా! నిలిచి పోరాడు! పారిపోకు! దానికింకా సమయంరాలేదు. కళ్ళుతెరచి, ఇంకా ఎంతకాలం ఈపోరుసల్పవలసి వుంటుందోచూడు కుష్ఠురోగివైన నీవు ఇంకా ఈప్రపంచంలో ఏమిచేయగలవో గాలించిచూడు. నీచేతులు పూర్తిగా పోకుండగానే ఈ నీ నిర్ణయపత్రంమీద సంతకంపెట్టు. అప్రయత్నంగా నాఫౌంటెన్‌పెన్‌తీసి, ఎదురుగావున్న కర్రబల్లచివర సంతకంచేశాను. చరిగిపోనిసిరాతో! ఒక్క సంతకంతప్ప దానిపైన మరేమీలేదు. నాకుతెలుసు నావిషయంలో ఇక ఏవిధమైన ఆశాలేదని అయినా నేను చేయవలసిన పనివుంది. నాలో శక్తివున్నది—నేను జీవిస్తాను—నేను చేయవలసినపని చేస్తాను!"

ఇలా అనుకొని సంతృప్తిగా వెనుకకి జార్లపడ్డాను—నేను స్వేచ్ఛని పొందాను. 'ఆత్మత్యాగికి ఆత్మలాభం' అని యేసునాథుడు వక్కాణించినట్లు తనచిన్న జీవితాన్ని పోగొట్టుకొన్నవాడు దానికి మూరు మేలైనది పొందగలుగుతాడు!" ఈవిధమైన "నష్టపరిహారవిధానం" ఒక నిత్యసత్యం!

## 22 వ ప్రకరణము

ఈవిధంగా రోజులూ, నెలలూ, సంవత్సరాలూ గడచి పోయినాయి. ఒకనాడు నేను మా తోటలో పూలమొక్కల్ని కత్తిరిస్తూండగా డాక్టర్. విన్టన్‌వచ్చారు, మా తోట సౌంద ర్యానికి ముగ్ధుడనైన నేను నాచేతిలోని కత్తెరను పారేసి డాక్టర్ విన్టన్ దగ్గరకి, మామిడిచెట్లనీడకి వెళ్ళాను.

"నేను వెళ్ళిపోతూన్నానని చెప్పడానికి విచారిస్తున్నాను నెడ్." అన్నారు డాక్టర్. విన్టన్.

"అప్పుడే ఇంటికి వెళ్లిపోతూన్నారా? ఇప్పుడేకదూ వచ్చినది?" అన్నాను.

"అదికాదు—తిరిగి అమెరికాకి వెళ్ళిపోతూన్నాను క్వ్యాలియన్ విడచిపెట్టి." అన్నారాయన.

ఈ వార్త నాకు బాగా ఆశ్చర్యం కలిగించింది. డాక్టర్. విన్టన్ లేకపోతే అది క్వ్యాలియన్‌కి ఎంతలోటో చెప్పడం కష్టమే.

“ కాని ఇప్పుడంత హఠాత్తుగా వెళ్ళిపోవడానికి కారణమేమిటని అడిగాను.

అది ఒక క్రొత్తఉద్యోగమనీ, లూసియానా ఒడ్డుననుండు (Lousiana) లోని (Carrilley) కార్విల్లీఅను (Baton) బేటనుదగ్గర (Mississippi) మిసిసిపి ప్రభుత్వ కుష్ఠునివారణ కేంద్రంలో తనను సూపరింటెండెంట్‌గా ప్రభుత్వం నియమించినదనీ, తాను తక్షణం అక్కడికి వెళ్ళితీరాలనీ డాక్టర్ విస్టన్ అన్నారు.

తాను వెళ్ళిపోతూంటే నన్నుకూడా తనతో ఎందుకు తీసికొని వెళ్ళకూడదని డాక్టర్ విస్టన్‌ని అడిగాను.

“ తనతో తీసుకువెళ్ళడానికి తనకేమీ అభ్యంతరంలేదనీ, కాని క్యూలియన్‌లో నా ద్వారా జరిగే ప్రజాసేవకి దీనివల్ల అంతరాయం రావచ్చుననీ, సింప్సన్ ఇంజినీరింగ్లో గట్టివాడుకాని ఈ భారాన్ని నిర్వహించలేడనీ, అందుచేత ప్రజాశ్రేయస్సు దృష్ట్యా నేను అక్కడే వుండితీరాలనీ, కొంతకాలం గడచిన తరువాత అంతగా రావాలనిఉంటే తప్పక కార్విల్లీకి రావచ్చుననీ ” డాక్టర్ విస్టన్ అన్నారు.

ఆ బల్లమీద అంటించుకున్నుంది నేను పెట్టిన సంతకంవైపు నాదృష్టిపోయింది. “ డాక్టర్ విస్టన్ చెప్పినమాట నిజమే, నేను లేకపోతే క్యూలియన్‌లో నీపల సరఫరా, విద్యుత్సరఫరా మొదలైనవన్నీ, దెబ్బతింటాయి. నా శరీరంలో పూర్తిగా ఓపిక తగ్గిపోయేవరకూ అక్కడే వుంటాను. ఆసమయంకూడా ఎట్టే దూరంలోలేదు! అప్పుడు [illegible] కార్విల్లీ వెళుతాను. ”

ఆనాడు డాక్టర్. విన్సన్‌తో మాట్లాడుతూ చాలా పొద్దుపోయేవరకూ వుండిపోయాను. డాక్టర్. విన్సన్ మమ్మల్ని విడచి వెళ్ళిపోవడం చాలా కష్ట గావుంది.

కొద్దిరోజులు తరువాత ఒకఉత్సవం జరిపినట్లు డాక్టర్. విన్సన్‌కి వీడ్కోలుచెప్పాము. డాక్టర్. విన్సన్ నావ చాలా దూరం వెళ్ళేవరకూ అటువైపేచూస్తూ నిలుచుండిపోయాను.

## 23 వ ప్ర క ర ణ ము

డాక్టర్ విన్సన్ కుర్యాలియన్‌నివిడచి వెళ్ళేముందు అక్కడ అమెరికన్లుఇచ్చిన ధననిధి (ఫండు)తో ఒక ప్రొటెస్టాంట్ చర్చి కట్టడానికి అధ్యక్షత వహించుటగాక తన సొంతనెలవున ఉపన్యాసస్థలము నిర్మించాడు. అచటనే నివసించునట్లు ఒక మతగురువును నియమించాలని అతని ఆశాభావం. ఆ వాంఛ శీఘ్రమే నెరవేరింది. ఘనుడు హడ్సన్‌గురువు ఈ దీవులనుండి మార్పబడ్డాడు. ఆ వెనుక కొందరువచ్చేది పోయేది. తుదకు పాస్టర్ మాన్‌సన్ (Pastor Manson) వచ్చి చేరాడు. వచ్చిన నెలలోనే ఆయన పాదర్‌మాంట్లో ఇద్దరు బద్ధస్నేహితులైరి. ఇద్దరున్ను రోగుల కష్టాల్లో పాల్గొనువారు. కుర్యాలియన్ చర్చిలందు పూజా ఉపన్యాసాది విధానాలు వాళ్లుచేయు కార్యాలలో కొద్దిభాగమే. రోగులు రోగముగూర్చిన విషయాలకు డాక్టర్లకడకు వెళ్ళుదురు. కాని, తమసొంత సమాచారాలకు ఆ ఇద్దరు గురువులకడకే వెళ్ళుదురు.

కొద్దిరోజులలో లియోనార్డ్ వుడ్ (Leonard Wood) క్యూలియన్‌లోని పరిస్థితులను పరిశీలించి, ఇతోధికమైన సౌక ర్యాలు కల్పించడానికి ఒక నిపుణుడైన విజ్ఞానశాస్త్రవేత్తని అక్క డికి పంపించారు. డాక్టరుబాండ్ (Docter Bond) ఎంతో అనుభవజ్ఞుడు. ఎన్నోనాళ్లుగా ఫిలిప్పైన్ విశ్వవిద్యాలయ వైద్య శాఖతో ఆయనకి విశేషంగా సంబంధంవుంది.

డాక్టర్ బాండ్ రాక మాలో ఉత్సాహం, సంతృప్తి కలి గించింది. ఆయన ప్రధానవైద్య శాఖాధికారిగా మాత్రమే కాక, క్యూలియన్‌కి పరిపాలనా నిర్వాహకునిగాకూడా నియ మింపబడ్డారు. ఈ కాలనీలోవున్న కుష్టురోగుల విషయంలో డాక్టర్ బాండ్ చేసిన సిఫారసులన్నిటినీ గవర్నర్ జనరల్ ఆమో దించడంవల్ల మాకు ఎంతో సంతృప్తిగావుంది. మలకంజార్ పాలసులో (గవర్నరుగృహం) కుష్టురోగుల విషయాల్లో అక్కడ తీసుకొన్నట్లు కాన్పించింది.

డాక్టర్ బాండ్ వచ్చినతరువాత రోగులకోసం అనేక నివే శనస్థలాలు, భవనాలు నిర్మింపబడ్డాయి. క్రొత్తగావచ్చిన వైద్య దళానికి వసతిసౌకర్యాలు కల్పింపబడ్డాయి. తనక్రింద తరిఫీదు పొందిన వైద్యపట్టభద్రుల శక్తిసామర్థ్యాలను చక్కగా తెలిసి వున్నవాడు కాబట్టి డాక్టర్ బాండ్ వారిలో చాలామందిని క్యూలి యన్‌కి రప్పించారు. డాక్టర్ డోమింగ్వేసు (Domingues) మున్నగువారు అట్లే వచ్చినవాళ్ళు.

డాక్టర్ బాండ్ అనేక విషయాలలో నా సలహా అడుగు తూండేవారు. నాక్రింద పనిచేసేవారిలో దృఢంగా వుండేవారిని

క్రొత్తభవనాల నిర్మాణంలో తోడ్పడేటట్లు చేయవలసినదిగా ఆయన నన్ను కోరారు. చాలమందిని నిర్మాణ కార్యకలాపాల్లో పాల్గొనే టట్లు చేయగలిగానుకూడా ఈ క్రొత్త క్యూలియన్‌నగర నిర్మాణంలో ఏపనికాడికిని తనయోగ్యతకు తగినంత పని దొరికింది.

## 24 వ ప్రకరణం

యుద్ధరంగంలో చూపిన అసమాన పరాక్రమానికిపొందే స్వర్ణపతకాన్ని పొందడంకోసం మేము ఎన్నికలలు కనేవాళ్ళం! దాదాపు ఇరవై ఐదేళ్ళక్రితం 'చైనా' నౌకలో యుద్ధరంగానికి ప్రయాణంచేసే సమయంలో ఏ అదృష్టవంతుడు ఈ పతకాన్ని పొందుతాడో అని అనుకొనేవాళ్ళం కాని ఈనాడు సిస్టర్ విక్టోరీకి (Victoire) ఈ పతకం బహూకరింపబడుతూంది!

క్యూలియన్‌లో సిస్టర్ విక్టోరీని అందరు ప్రేమించేవారు. కరుణారస పూరితములైన ఆమె కండ్లు, చిరునవ్వు చిందులాడే ఆముఖం ఎవరిని వశపరచుకొనవు? విక్టోరీ ఫ్రాన్స్ దేశపు స్త్రీ, ఆమె క్యూలియన్‌లో కుష్ఠురోగ చికిత్సా కేంద్రం ప్రారంభింపబడినప్పటినుంచీ అక్కడికివచ్చి పనిచేస్తూంది.

గవర్నర్ జనరల్ వుడ్ ఆమె కుష్ఠురోగులకు చేసిన అపారమైన సేవను ప్రశంసిస్తూ ఆమెకు స్వర్ణపతకాన్ని బహూకరించాడు.

విక్టోరీ ముక్తసరిగా గవర్నర్ జనరల్‌కే, తక్కినవారికీ కృతజ్ఞతా పూర్వకవందనములు పలికింది.

ఈ ఉత్సవం ముగిసినతరువాత ఆకాలనీకి ఇటీవలనే ప్రధానవైద్య శాఖాధికారిగా నియమింపబడిన డాక్టర్. డొమింగ్వెజ్ మా ఇంటికి రావడానికి నా ఆహ్వానాన్ని అంగీకరించారు. డొమింగ్వెజ్ ఫిలిప్పైన్ దేశస్థుడు ఎన్నాళ్ళనుండో ఆయనను మా యింటికి రావలసినదిగా ఆహ్వానిస్తున్నాను. నేటికి ఆయన దానికి అంగీకరించారు. ఇది ఫిలిప్పైన్ దేశస్థులలోవున్న ఒక గొప్పసుగుణం. వారు ఆహ్వానిస్తేనే కాని ఏ ఇంటికీ తమంతట తాము వెళ్ళరు—వారు మర్యాదస్థులు; మానము పాటించువారును. డాక్టర్ డొమింగ్వెజ్ నియమాలు నాకెంతగానో నచ్చాయి.

వాస్తవంగా డాక్టర్ డొమింగ్వెజ్ సమర్థుడు. కుష్ఠు రోగుల సమస్యను గురించి ఎంతో శ్రద్ధగా ఆలోచింపగల దక్షత గలవాడు. ఫిలిప్పైన్ దేశీయుడవడంవల్ల తన దేశానికి హృదయపూర్వకంగా సేవచేయడానికి దీక్షాకంకణం వహించాడు. తన బాధ్యతను గుర్తెరిగి, నిర్విరామంగా పరిశోధనలను కొనసాగించి, నరాలలోనికి ఇంజక్షన్లు ఇవ్వడమేకాకుండా' రోగసంబంధమైన మచ్చలు బయలుదేరినచోటనే తిన్నగా ఇంజక్షను చేయడం ద్వారా ఈ వ్యాధి నిరోధానికి ఒక కొత్తపద్ధతిని ఈయన ప్రవేశపెట్టాడు. ఈ విధంగా చేయడంవల్ల బహ్మాండమైన ఫలితాలు కనుపించాయి. ఆ మచ్చలుకూడా ఈ చికిత్సద్వారా మాయమైపోయాయి.

డాక్టర్ డొమింగ్వెజ్ మా ఇంట ఆవరణలోనికి వచ్చీ రావడంతోనే ఈ ప్రదేశం చల్లగా హాయిగావున్నదని అన్నారు.

" మీకు చల్లదనం కావాలంటే మీరు తరచు ఇక్క-
డికి వస్తూండండి " అన్నాను.

మేము మామిడిచెట్లనీడలో కూర్చొనివుండగా టామస్ మా కద్దరికి నారింజరసం తీసుకువచ్చాడు. ఫిలిప్పైన్ దేశస్థులు సాధారణంగా మత్తుపానీయాలు త్రాగరు. వారిలో బీదవారు మాత్రం నీరా—పానీయాన్ని త్రాగుతారు.

" ఈనాటి ఉదయం జరిగిన స్వర్ణపతక ప్రదానోత్సవం ఎంతబాగుంది డాక్టర్" అన్నాను.

" అవును, సిస్టర్. విక్టోరీ ఆమె సహచరులు రోగుల విషయంలో అపారమైన సేవచేస్తున్నారు. వీరి సహాయమే లేకపోతే డాక్టర్లు అందరం కలసినా పనీ చేయనేలేక పోయే వాళ్ళం. " అన్నారు డాక్టర్ డొమింగ్వెజ్.

" ఈ విధంగా రోగులమధ్య పనిచేసేవారికి కుష్టువ్యాధి సోకుతుందా డాక్టర్ " అని ప్రశ్నించాను.

" దాదాపు సోకదనేచెప్పాలి. ప్రపంచంలోని కుష్టురోగ చికిత్సాలయాలలో వందలకొలది, వేలకొలది పనిచేస్తున్నారు. నాకు తెలిసినంతమట్టుకు— ఈలా పనిచేసేవారిలో ఆరోగం సోకిన వారి సంఖ్య నూటికీ, కోటికీ ఒకటికూడా వుంటుందో వుండదో. "

" మరి ఈ రోగమంటే ప్రజలెందుకంత భయ పడతారు ? "

"అదే నాకూ ఆశ్చర్యంవేస్తుంది. కుష్టురోగంలాగే, అంతకంటె భయంకరమైన సుఖవ్యాధులలాంటి అనేక వ్యాధు లుండగా దీనివిషయంలోనే ప్రజలంతగా ఎందుకు భయపడ తారో నాకూ అర్థంకావటంలేదు— ఈ వ్యాధి అంత సులువుగా వ్యాపించే అంటువ్యాధికూడాకాదు. ఈరోగి బట్టలతో తమ బట్టలు చాకలిఇంట కలియడంవల్ల ఇది వ్యాపిస్తుందనే వదంతి కూడా నిజంకాదు.—అంతసులభంగా వ్యాపించే వ్యాధి కాదిది"

"మరి ఈ వ్యాధి ఏ విధంగా వ్యాపిస్తుందో తెలియ దన్నమాట!"

శాస్త్రీయ దృక్పథంతోచూస్తే తెలియదనే చెప్పాలి. మా పరిశీలనవల్ల తేలినదేమంటే దీర్ఘకాలం ఈ వ్యాధివున్న రోగుల సంపర్కంవల్ల ఇది వ్యాపిస్తుందని—సాంఘికంగా, ఆర్థి కంగా దాదాపు సమానపరిస్థితులలోవున్న ఇద్దరు రోగులను మేము పరీక్షించినపుడు ఒకరిలో రోగం తీవ్రంగావుండటం, ఇం కొకరిలో సాధారణంగా వుండడం మేము కనిపెట్టాము—ఆశ్చ ర్యంగాలేదూ? ప్రపంచంలోని వివిధప్రాంతాలకి చెందిన కుష్టు రోగ ఖైదీలపై యీసత్యాన్నే ధ్రువపరచారు! అంతేకాక కుష్టు రోగియైన భర్తనుండి ఈ రోగము భార్యకి సంక్రమించడం కాని, భార్యనుండి భర్తకి సంక్రమించడంకాని, బహుఅరుదు. ఈలాంటి సందర్భాలు నూటికి ఐదుగాని వుంటాయి!

"కొన్నిప్రాంతాల నివసించేవారికి మాత్రమేగాని, వారు తినే ఆహారాన్నిబట్టిగాని ఈరోగం వస్తుందని చెప్ప వచ్చునా?"

"ఈ విషయంలో అనేక అభిప్రాయాలు వ్యక్తంచేయబడ్డాయి. ఉష్ణప్రదేశాలలోవుండే జనానికి ఎక్కువగా ఈ వ్యాధి రావడం కలదుగాని, ప్రపంచం అన్ని భాగాలలోనూ ఇదివున్నది. ఒకరకంతిండి తినడంవల్ల ఇది వస్తుందనే అభిప్రాయంకూడా లేక పోలేదు—చేపల్ని తినడంవల్ల ఇది సంభవిస్తుందని ఒకరిఅభిప్రాయం! కాని దీనిని నమ్మేవారు లేరనుకోండి!"

"గోజ్జెంకలు, నల్లులు మొదలైన కీటకాలవల్ల ఇది వ్యాప్తి చెందుతుందా!

"వ్యాప్తి చెందవచ్చును. మనుష్యులతో ఎక్కువసన్నిహితంగా మసలే ఈగలు, దోమలు నల్లులు మొదలైన వాటి శరీరంపైన కుష్టువ్యాధిని తెచ్చే సూక్ష్మజీవులుండటం కద్దా లేదా అనుట శోధింపబడుతుంది. ఇందాక దొరకబడలేదు. కాని అట్లుండవని అనలేము. కాని కుష్టురోగుల నుండి ప్రత్యక్షంగా ఈ కీటకాలు సూక్ష్మజీవులను మోసుకవచ్చినట్లు మాత్రం ఇదమిద్ధంగా కనుగొనబడలేదు!"

"ఐనా, మోసుకువచ్చి వుండకూడదూ?"

"ఎందుకు కూడదు? ఇంటిలో తిరిగే ఈగలు, దోమలు, నల్లులు మొదలైనవాటిలో ఏదోఒకటి ఈ రోగ వ్యాప్తికి తోడ్పడే 'దొంగ'లని నా అభిప్రాయం. ఐనా ఈవ్యాధి ఒక్క ఇంటిలో వుండేవారిలోనే ఎక్కువగా వ్యాపించడం, ఇరుగు పొరుగువారికి ఇది వ్యాపించకపోవడం చూస్తే బహుశా ఈ సూక్ష్మజీవులను మోసేకీటకాలు అట్టేదూరం ప్రయాణం చేయలేవని తెలుస్తుంది.

"మరి ఈ విషయాలను కనిపెట్టే శాస్త్రీయమైన పద్ధతి ఏమీలేదా డాక్టర్ "

"అంటురోగాల విషయంలో నిపుణునిగా నా అభిప్రాయం ఏమిటంటే ? " ఆయా ప్రాంతాలకి వైద్యదళాలువెళ్ళి, ప్రత్యక్షపరిశీలన చేయడంద్వారా, అమూల్యమైన అనేక విషయాలు తెలుస్తాయి. ప్రపంచంలో వేరువేరు శీతోష్ణ, పరిసర ప్రభావాలకి లోనైన వేర్వేరు ప్రాంతాలను ఎన్నుకొని, ఈ వ్యాధిని గురించిన పరిశోధనలను జరపడంద్వారా ఎన్నో క్రొత్తవిషయాలు తెలుస్తాయి. ఈ పరిశోధన వ్యాధి విస్తారంగా వ్యాపించిన ప్రదేశాలలోను, వ్యాధి తక్కువగా వ్యాపించిన ప్రదేశాలలోనూకూడా జరపాలి. దాదాపు ఒకేరకపు అలవాటులు, ఒకేరకపు జనంవున్న సమీపప్రదేశాలలో ఈ పరిశోధనలు జరపడం ఎంతైనా అవసరం. ఈ పరిశోధనలు జరిపేటప్పుడు వారి ఆహారం, ఆచారవ్యవహారాలు, జీవనస్థితులు, అక్కడవ్యాపించే ఇతరవ్యాధులు, ఆ ప్రజలలోని రోగనిరోధకశక్తి ఈ విషయాలన్నీ జ్ఞాపకం వుంచుకోవాలి. ఈ సూక్ష్మజీవులే కాకుండా రోగవ్యాప్తికి తోడ్పడే ఇతరజీవులనుకూడా సూక్ష్మదర్శిని క్రిందకు తీసుకురావాలి ! ఈ వ్యాధి వ్యాప్తికి తోడ్పడే ఏచిన్న విషయాన్నీ మనం వదలకూడదు !

" కాని దీనికి చాలాకాలం తీసుకుంటుంది ! "

అవును అనేకమంది శాస్త్రజ్ఞుల జీవితకాలంకూడా సరిపోవకే పోవచ్చును. అయితేనేం ? దానిద్వారా ఈ రోగపు

మూలకారణం శునకి తెలుస్తుందనుకో, ఎన్నిలక్షలమంది జీవితాలు సుఖప్రదంగా మారుతాయి? ఈ సుదినంకూడా వచ్చితీరుతుంది. నన్నడిగితే పూర్తిగా నిరోధింపరానిరోగం అంటూ ఏదీ లేదనే చెప్పాలి!"

ఆశాజ్యోతులలా మెరిసే ఆయనకళ్ళూ ఎంతో ఉత్సాహాన్నిచ్చే ఆయన మాటలూ, మానవజాతికి ఆశాసందేశాన్నిచ్చే ఆయన వాగ్ధార నన్ను ముగ్ధుణ్ని చేశాయి.

తాటిచెట్ల నీడలు క్రమంగా దూరమౌతున్నాయి. డాక్టర్ డోమింగ్యోజ్ వెళ్ళిపోవడానికి లేచారు.

## 25 వ ప్రకరణం

ప్రధానవైద్యశాఖాధికారియైన డాక్టర్ బాండ్ భార్య కూడా క్యూలియన్‌లో వుండడానికి వచ్చింది. బాండ్ సతి ఆకర్షవంతమైన యువతి. ఆమె పేరుగాంచిన కథారచయిత్రికూడా! క్యూలియన్‌లోని ప్రజల పరిస్థితులను వర్ణిస్తు ఆమె వ్రాసిన కథలనేకం ప్రఖ్యాత అమెరికన్‌పత్రికలలో ప్రచురింపబడినాయి—క్యూలియన్‌లోని కుష్ఠురోగుల సహాయార్థం నిధిని సేకరించడానికి అమెరికా వెళ్ళవలసినదిగా గవర్నర్ జనరల్‌వుడ్ ఆమెను కోరాడు. ఆమె దానికి సమ్మతించింది. ఈవార్తవిని కాలనీలో అందరూ సంతోషంలో మునిగితేలారు.

1927 వ సంవత్సరంలో గవర్నర్ జనరల్‌వుడ్ సెలవు మీద అమెరికావెళ్ళాడు. కాని ఆయన అక్కడ మనుష్యు

క్యూబాలో కలిగిన పాతగాయాలకు ఎరమై మరణించాడు. ఆ తరువాత ఆయన కుష్టురోగులకి చేసిన అపారమైనసేవకి చిహ్నంగా ఆయనపేరిట శాశ్వతచిహ్నాన్ని నిర్మించడానికి ప్రయత్నం జరిగింది. క్రమంగా అక్కడిప్రజల సహకారంవలన అనేక కట్టడాలూ. రోడ్లూ నిర్మింపబడ్డాయి. పెద్దహాస్పిటల్‌కి వెనుకగా ఒక సైన్సు రీత్యా తీవ్రపరిశోధనాలయంకూడా నిర్మింపబడింది. దీనిలో అమెరికన్, ఫిలిప్పైన్ డాక్టర్లు కలసిమెలసి పనిచేయడం నాకెంతో ఆనందాన్ని కూర్చింది. కట్టడిపనిలోను నర్సుపనిలోను మా సంఘపువాళ్ళకు పనిదొరకింది. అతిచురుకుగా పురోగమించే ఈ పరిశోధనల ఫలితంగా "మేము విజయాన్ని సాధించాం! కుష్టురోగాన్ని అరికట్టాం!" అని ఇక్కడి డాక్టర్లు ముక్తకంఠంతో అనే శుభదినం రాగలదని నాలో ఒకదృఢమైన నమ్మకం కదిరింది.

ఒకనాటి శనివారం రాత్రి నేను రక్షకభటులైన 'షాగ్' 'మామే' అనే నా కుక్కలతో పచారుచేస్తూండగా హడావిడిగా డాక్టర్ బాండ్ నా దగ్గరకి వచ్చారు. ఆయన చేతిలో బాండ్‌సతి దగ్గరనుంచి వచ్చిన కేబిల్ (Cable) వుంది. దానిని ఆయన నాకు చూపించారు. దానిలో "గవర్నర్ జనరల్‌వుడ్ స్నేహితుడొకాయన 'సేబూ' కుష్టురోగ నివారణాలయంకోసం, లక్షాఎనభై వేల డాలర్లు విరాళం. పనిప్రారంభకాలం కేబిల్‌చేయు' నట్లు ఉన్నది.

డాక్టర్ బాండ్ 'సేబూ'ని గురించి ఎన్నోపర్యాయాలు చెప్తూండేవారు. 'సేబూ' ఫిలిప్పైన్‌దీవులలో రెండవపెద్దపట్టణం.

దీనిలో జనసమ్మర్ధంకూడా చాలాఎక్కువ. క్యూలియన్‌కి వచ్చే కుష్ఠురోగులు ఈ ప్రాంతాన్నుంచే ఎక్కువగా వస్తూండేవారు. డాక్టర్ బాండ్ ఈ ప్రాంతంలోనే ఒకకుష్ఠురోగ నివారణ కేంద్రం ఆధునిక పద్ధతులలో నిర్మించాలని అంటూండేవారు. ఇక్కడ ఒక నివారణ కేంద్రాన్ని నిర్మిస్తే ప్రజలలో వుండేభయం పూర్తిగా తొలగిపోతుందని ఆయన గట్టినమ్మకం. దీనివల్ల రోగులు దూర ప్రదేశాలకి వెళ్ళనవసరంలేదనీ, తమ బంధువులవద్దనేవుండి చికిత్స పొందవచ్చుననీ, ఇక్కడ జరిగే చికిత్సాపద్ధతిని తక్కినవారు కూడా చూసే అవకాశంవుంటుందనీ, దీనివలం ప్రజలలో వ్యాప్త మైన మూఢనమ్మకాలూ, భయాలూ పూర్తిగా తొలగిపోతా యనీ డాక్టర్ బాండ్ అభిప్రాయం. మునుపు రోగులను బలా త్కరించుకొని పోవడంగుండెను. అప్పుడు ఆరోగ్యశాఖ ఇన్ స్పెక్టరులరాకకు వెరచి పారిపోయి డాగియుండడముండేది. డాగిన చోటు చూపించినవాళ్ళకు ఇన్‌స్పెక్టర్లను తమచేతికి దొరకినపుడు కొట్టి చంపివేయుటయు తఱుచుగ జరుగేవి.

ఇటువంటి కుష్ఠురోగులను నేరస్థులవలె దూరప్రాంతాలకి పంపబడే పద్ధతికి ఇంతటితో స్వస్తి చెప్పబడుతుందని నాకని పించింది—— ఈ సంస్థలో నేను పనిచేయడానికి అవకాశం కలిగి నందుకు డాక్టర్ బాండ్‌కి నా కృతజ్ఞతను తెలిపాను.

నా ఆలోచనలొక్కసారి నాశరీరంపైన మచ్చలను చూచిన తొలిరోజులవైపు మళ్ళినాయి. ఆ మచ్చలు ఫలానా అని కనిపెట్టడానికి ఎన్నిఏండ్లు పట్టింది ! ఆ తొలిరోజులలోనే అవి ఫలానా అని కనిపెట్టబడివుంటేనా !......”

డాక్టర్ బాండ్ వెళ్ళిపోయే సమయానికి తెల్లవారు ఝామున అయింది. అప్పుడే చెవులు చిల్లులుపడేలా కోళ్ళు కూస్తున్నాయి. అప్పుడే నాకు నిద్రపట్టింది. ఇంతలో కిటికీవెలుపలినుంచి ఎవరో గట్టిగా పిలుస్తూన్నారు. మరెవరో కాదు; డాక్టర్ బాండ్ ఇంటిలో పనిచేసే కుర్రవాడు (Socorro) సొంకొర్రో; డాక్టర్ బాండ్ ఆ కుర్రవానిచేత ఒకచీటీ పంపించాడు. దానిలో ఇలావుంది.

" నెడ్, నేను నీ దగ్గరనుంచి ఇంటికి వెళ్ళగానే గవర్నర్ జనరల్ స్టిమ్సన్ (Stimson) నాకు పంపిన ఉత్తరాన్ని చూచాను. నన్ను మనిలాకు తీసుకువెళ్ళడానికి రెండువిమానాలు సిద్ధంగా వున్నాయట! ఇది నిజమా? కలా? నాకేమీ తెలియకుండావుంది ! "

తక్షణం నేను, డాక్టర్ బాండ్ చాలా అదృష్టవంతుడనీ, విమానంలో బయలుదేరేముందు ఆయనకి వీడ్కోలు చెప్పడానికి నేను వస్తాననీ " చెప్పవలసినదిగా సొకొర్రోతో చెప్పి పంపివేశాను.

డాక్టర్ బాండ్‌తో 'సొకొర్రో' ఈ విషయం చెప్పాడు.

అప్పటికి బాగా తెల్లవారిపోయింది. డాక్టర్ బాండ్, డాక్టర్ డొమింగ్వెజ్‌లిద్దరూ మసిలేని తెల్లని యూనిఫారాలలో వచ్చి తమ విమానాలకోసం వేచివున్నారు. ఇంతలో ఆసైనిక దళానికి చెందిన విమానాలు రెండూవచ్చి దిగినాయి. విమానాశ్రయాధికారి డాక్టర్ బాండ్, డొమింగ్వెజ్ లిద్దరికే గౌరవ

వందనంచేశాడు. ఆ ఇద్దరూ విమానాలలో ఎక్కి కూర్చొన్నారు. కొద్దినిమిషాలలో అవి అంతరిక్షమార్గాన అదృశ్యమైపోయాయి. సైనికశాఖ వైద్యరంగంలోకూడా వున్నదన్నమాట !!

డాక్టర్ బాండ్ తిరిగి రావడానికి చాలా నెలలుపట్టింది. శరదృతువు ఆఖరికి చేరారు బాండ్, డొమింగ్వెజ్ లిద్దరూ. సేబూలో కుష్టునివారణాలయ నిర్మాణానికి స్థలనిర్దేశంకోసం విమానాలపైన అడవులూ, కొండలూ, లోయలూ వందల కొలది మైళ్ళు అన్నీగాలించారు. ఆఖరికి సేబూనగరానికి పన్నెండు కిలోమీటర్ల దూరంలో (అనగా సుమారు ఏడుమైళ్లు) ఈభవన నిర్మాణానికి స్థలాన్ని నిర్ణయించారు. భవననిర్మాణపు పని ప్రారంభమైంది.

విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే యంత్రాలవద్దనుంచి ఇంటికీ, ఇంటినుంచి కాలనీభవనానికీ, అక్కడనుంచి తిరిగి ఇంటికి తిరగడంలో నేను బాగా అలసిపోయాను. అందుచేత నాకు కారు అవసరమనిపించింది. తక్షణం ఒకమంచిరకం చిన్నకారు తెప్పించాను.

నేను ఆ దీవిలో వున్నన్నాళ్లూ క్రమం తప్పకుండా చికిత్సకి హాజరయేవాణ్ణి. ఇది రెండువిధాలుగా లాభించింది. డాక్టర్లు నాతో చెప్పినదేమిటంటే నన్నుచూచి తక్కినరోగులు కూడా ఆశవదలుకోకుండా చికిత్సకి వస్తున్నారనీ; రెండవది ఈ చికిత్సవల్ల నావ్యాధి ఎక్కువకాకుండా నిరోధింపబడినదనే వూహా నాలోనాటుకుపోయింది. అదిక్రమంగా ఎక్కువౌతూన్నా!! ఈ చికిత్సక్రమంలో నేను ఘట్టాలుదాటాను. (మొదట ఇట్టిశుద్ధ

చాలామూట్రగనూనె వెనుక కర్పూరముతో కలిపినది ఆ పిమ్మట అంతకా నొప్పియివ్వని ఎ_త్తైదు (ద్రావకము నెడ్) ఎడతెరిపిలేని ఇంజక్షన్లవల్ల నాలో తాత్కాలికంగా కొన్ని విపరీతలక్షణాలు కనుపించినా త్వరలోనే నేను మామూలుస్థితికి వచ్చేసేవాణ్ణి.

ఒకనాటి ఉదయం నేను చికిత్సనిమిత్తం హాస్పిటల్‌కి వెళ్ళినప్పుడు వరండాలో ఒక పరిచితవ్యక్తిని చూచాను. ఆపిల్ల డాక్టర్ ఫోన్స్ (Dr. Fonce) తో మాట్లాడుతూంది. ఆమె చేతిలో ఒకపూలగుత్తికూడావుంది. ఆమెతో మాట్లాడాలని దగ్గరికి వెళ్లాను కాని, అంతలోనే ఆమె అక్కడినుంచి మాయమై పోయింది! తరువాత నేను డాక్టర్ ఫోన్స్‌తో మాట్లాడాను.

" డాక్టర్, ఆమె కార్మిన్‌కదూ ? "

" అవును నెడ్. "

" మరి ఆమె ఇక్కడెందుకువుంది. ఆమె రోగం తిరగ పెట్టలేదుకదా ! "

" లేదు, లేదు, నేను ఆమెను ఈమధ్యనే పరీక్షించాను. ఆమె ఆరోగ్యంగానేవుంది. ఆమె స్వంతపనిమీద తిరిగి ఇక్కడికి వచ్చింది. ఆమెతండ్రి చనిపోయాడు. ఆమె సోదరుడు విన్సెంట్ ఇక్కడనే వున్నసంగతి నీకు తెలుసునుకదా మరి క్షమించాలి. నాకు తొందరపనివుంది అంటూ డాక్టర్‌ఫోన్స్ వెళ్ళిపోయారు.

డాక్టర్ ఫోన్స్ ఈప్రశ్న పరంపరలనుంచి తప్పించుకోవాలని ప్రయత్నిస్తూన్నాడు. దీనిలో ఏదో రహస్యంవుంది.

కేరిటా, కార్మెన్ విషయంలో నాకెందుకు వ్రాయలేదు చెప్మా. నేను పోస్టాఫీసుకి వెళ్ళాను. నాకు కొన్ని ఉత్తరాలు వచ్చాయి. అందులో ఒకటి కేరిటా దగ్గిరనుంచి. అందులో ఆమె విశేషాలేమీ వ్రాయలేదు. మా 'వ్యాపారం' ఏలావున్నదీ టామస్ ఏలావున్నదీ మమ్మల్ని చూడాలనీ వున్నదనీ, త్వరలోనే రావడానికి ప్రయత్నిస్తాననీ వ్రాసిందికాని, కార్మెన్ విషయంగూర్చి ఆమె ఒకముక్క-కూడా వ్రాయలేదు.

నేను ఇంటికి వచ్చేసరికి టామస్ ఎవరికీ కనపడకుండా మాపాతఅకౌంటు పుస్తకాలను ముందువేసుకు కూర్చొన్నాడు. పద్దులువ్రాసే విధానం తనకి నేర్చుకోవాలని వున్నదనీ, దానికి నా సమ్మతి తెలియజేయవలసినదనీ భయపడుతూ నన్నడిగాడు. దానికిగాను హెడ్‌క్లార్కును అడిగి పుస్తకాలు తీసుకొని చదువుచున్నాడు. చక్కని లెక్కలవాడగుదువనియు దానిని నేర్పించడం నా భారమని సంతోషముతో ఆశీర్వదించితిని.

జోన్‌క్రుజ్ నన్ను చూడడానికి వచ్చాడనీ, ఆ విషయం చెప్పడం మరచాననీ, తన మందమతికి క్షమించవలసినదనీ టామస్ ఎంతో వినయంగా అడిగాడు.

పడవల రేవుదగ్గర జోన్ నాకు కనిపించాడు. మా పడవలలో ఒకదానికి అడుగున కన్నంపడి, నీరు లోపల ప్రవేశిస్తూన్నదనీ, దానికి తక్షణం మరామత్తు అవసరం అనీ జోన్ నాతో చెప్పాడు.

# 26 వ ప్రకరణం

ఆనాడు కాలనీలోని రోగులను చూడడానికి అందరూ వచ్చేరోజు. రోగుల కుటుంబంలోని జనం, వారి బంధువులూ ఒకరోజున వీరిని చూడడానికి రావడం మామూలైనా నేను సాధారణంగా ఈ విషయంలో అంతగా పట్టించుకోనలేదు. ఈ జనాన్ని తీసుకువచ్చే నావ దగ్గరకి టామస్ వెళ్ళాడు తనకోసం వచ్చేవారెవరూ లేకపోయినా! నేనుమాత్రం నాపాత గ్రామ ఫోనుని బయటికితీసి ఏవో రికార్డులు పెట్టుకుంటూ కూర్చొన్నాను. వాటిలో మునుపు జేన్ వ్రాసిన "మనపాట" వింటూంటే జేన్ నాకు జ్ఞాపకం వచ్చింది.

ఇంతలో కేరిటా గుమ్మాలక్రిందనుంచి నన్ను పిలిచింది. నేను తొందరగా మెట్లుదిగి క్రిందికివెళ్ళి ఆమెవైపు నా చేతిని చాపి, వెంటనే వెనుకకులాగి వేసుకొన్నాను. కేరిటా ఇప్పుడు నావలె కుష్టురోగికాదు. ఆమెను నా చేతితో ముట్టుకొనడానికి నాకు ధైర్యం చాలలేదు.

ఇంతలో కేరిటా తనముఖాన్ని నా ముఖందగ్గరగా తీసుకువచ్చి "ఊరికే ఆలాచేతిని తీసేసుకొంటావేం నెడ్ — మనిద్దరి మధ్య ఈ భయంఏమిటి? అంటూ ముద్దుపెట్టుకుంది."

"క్షమించు కేరిటా, నీవు వస్తానని తెలిస్తే నేను నాదగ్గరకివచ్చి నిన్ను కలసికొనేవాణ్ణి" అన్నాను.

"నీకు తెలియకుండావచ్చి నిన్ను ఆశ్చర్యంలో ముంచాలనే ఈలాచేశాను. బాగాలేదూ?"

"ఇంకా బాగాలేదూ అంటూన్నావా? దివ్యంగా వుంది. మనం ఎప్పుడూ కూర్చొనే మామిడిచెట్టుక్రిందికి వెళదాం నడు కేరిటా"

"నెడ్, ఈ స్థలం ఎంతబాగావుంది! నీవు ప్రతిపని ఎంతో శ్రద్ధగా చేస్తావ్— నీవు చెప్పినది నిజమే అయింది నెడ్— మా కుటుంబంలోని జనంమాత్రం ఏభయమూ లేకుండా నన్ను ఆహ్వానించారు. కాని తక్కినజనం నన్ను దరికి రానీయలేదు. డాక్టర్ బాండ్ డామింగ్వెజ్ లిద్దరూ నాకెంతో సహాయంచేశారు నేను ఆరోగ్యసంస్థలో పని చేస్తున్నాను. నీకేవిషయాన్ని తెలియ జేయవద్దని వారితో చెప్పాను. పెరోల్‌మీద విడుదలచేసిన రోగులలో ఈ వ్యాధి ఏలావున్నదీ పరీక్షించడంనాపని. తమపాక నుండి ఒకతూరి వదలిపోతే వాళ్ళను తిరిగి కనిపెట్టడం ఎంత మాత్రం సులువైనపనిగాదు. మునుపే ఏర్పరిచిన గడువుకాల ములో పునఃపరీక్షార్థమువచ్చి డాక్టరులు చెప్పేలాగు నడచు కోవాలి. పరీక్షలో రోగిము ముందులాగు నిలిచిపోక పురల వృద్ధియగుతుందని Positive కనబడితే పెరోలుమీద వెళ్ళిన వారు తిరుగ కుల్యాలియన్‌కో సీబూకోవెళ్లి అచట నివాసస్థులుగా జేయాలి. ఇదియే అధిక వ్యసనకరమైనపని. నీతి నియమముతో హితము చెప్పాలి. అయితే నేను వాళ్ళతో నొక కష్టురాలుగా నుండి యుండుటచేత నామాటను వాళ్ళు నమ్మేవారు. ఈవిధంగా విడుదల చేయబడినవారిని బయటి ప్రపంచం ఆదరిస్తుందంటావా, నెడ్?"

"ఎందుకు ఆదరించదు? ఏదో ఒకరోజున ఈ వ్యాధి రావడానికి కారణం, దాని నివారణ కనుగొనబడి తీరుతుంది. కాని మొట్టమొదట ఈ 'కుష్ఠు' అనేమాటని వాడడం మాని వేయాలి. ఈవిధంగానే 'క్షయ' విషయంలోకూడా. మొదటి నామము క్షయ అనుదానికి భయపడినట్లు టి–బి–నామమునకు భయపడరు. ఈ వ్యాధినిగురించి ప్రజలు బాగా తెలిసికొన్న తరువాతనే దానివిషయంలో భయపడడం మానివేశారు. కొంచెం మించుమించుగా కుష్ఠురోగం విషయంకూడా అంతే. ఇతర వ్యాధులు సోకినా మనిషిరూపాన్ని మార్చవు కనుక ప్రజలవి అంటే అంతగా భయపడరు. 'కుష్ఠు' అనేపదం ఒకరోగముగా కాకుండా సంఘంలో స్థానంలేని ఒకభయంకర స్వరూపంగా మన వాడుకలోనికి వచ్చిపడింది! ఇది చాలా దురదృష్టకరమైన విషయం.

"అవునునెక్–సంఘం నిన్నూ, నన్నూ, క్యూలియన్ వీధులలో తిరిగే ఈ పిల్లల్నీ ఆలాంటి 'పదం'తోనే పిలుస్తోంది" ఆపదం కేవలం వ్యాధిగ్రస్థులను తెలుపుటయేగాదు. సంఘధర్మానికి వ్యతిరేకచర్యల వాడనియు నీచుడు బాహ్యుడనియు ధ్వని.

ఈ విషయంలో మనకి డాక్టర్ల సహాయం ఎంతగానో కావాలి కేటా. .మానవజాతిని ఈ వ్యాధి క్రూరదంష్ట్రల నుంచి రక్షించే నిపుణులు ఇతోధికంగా రావాలి. దీనికంటె ముఖ్యమైన విషయం 'కుష్ఠు' అనే మాట వాడకుండా చేయాలి!"

కేరిటా వెకివెక్కి ఏడుస్తూంది. ఎన్నో క్లిష్టసమయా లలో నేను చూచాను. కాని పసిపిల్లలా ఈవిధంగా ఏడవడం అదివరకెన్నడూ నేను చూడలేదు.

కేరిటా తేరుకొనగనే—నేను ప్రస్తుతం రోగులకి చేస్తూన్న సేవ నాకెంతో తృప్తిని ఇస్తూంది, ఈ విషయం నీతో చేప్పా లనే వచ్చాను నెడ్; నేను రావడానికి మరియొక కారణం కార్మెన్ ఇక్కడ వుండడం.'' అన్నది కేరిటా. ఆ సంగతి నాకు తెలుసును

"నాకీసంగతి ఎందుకు వ్రాయలేదు కేరిటా? ఆమెలో వ్యాధిలక్షణాలు పూర్తిగా నిలచిపోయినట్లు డాక్టర్. పోన్స్ చెప్పారు మరి ఇంకా ఇక్కడేఉన్నదేం వ్యాధి నిరోధింపబడ్డాక కూడ ఇక్కడవుండడం తెలిసి తక్కువపని......"

"తొందరపడకు నెడ్—కార్మెన్ ఇక్కడ వుండడానికి ఒక ముఖ్యకారణంవుంది. కార్మెన్, టామస్‌లిద్దరూ గాఢంగా ప్రేమించుకొంటూన్నారన్న సంగతి నీకు తెలియదూ? టామ స్‌ని పెళ్ళిచేసుకొనడానికే కార్మెన్ తిరిగి ఇక్కడికి వచ్చింది.— వారిద్దరూకలసి సంసారం చేయకపోయినా వివాహం చేసుకోడా నికే నిశ్చయించుకొన్నారు.

"" తొందరపడకునెడ్ — ఈకథని అనేకదృక్కోణాల నుండి చూడవలసివున్నది. టామస్, కార్మెన్‌లిద్దరూ ఈ నియ మాల విషయం బాగా ఎరుగుదురు. ఈ నియమాలంటే ఇద్ద రికీ మంచిగౌరవం వున్నదికూడా, కాని వారిద్దరూ ఏమైనా పెళ్ళి

చేసుకోవడానికే నిశ్చయించుకొన్నారు. కార్మెన్‌కి ఒక్క తమ్ముడు తప్ప వేరే ఇంకెవరూ లేరు. తల్లిదండ్రులు చచ్చిపోయారు. ఆ తమ్ముడైనా తన మామదగ్గరా, అత్తదగ్గరా వుంటూన్నాడు ఆ ముగ్గురూ కార్మెన్‌ని దగ్గరకు చేరనీయరు. అప్పటినుంచీ ఆమె నాదగ్గరే వుంటూంది. ఎంబ్రాయిడరీ కార్మెన్ ఎంతో చక్కగా చేస్తుంది. వ్యాధికి గురియైన తనవ్రేళ్ళతో ఈ పని అంతవేగంగా చేయలేకపోయినా దానిద్వారా కొంతడబ్బు సంపాదించుకొంటూంది. టామస్‌కోసం ఆమె ఎంతో వేదనపడుతూంది. ముదుసలియైన టామస్ తల్లితో గడపడంద్వారా కార్మెన్ తనవిచారాన్ని కొంతవరకూ మరచిపోగలుగుతూంది. టామస్‌తో పెళ్ళి అవగానే కార్మెన్ టామస్ తల్లిదగ్గరికి వెళ్ళిపోయి ఆమెకి సేవచేస్తు వుంటుంది. టామస్ వారిద్దరికీ సహాయం చేస్తుంటాడు ''

ఈకథవిని కొద్దిక్షణాలవరకూ నేను మౌనంగా ఆలోచిస్తువుండిపోయాను. కేరిటాకూడా మౌనంగా కూర్చొన్నది—ఇదివరలో ఈ వ్యాధికి గురియైనవారికి ఎన్నిసమస్యలుంటాయో అన్నిటిని గురించీ నేను అనుభవంమీద తెలిసికొన్నాను. కాని ఇది నాకు క్రొత్తగాకే కనుపించింది. టామస్—నాయనా...''

"కార్మెన్ టామస్‌కోసం వేచివుండి, అతని తల్లికి సేవ చేస్తూంటుంది, నెడ్."

"టామస్‌కోసం వేచివుంటుందా? దాదాపు ఇరవై సంవత్సరాలనుంచి టామస్ ఇక్కడ వుంటూన్నాడు కదా.

తెలివితక్కువది కాకపోతే ఈ దీవినివదలి టామస్ తిరిగి వస్తాడని ఏలా అనుకొంటుంది కార్మెన్ ? ”

“ ఆమె ఈ విషయమై డాక్టర్లతో సంప్రదించింది. డాక్టర్. జోన్స్‌తో కార్మెన్. వుండడం నీవు చూడనేచూచావు కదా ? ఆమె విషయంలో డాక్టర్లు ఎంతో సానుభూతితో మాట్లాడారు. టామస్ వ్యాధి డాక్టర్లకే ఆశ్చర్యాన్ని కలిగిస్తూంది. అతనిలోవ్యాధి. వ్యాపించే లక్షణాలు కనపించక పోయినా వైద్యపరీక్షలో ఎప్పుడూ శరీరంలో వ్యాధిలక్షణాలు వుండడాన్నే సూచిస్తూంది. ముందుముందు టామస్ వ్యాధి నుంచి విముక్తుడౌ తాడనే గట్టినమ్మకం డాక్టర్లకంటె కార్మెన్‌కే ఎక్కువగావున్నట్లు తోస్తుంది. ఆమె ఈ విషయంలో ఎంతో సంతోషంగావుంది. టామస్, కార్మెన్ లిరువురూ ఎంతగాఢంగా ప్రేమించుకొంటూరంటే, తమ వివాహం చట్టసమ్మతంగా జరిగితేనేగాని తృప్తిపడేట్లులేరు. వారిప్రేమ బంధాలటువంటివి!! ఏదో ఒకనాడు టామస్ వ్యాధి తప్పక తగ్గుతుందని కార్మెన్ మనస్ఫూర్తిగా నమ్ముతూంది. ఆమె నమ్మకాన్ని ఎవరు కాదనగలరు ? తన భవిష్యత్తుమీద తనకు నమ్మకం వుండటాన్ని ఎవరూ కాదనలేరుకదా ? ”

“ ఆ బల్లపై నవున్న నా సంతకంవైపు అప్రయత్నంగా నేను చూచాను. దాదాపు పన్నెండు సంవత్సరాలక్రితం నేను పెట్టిన సంతకం అది ! ఆశతో నేను చేసుకొన్న సంధికి అది ” చిహ్నం !!

కేరిటా నేనేమంటానో అని మౌనంగానే వేచివుంది. నా మౌనసమాధినుంచి తేరుకొనడానికి నాకు కొంతసేపు పట్టింది.

"కేరిటా ఆ దొంగలిద్దరూ ఏరీ? బహుశా నీవే ఆ ఇద్దరినీ ఎక్కడో దాచివుంటావు. ఆ ఇద్దరకీ నా ఆశీర్వచనాలు చెప్పాలి. వారిని కొంచెం పిలుద్దూ."

"నెడ్, నీవు ఊహించినది నిజమే. అంటూ కేరిటా లేచి, వరండాదగ్గరకివెళ్ళి టామస్‌నీ, కార్మెన్‌నీ పిలిచింది."

మరుక్షణంలో టామస్, కార్మెన్ లిరువురూ అక్కడికి వచ్చారు.

"టామస్, నీవూ కార్మెన్ వివాహం చేసికోబోతున్నారట కాదూ? కేరిటా మీపెళ్ళికే వచ్చానని చెప్పింది నిజమేనా?"

ఇంతలో నేను కార్మెన్‌వైపు తిరిగాను. చిన్నదైనా కార్మెన్ ఎంత ధైర్యవంతురాలు! ఆమె చేతిలోవున్న పూలగుత్తి, వ్యాధికి గుఱికాగా మిగిలిన ఆమె వ్రేళ్ళని కప్పివుంచింది!"

"అమ్మా కార్మెన్, నీకు నా దీవనలు—కేరిటా, ఈనాటకం అంతా నడిపిస్తూన్నది నీవే. మరిపెళ్ళి ఎప్పుడో దాచకుండా చెప్పు"అన్నాను.

"రైజల్‌డేనాడే వివాహం నిశ్చయంచేశాం. నేను కూడా ఆరోజువరకూ ఇక్కడే వుండడానికి నిశ్చయించుకొన్నాను" అన్నద కేరిటా.

ఒకవైపు పెళ్ళిపనులు జరుగుతూండగా, నా ఆలోచన అంతా టామస్‌ని గురించే! డాక్టర్లు తమ శక్తివంచన లేకుండా టామస్‌కి చికిత్సచేస్తున్నారు. అయినా ఎందుచేతనో నా మనస్సుకి తృప్తిగాలేదు. ఈ విషయంలో నేను డాక్టర్. టబోరడాతో (Dr. Taborada) దీర్ఘంగా చర్చించాను.

"టామస్ నాతోనే ఇక్కడికి వచ్చాడు! కాని టామస్‌లో మార్పేమీలేదు. అతని శరీరంమీద కొద్దిగా మాత్రమే రోగపు చిహ్నాలు కనపడుతూన్నాయి, అవి మొదట ఇక్కడికి వచ్చినప్పుడున్నవే! అయినా డాక్టర్ పరీక్ష జరిగినప్పుడల్లా ఫలితం రోగలక్షణాలు శరీరంలో వున్నాయనే తేలుతూంది!" ఈ విషయంలో మీ ఉద్దేశ్యం ఏమిటని డాక్టర్. టబోరడాని ప్రశ్నించాను.

"టామస్‌లాగే వున్నవాళ్ళు ఇంకావున్నారు. ఒక్కొక్కప్పుడు జీవితాంతంవరకూ ఈ లక్షణాలతో వుండవలసివచ్చే రోగులు కనపడుతూంటారు. టామస్‌లాంటివారు మనిలా వీధులలో తిరుగుతూన్నా ప్రజలు మామూలు మనిషిలాగే భావిస్తారు. అయినా వీరివల్ల సంఘానికి రోగం వ్యాపించే భయం వుండనేవుంది. ఒక్కొక్కప్పుడు టామస్‌లాంటివారూ, రోగం పూర్తిగా తగ్గిపోయినదని విడుదలచేయబడినవారూ పైకి స్పష్టంగా కనపడే కుష్ఠురోగులవలెనే సంఘంలో దూరంగా వుంచబడుతూంటారు. అలాంటి పరిస్థితిలో వీరిమనుగడ అతిదయనీయంగా వుంటుంది. నేను జావా (Java) వెళ్ళినప్పుడు (Surabaya) సూరబాయాలోని కుష్ఠురోగ చికిత్సాలయంలో

ఒకముదుసలిని చూచాను. రోగలక్షణాలు అంతగా పైకి కన పడకపోయినా అతడు నలభై సంవత్సరాలుగా అక్కడ వుంటూ న్నాడు!" అన్నారు డాక్టర్ టబోరడా.

నలభై సంవత్సరాలే! తిరిగి నాకు బల్లమీద నేను పెట్టిన సంతకం జ్ఞాపకంవచ్చింది. ఆశతో నేను సంధిచేసుకొన్నాను. టామస్ విషయంకూడా అంతే.

నేను ఇంటికివెళ్ళి, తరువాత సముద్రపుటొడ్డుకి వెళ్లాను. టామస్ భావినిగురించిన సమస్య నాకు ఆదుర్దాగావుంది. ఇక్కడ వున్నంతకాలం టామస్ నా రక్షణలో వుంటాడు. ఈ మధ్యనే లెక్కలు సరిచూడడం నేర్చుకొన్నాడు. నా లెక్కలనుజూడబట్టి దానికి నేను ఎక్కువ జీతం ఇస్తున్నాను. ఇప్పుడు అతని జీవితంలో కార్మెన్ అడుగుపెట్టింది. ఆమెను పోషించే బాధ్యతకూడా టామస్‌మీద పడింది. ఇంతవరకూ టామస్ తల్లికి కొంతడబ్బు పంపిస్తున్నాడు. ఇప్పుడు టామస్‌ని బాగా తర్ఫీదుచేసినట్లైతే మా వ్యాపార నిర్వహణలో తానుకూడా పాల్గొనే అవకాశంవుంది.

ఇప్పుడు మా వ్యాపారాన్ని వృద్ధిచేయడంలో మేము నిమగ్నులమై వున్నాము. కొత్తయంత్రాలు నెలకొల్పబడగానే ఆకాలనీలోని వారికి రెఫ్రిజిరేటర్లను నడపగలిగే విద్యుచ్ఛక్తిని మేము సరఫరా చేయగలుగుతాం. కాని అమెరికనులవలె ఈ దీవిలో మంచుగడ్డ వాడకంలో ఫిలిప్పైన్ దేశస్తులు అంతగా అల వాటుపడినవారుకారు. మా వ్యాపారంలో పనిచేస్తున్నవారు కొందరు, కొద్దిమంది ఫిలిప్పైన్ డాక్టర్లుతప్ప ఇతరులు వీటిని ఉప

యోగించడానికి అంతగా సుఖంగాలేదు. చికిత్స పొందు తూన్న రోగులు వీటినిగురించి అంతగా పట్టించుకోలేదు. విద్యుచ్ఛక్తి రావడంతోనే చౌకగా రేడియో సెట్లను కొనడానికి కొందరు సిద్ధపడ్డారు.

టామస్ వివాహం 'రైజల్ డే' నాడు జరుపడానికి నిశ్చయింపబడింది. జోస్ రైజల్ ని ఉరితీసిన ఆదినం అంతసంతోషకరమైనదినం కాకపోయినా, ఆనాడు ప్రతిఒక్కరికి గర్వించదగిన దినం. జోస్ రైజల్ లిమోనార్డో వారినుంచీ, బెంజమిన్ ఫ్రాంక్లిన్ లకోవకు చెందినవాడు. అతని దేశభక్తి నిరుపమానం. రైజల్ తిరుగుబాటును లేవదీశాడనే నెపంతో స్పానిష్ యార్డులు అతనిని బంధించి, కాల్చి చంపివేశారు. అంతేకాక రైజల్ చరిత్రకారుడూ, కవీకూడా, ఆతడువ్రాసిన "నోలీమేటాంగేరే" నన్ను తాకవద్దు అనేవాక్యాన్ని గేలిచేసిన పుస్తకమే స్పానిష్ యార్డులు అతనిని చూపడానికి కారణమంటారు. రైజల్ శిల్పి, మానవచరిత్రకారుడు, జంతుశాస్త్రజ్ఞుడు, నవలారచయిత, బహుభాషావేత్త, విద్యావేత్త, వాస్తుశాస్త్రంలోనిధి మనుష్య ప్రతిమలు గేలిబొమ్మలు లిఖించేవాడు. వానినవలలు కరుణారస పూరితములై మనోహరించునవి, వాటి ప్రసిద్ధిదీవులను దాటినవి. విద్యావిధానజ్ఞుడును సివిల్ ఇంజనీరును. అతనిని మిండానోదీవికి (Mindano) గొనిపోయ్యారు; అక్కడ ఒకబడి క్రొత్తమాదిరిలో స్థాపించి ఆ వూరికి నీటిసరఫరాకు వాటర్ వోర్కు ప్రతిష్ఠించాడు. క్యూబాలో (Keblow fever) పచ్చకామాల జ్వరము రేగుచుండునవుడు హాస్పిటల్ పనికి వలంటీరుగ పనిచేయడానికి

అనుజ్ఞ పొంది బార్సిలోనా (Barcelonas) దోవద్వారా వెళ్ళు చుండగా దారిలో బంధింపబడి మనిలాకే తిరుగకొనిపోబడెను. అతడు ఫోర్ట్ శాంటియాగో (Santiago) జైలులో బంధింపబడి ఏడువారాల ఒంటరివాసము తరువాత నేరమేమీ ఋజువు కాకుండానే విచారణకు వకీలుసాయం నిషేధించి నేరస్థుడని తీర్పుపై కాల్చి చంపబడ్డాడు.

ఈ దీవులలో రైజల్ "ఫిలిపైన్ జార్జ్‌వాషింగ్టన్" అని ప్రఖ్యాతిచెందాడు.

టామస్ పెళ్ళికి ఒకరోజు ముందుగా మా యంత్రాగారంలో పనిచేసే వారందరూ సమావేశమై టామస్‌కి పెండ్లి కానుకగా మా కంపెనీలో కొన్ని షేర్లు ఉచితంగా ఇవ్వడానికి సమ్మతింపవలసినదిగా కోరుతూ జోస్‌క్రజ్‌ని నాదగ్గరికే పంపారు. ఈ ఏర్పాటుకి అందరూ ఎంతో సంతోషించాము. టామస్ ఒక గృహస్థు కాబోతూన్నందుకూ, సంఘంలో అతనికొక సముచితస్థానం లభించినందుకూ, అతనిభవిష్యత్తు ఉజ్వలంగా వుంటుందనే అభిప్రాయాల్ని అందరూ వ్యక్తంచేశారు.

వివాహమహోత్సవం మధ్యాహ్నంవేళ మామిడిచెట్ల క్రింద ఎంతో వైభవంగా జరిగింది. ఆకాలనీలో సగంమందికి పైగా పెండ్లికి వచ్చారు. అంతేకాక ప్రత్యేకంగా ఆహూతులైన ఇరువదిమంది బాలికలు కార్మెన్‌తో ఇదివరలోవున్న వారు వచ్చారు, టామస్ క్లబ్ స్నేహితులుకూడా వచ్చారు. ఆ తరువాత చక్కని సంగీతం వినిపిస్తుండగా టామస్, కార్మె

న్లు ముందు దారిలేయగా జల్లుజల్లుగా అందరూ నాట్యం చేశారు—నాట్యం తరువాత చక్కగా అలంకరింపబడిన మోటార్ శకటంపైన టామస్‌నీ, కార్మెన్ ఊరేగించారు. ఎత్తైన పీఠంమీద కార్మెన్ కూర్చొనివుండగా, టామస్ ఆమె పాదాలదగ్గర కూర్చొనేలాచేశారు. ఈ విధంగా కూర్చొనడం అందరికీ నవ్వు పుట్టించింది.

## 27 వ ప్రకరణము

వాల్టర్‌సింప్సన్ మమ్మల్నివిడచి వెళ్ళిపోతూన్నాడు. మూత్రపిండాల వ్యాధితో చాలా సంవత్సరాలు సింప్సన్ బాధ పడ్డాడు. మెదడుకు సంబంధించినవ్యాధి తొలుత మనిలాలో వ్యాపించి, తరువాత క్యాలియన్‌కీకూడా కొలదిగా వ్యాపించింది. సైనికదళంలో పనిచేస్తూన్న ఒక డాక్టర్ సలహాప్రకారం సింప్సన్ శాన్‌లజారోలో కొద్దినెలలపాటు వున్నాడు. కాని ఆ వ్యాధికి తట్టుకోలేక కొద్దిరోజులతరువాత అతడు మరణించాడు.

వాల్టర్‌సింప్సన్ స్థానంలో మా వ్యాపారనిర్వహణానికి జోస్‌ఫ్రిక్‌నీ, విక్టర్ కేబిసన్ (Victor Cabison)నీ నియమించాం. టామస్ నా ప్రతినిధిగా అంతకు ముందునుంచే పని చేయసాగాడు.

కొన్నిరోజుల తరువాత డాక్టర్‌బాండ్ తనవైద్యశాలలో తనను చూడవలసినదిగా నాకు కబురు పంపించారు. ఆ క్రితం

రోజునే నేను చికిత్సకోసం మామూలుప్రకారం అక్కడికి వెళ్ళాను. ఇంత తొందరలో ఆయన నాకోసం కబురుపంపించడం నాకు ఆశ్చర్యమేసింది.

తక్షణం ఆయన్ని చూడడానికి వెళ్ళాను.

"నెడ్, ఈనాటిఉదయమే నీ'కార్డ్' నేను చూచాను. నీగుండె విషయంలో నాకు సంతృప్తికరంగా లేదని చెప్పడానికి విచారిస్తూన్నాను" అన్నారు డాక్టర్ బాండ్.

"అసలు సంగతి దాచకుండా చెప్పండి. నాకు నిజం తెలియాలి. నాగుండె అంత చెడ్డపరిస్థితిలో వుందా?"

"ఏమంత ఆరోగ్యకరమైన పరిస్థితిలో లేదు నెడ్; సామాన్యమైన తేలికపని చేస్తే అంత ఇబ్బందిలేదు కాని, అలసిపోయే పనులు చేయకూడదు.

"వేటాడడం?"

"అసలు పనికిరాదు"

"నన్నుపూర్తిగా ఫించను పుచ్చుకోనేలా చేస్తున్నారన్నమాట."

"అలాకాదుకాని నీశరీరం విషయంలో జాగ్రత తీసుకోవాలి" అన్నారాయన.

మరుసటి సంవత్సరం శాన్‌లజాన్‌లో నాకెంతో సహాయకారిగావున్న డాక్టర్ రావినో క్యూలియాన్‌కి వచ్చారు.

బొద్దుగా, బట్టతల, మంచిచురుకుగా డాక్టరు రాబిన్ యువకునిలా ఉత్సాహంగా వుంటాడు. క్వ్యాలియన్‌కి రాగానే ఆయన జాక్ బాండ్ నాకు చేసిన సేవ నేనెన్నటికీ మరువలేను. ఇన్నివిధాల నాకు సహకారం లభించి నాఆరోగ్యం వేగంగా క్షీణించిపోతూంది. ఇన్నాళ్ళుగానేను కంటూన్నకల సమాప్తమైపోయింది. నేను ఇంటిదగ్గర బయలుదేరి రైలుపెట్టెలో కూర్చొని కిటికీకుండా మాపూరివైపు చూస్తూ, నారోగం పూర్తిగాతగ్గి త్వరలోనే మాఇంటికి వస్తాననీ, ఏభయములేకుండా నలుగురితో కలసిమెలసి తిరుగుతాననీ, ఇంకొకరికి నావ్యాధిని వ్యాపించకుండా, నిర్భయంగా మసలుతాననీ, పదిమందిలో తిరగడానికి ఇప్పటిలా సిగ్గుపడవలసిన అవసరం వుండదనీ ఎన్నో కలలు గన్నాను. నా ఆశలన్నీ నిరాశలై పోయాయి. పాతిక సంవత్సరాలు కుష్ఠురోగిగా జీవితాన్ని గడపవలసివచ్చింది.

ఎన్నోరాత్రులు ఒంటరిగా వరండాలో కూర్చొని, కిటికీగుండా, మిలమిల మెరిసే నీటివైపు చూస్తూ, గడచిన జీవితాన్ని గురించి ఒక్కొక్కఘట్టాన్నే జ్ఞాపకంచేసుకొన్నాను. ఏ ఏకాంతప్రదేశంలో, ఏదృక్పథంలో చూచినా నేను నాజీవితాన్ని విజయవంతంగానే గడిపానని చెప్పాలి. ఆర్థికదృష్టిపథంలో చూచినా అంతే. నేను నివసించేస్థలం ప్రభుత్వానిదైనా, ఇల్లు మాత్రం నేను నిర్మించినదే. అదికాక దాదాపు నలభైవేల వరకూ వస్తురూపంలోనూ, రొక్కంగానూ నిలవవుంది. ఇది కాక నేనువుండేచోట నలుగురిలో ఎంతో గౌరవంగా నేను కాలక్షేపంచేస్తున్నాను, కష్టంలోనూ, సుఖంలోనూ ప్రాణమిచ్చే,

ఈ స్నేహితులమధ్య, హాయిగా, సంతృప్తిగా నేను కళ్ళు మూయగలను.

ఒకనాటిరాత్రి హఠాత్తుగా మాఇంటికి వెళ్ళిపోవాలని అనిపించింది. మాదేశపు సువిశాలమైన పచ్చికబయళ్ళలో ఉదయించే సూర్యుని బంగరుకిరణాల్నీ, ఆమనోహరదృశ్యాన్ని చూడాలని నామనసు తహతహలాడింది. నాదేశస్థుల్నీ, నా జనాన్నీ చూడాలనేవాంఛ నాలోఉరుకులువేసింది. సాధ్య మైనంత త్వరలోనే ఈవిషయాన్ని బాండ్‌తో చెప్పాను.

"నేనీవిషయంలో చేయగలిగిన సహాయం ఏదైనా వుందా?" అని ఆయన నన్నడిగారు.

"నన్ను కార్విల్లీకి, మార్చడానికి చేయవలసినది డాక్టర్ విస్టన్‌కి వ్రాయవలసిందని ఆయనని కోరాను.

తక్షణం డాక్టర్ విస్టన్‌కి ఉత్తరం వ్రాస్తానని బాండ్ చెప్పారు.

ఆఉత్తరానికి సమాధానం రావడానికి కొద్దినెలలుపట్టింది. బాండ్ ఆ ఉత్తరాన్ని నాదగ్గరకు తీసుకువచ్చారు. యునై టెడ్‌స్టేట్స్ ఆరోగ్య సంస్థవారితోనూ, యుద్ధశాఖవారితోనూ తానీవిషయం చర్చించానని, ఈవిషయంలో జరుగవలసిన ఏర్పాటులన్నీ జరిగినాయనీ, నేను మనిలాకివెళ్ళి అక్కడనుంచి సైనికదళానికి చెందిన ఓడమీద శాన్‌ఫ్రాన్సిస్కోకీ, అక్కడి నుంచి రైలుమీద కార్విల్లీకి వచ్చేఏర్పాటు చేయబడిందనీ" ఆవుత్తరంలో వుంది.

"మరుసటినెల పదిహేనవతేదీని ఆ ఓడ బయలుదేర బోతూంది. కాని ఆసమయాని తాను ఇండియాలో జరిగే ఒక మహాసభలో పాల్గొనడానికి వెళ్ళవలసివున్నదనీ, అందు చేత వీడ్కోలు చెప్పడానికి అవకాశం వుండదనీ" ఆయన అన్నారు.

ఆనాడు ఆయన నాతో ఎంతోసేపు వున్నారు. అంత వరకూ మేము గడపిన దినాలనిగురించి ఎంతోసేపు మాట్లాడు కున్నాం ఆఖరికి ఆయన వెళ్ళిపోయేముందు ఎంతో బాధ పడుతూ "ఇక సెలవు జాక్!" అన్నాను.

"సెలవునేడ్ నీకు మేలుకలగాలి!" అంటూ ఆయన వెళ్ళిపోయారు.

విన్సన్‌వుత్తరం నాలో ఒక వింత ఉద్రేకాన్నిపుట్టించింది. నేను నాదేశానికి వెళ్ళిపోతున్నాను. నాదేశపు సైనికదళం తనరక్షణాక్రింద నన్ను నాదేశానికి తీసుకుపోబోతూంది. నా యింటికి వెళ్ళడం ఎంతో వుత్సాహాన్ని కలిగించింది.

## 28 వ ప రి చ్ఛే దం

ఆ నాటి మధ్యాహ్నం మా ఇంటికి చేరుకొనే దీర్ఘ ప్రయాణంలో మొదటి మజిలీ ఈ దీవులమధ్య తిరిగే చిన్న నావలో చేయాలి. టామస్ వరండాలో మాకోసం ఉదయపు భోజనం సిద్ధంచేశాడు. వేగంగా, మౌనంగా టామస్ ఇంటిలో అటూఇటూ తిరగడం నేను గమనించాను. మధ్యమధ్య నావైపు

చూస్తున్న టామస్ చెమ్మగిలిన కళ్ళనికూడా నేను గమనించాను మేన్సన్‌తోనూ, మతగురువుతోనూ చెప్పి నురీవెళ్ళాలని బయలు దేరాను. ఎడబాయని స్నేహితులుగా ఈ ఇరువురూ నాకెనలేని సహాయం చేశారు. నాక్షేమంకోసం ఎంతగానో పాటుపడ్డారు. నాకారుని జోస్‌కిచ్చాను. ఈ ప్రయాణంలో నేను నడచే వెళుతాను.

నేను ఇంటికి తిరిగి వచ్చేసరికి దూరాన సముద్రంలో నిలిచివున్న 'డాన్‌జువాన్' కూత పెడుతూన్న ధ్వని దూరంగా, సన్నగా వినపడుతూంది. ఇక నేను బయలుదేరడానికి ఒక్క గంట వ్యవధిమాత్రమే వుంది. నాకోసం టామస్ వరండాలో వేచివున్నాడు.

"మీ మూటలు సిద్ధంగా వున్నాయి. వాటిని నావ దగ్గరకి చేరివేయమంటారా?"

"వద్దు టామస్, నేను వాటి ఏర్పాటుచేశాను. నేను ఎప్పుడూ నీవిషయమే ఆలోచిస్తూ వుంటాను. ఈ ఇల్లు నీది. నీవు క్యూలియన్‌నివదలి వెళ్ళేవరకూ ఈ ఇంటిలోనే వుండాలి."

సాధారణంగా నదురూ బెదురూలేకుండా మాట్లాడే టామస్ నోటనుండి ఆ సమయంలో మాటరాలేదు.

"మీరు ఎప్పుడూ నేనంటే ఎంతో దయతో చూచే వారు. ఈ ఇల్లు ఎప్పుడూ మీదేనండి. అన్నాడు టామస్."

రోగాన్ని ఒంటరితనాన్ని, నిస్పృహనీ, ఒకటేమిటి మానవుడు ఏయే దుష్టశక్తుల నెదిరించి పోరాడాలో, అన్నిటినీ నిర్జించి

నిలువగలగడానికి తోడ్పడిన ఇల్లది! ఆ ఇల్లు నాదని చెప్పుకో డానికి నేను గర్విస్తున్నాను.

ఇంతలో 'డాన్‌జువాన్' ఇంకొక కూతపెట్టింది. నేను బయలుదేరడానికి ఇంకొక అరగంటమాత్రమే వ్యవధివుంది. టామస్‌గేటుదగ్గర నిల్చుని వున్నాడు. ఇంతలో నిశ్శబ్దానికి భంగం కలిగించే మోటారుకారు హారన్‌చప్పుడు వినపడింది. నా పాతకారులో జోస్ వచ్చాడు—ఇప్పుడది జోస్‌దే—విసాయన్, టాగలాగ్, ఖలోనో‌భాషలలో ఎరుపు, తెలుపు, నీలి రంగుల జెండాలపైన నాకు శుభకాంక్షలను తెల్పుతూ కారుకి ముందూ, వెనుకా. ప్రక్కలా కట్టబడినాయి. నా ప్రయాణం సుఖంగా జరగాలనికూడా వాటిలో కొన్నిటిపైన వ్రాయబడింది. జోస్ తొందరలో బ్రేకుల్ని ఒక్కసారి నొక్కడంతో కీచుమని శబ్దంచేస్తూ కారు ఇసుకలో కొంతదూరం జారింది!

"పడవలరేవుకి నిన్ను తీసుకువెళ్ళడానికే వచ్చాను, నెడ్;" అంటూ కారు బయటికివచ్చి, గౌరవసూచకంగావంగి, కారు తలుపు నా కోసం తెరిచాడు జోస్—నేను వెనుకవైపుకి చూస్తూ గేటుదగ్గరికి వెళ్ళాను.

టామస్, నాయనా, ఇంతవరకూ నేను అంతగా ప్రార్థించకపోయినా, నీకు వ్యాధి నయమౌతుందనే కార్మెన్ ఆశ సఫలం కావాలనీ, మీ ఇద్దర్నీ త్వరలోనే ఏకం చేయాలనీ నేను భగవంతుణ్ణి ప్రార్థిస్తాను."

టామస్ పెదిమలనుంచి వచ్చేమాటలు నాకు వినపడ లేదు.

"సెలవు తీసుకొంటానండి" అన్నాడు టామస్.

నాలో పొంగిపొరలివచ్చే దుఃఖం పైకి తెలియకుండా నవ్వసాగాను. జోస్‌ని ముందుభాగంలో కూర్చోపెట్టి, కారు వెనుక తలుపులువేసి, నేను టామస్‌వైపు చేతులనాడిస్తూ కారులో కూర్చొన్నాను. హారన్ ధ్వనిచేస్తూ కారు బయలు దేరింది.

వీధులన్నీ నిర్మానుష్యంగా వున్నాయి. దీనికి కారణం నాకప్పుడు తెలిసింది. నాకు వీడ్కోలు చెప్పడానికి చాలమంది పడవలరేవుకి చేరుకొన్నారు. పడవలరేవుదగ్గర జోస్ కారుని ఆపగానే "నాయకునికి జేజేలు" అనే గీతాన్ని బాండ్‌దళం ఆలపించింది. అక్కడికిచేరిన సమూహం జయజయధ్వనాలు చేయసాగింది. రేవులో చిన్నచిన్న పడవలెన్నో గుమిగూడి వున్నాయి. కౌన్సిల్ అధ్యక్షుడు సెబాస్టియన్ ఇలినాస్ (Sebastion Elanos) మా విద్యుత్సరఫరా ప్రణాళికద్వారా ప్రజలకి ఎంత సదుపాయం కలిగినదీ, ప్రజలెంత కలసిమెలసి మేము పవిత్రంగా పనిచేసినదీ, నేను వెళ్ళిపోవడంవల్ల ఎంత తీరని లోటు కలుగబోతున్నదీ వివరిస్తూ తన ప్రసంగాన్ని ముగించారు.

ఈదీవిని విడచి వెళ్ళడంద్వారా జీవితాంతంవరకూ తనతో కలసి పనిచేసిన స్నేహితులకు దూరంకావడం ఎంతగా నన్ను బాధిస్తుందో నాసమాధానంలో ముక్తసరిగా వ్యక్తం

చేశాను. అక్కడచేరిన జనమంతా ఒక్కక్షణంపాటు నిశ్శబ్దంగా వున్నారు నాసమాధానం పూర్తిఅయేవరకూ. అప్పుడు అధ్యక్షుడు, రక్షకదళాధిపతి, జోస్ నన్ను కాలనీపడవ లోనికి తీసుకువెళ్ళాడు. మరుక్షణంలో యంత్రసహాయంతో పడవ బయలుదేరింది. ఒడ్డుమీద జనం హర్షధ్వానాలుచేశారు. రేవులో నిలచిన చిన్నచిన్న పడవలన్నీ కొంతదూరంవరకూ గౌరవసూచకంగా మాపడవని సాగనంపడానికివచ్చాయి. ఆఖరుసారిగా కుష్టురోగుల ఆశ్రయమైన క్యూలియన్‌వైపు చూచాను.

పదినిమిషాలలో 'డాన్‌జువాన్' పైకిచేరుకొన్నాను. ఓడకి వెనుక భాగంలో నాకొకస్థలం ప్రత్యేకింపబడింది. క్యూలియన్‌లోవుండే ఆరోగ్యవంతులందరూ నన్నుచూడడానికి వచ్చినట్లుంది! డాక్టర్ ఎబోరడా డాక్టరు రాపినోలిరువురూ నావైపు చేతులూపడం మొదలుపెట్టారు. తక్కినఅందరూ వారితో చేరారు. నాగుండెలు వేగంగా కొట్టుకోసాగాయి. అప్రయత్నంగా నాచేతులు పాతసైనికుని ఠక్కీలో సెల్యూట్ చేయడానికి నిబ్బరంగా పైకిలేవగానే 'డాన్‌జువాన్' బయలుదేరింది. నన్ను తీసుకువచ్చిన పడవ వెనుక వెనుకకు పోసాగింది. అదే సమయంలో దూరంగా మావిద్యుచ్ఛక్తిని సరఫరాచేసే యంత్రం చెవులు గింగురుమనే కూతపెట్టసాగింది. క్రమంగా క్యూలియన్ దూరం కాసాగింది.

ఒక చిన్నదీవిలో ఇరవైఐదు సంవత్సరాలు గడచిపోయాయి. ఏమిచేసినట్లు? అని నాలోనేనే అర్థంలేనిప్రశ్న వేసుకొన్నాను అప్రయత్నంగా! కాని, దానికి సమాధానం

నాలోనేవుంది. జీవితం ఏవిధంగా గడచినా, అది ఒకఅగాధం. దీనిని అర్థంచేసికొనడం కష్టం. కష్టంవచ్చినా, సుఖంవచ్చినా, ధైర్యంతో పోరాడుతూ ముందుకు సాగిపోవడమే మనపని.— ఈపాతికసంవత్సరాల అనుభవం నాకు నేర్పినపాఠమిదే - ఇరవై ఐదు సంవత్సరాలు కుష్టురోగుల కాలనీలో గడిపిన ఈ కుష్టురోగి తనలో మానవత్వమున్నదనే సంగతి ఎప్పుడూ మరచిపోలేదు. అది గుర్తించినమానవునికి జీవితం ఎప్పుడూ ఆనందమయమే అవుతుంది. క్యూలియన్! ఇకనాకుసెలవు!!—

## 29 వ ప్రకరణం

ప్రియమైన కేటీ,

బుధవారంనాడు నేను కార్విల్లె చేరుకున్నాను. ఆరోగ్య శాఖకి చెందిన ఒక నౌకరుద్వారా నీకీఉత్తరాన్ని పోష్టులో వేసే ఏర్పాటుచేశాను. నేను క్యూలియన్‌ని విడచి వెళ్ళిపోతూండగా వ్రాసిన ఈఉత్తరం నీకు సంతోషాన్ని ఇవ్వదనేసంగతి నాకు తెలుసును. నాజీవితంలో ఎక్కువభాగంగడిపిన ఈదీవిని విడిచి వెళ్ళడం నాకూ విచారంగానేవుంది. అయినా నేనిప్పుడున్న వింతవాతావరణంలో ఉత్తరంవ్రాయడానికి కొంత ఉత్సాహం గానేవుంది. ఈమార్చు మనిలాకి బయలుదేరిన 'డాన్‌జువాన్' యంత్రాల వింతధ్వనితో ప్రారంభమైంది. ఆతరువాత మనిలా నుండి శాన్‌ఫ్రాన్సిస్కోవరకూ మహాసముద్రాలలో పయనించే సైనికదళానికి చెందిన నౌకా యంత్రాలుకూడా అవింత వాతా

వరణాన్నే కల్పించాయి. ఒంటరిగా నాకేర్పాటుచేయబడిన గదిలో కూర్చొని ఆ వింతధ్వనిని వింటూనేవున్నాను. ఇప్పుడు నేను ప్రయాణంచేస్తున్న పొగబండి చక్రాలు మహావేగంతో నదులనీ, మైదానాలనీ, కొండలనీ, గుట్టలనీ, దాటి వెళుతూ "నేను ఇంటికి వెళుతున్నా......వెళుతూన్నా" అన్న వింత పాటకి తాళంవేస్తున్నట్లున్నాయి.

గడచిపోయిన నా జీవితాన్ని గురించి ఒంటరిగా కూర్చొని తలపోయడానికి నాకీప్రయాణంలో అవకాశం కలిగింది. జనన మరణ సమస్యలమధ్య అల్లాడే ఆరోజులగురించి తలచుకుంటే గుండె నీరుకావడంతప్ప మరేముంది? కేరిటా మనకు లభించిన సహాయం, కరుణ, వీటినితలచుకొంటే తక్కినవన్నీ ఒక్కసారిగా మనస్మృతినుంచి మాయమైపోతాయి.

జీవితంలో బాధతో, రోగంతో అనుదినం జీవన్మరణ సమస్యలమధ్య జీవించే మనబోటి రోగులయెడల దయామయులైన ఆ డాక్టర్లూ, నర్సులూ, అలసట అనేది లేకుండా, అనుక్షణం నిరాశఅన్నది మనలను చేరనీయకుండా ధైర్యవచనాలుచెప్తూ ఆ దారుణవ్యాధి తమకి సోకుతుందనే భయమైనా లేకుండా, ఎంతసేపూ పరులసేవకే తమజీవితాలను అంకితంచేయడం ఎంతో గొప్పవిషయం. ఇక నిరాశకి తావులేదులే కేరిటా, ఈమార్పుకి ప్రారంభాన్ని మన కళ్ళతో మనంచూసే అవకాశంకలిగింది. బ్రతికివుండగానే చావుతో సమానమైన ఈవ్యాధివ్యాప్తిని దాదాపు అరికట్టినట్లే వందలకొలది స్త్రీలూ, పురుషులూ,

వ్యాధి అరికట్టబడి ఈదీవినుంచి మామూలు ప్రపంచంలోనికి నిరంతరం వెళుతూండడం మనం చూస్తూనేవున్నాం. ఈవిధంగా విముక్తిపొందిన వారంతా మామూలు జీవితాలను గడుపుతూనే వున్నారు. ఈవిధంగా వీరంతా ఆదీవినుంచి వెళ్ళిపోతూంటే మనుష్యులను జీవచ్ఛవాలుగా చేసే ఈదారుణవ్యాధిని పూర్తిగా నివారించే ఆసుభదినంకూడా త్వరలోనే రాబోతున్నదని మన మిద్దరం ఆశించాం. ఎంతో ఓరిమితో, విశ్వాసంతో అహర హాలు పరిశోధనలు సాగించే ఈవైద్యులు ఇప్పుడుకాకపోతే పది ఏళ్ళకి, పన్నెండేళ్ళకి - ఆఖరికి నందఏళ్ళకైనా ఈ దారుణవ్యాధిని నిర్మూలించివేరుతారు!

నాకిప్పుడు ఎంతోసంతృప్తిగావుంది కేరెటా, నాదేశాన్ని- నేను ఎప్పుడు కళ్ళారా తిరిగిచూస్తానా అనే నాఅనుంగుదేశాన్ని- ఇప్పుడు ఈ రైలుకిటికీగుండా చూస్తున్నాను. కారాగారంలో బంధింపబడినప్పుడు - దానినుండి విముక్తికోసం ఇంటికోసం సాధారణంగా తహతహలాడుతారు. అలాంటి సమయంలో విముక్తిలభిస్తే కలిగే సంతోషాన్ని నేనిప్పుడు పొందుతున్నాను.

నేనున్న పెట్టెతలుపు నాకు ఆహారాన్ని తీసుకువచ్చి నప్పుడు మాత్రమే తెరుస్తారు. ఈపెట్టెలో ఎవరుప్రయాణం చేస్తున్నారో తెలిస్తే అందరూ భయపడుతారు కాని నేను పడే యమయాతన వారికేం తెలుస్తుంది? కాని అలాంటిది సంభవించకుండా తీసుకోవలసిన జాగ్రతలన్నీ అధికారులు తీసు కున్నారు.

రక్తమాంసాలతో శారీరకంగా నేనింకా కారాగారం లోనే వున్నాను. కాని నా "అంతరాత్మ" స్వేచ్ఛగా పచ్చని పొలాలలో; మైదానాలలో పట్టణాలలో విహరిస్తూంది. నలభై సంవత్సరాలక్రితం, యువకునిగా నాలోవుండే ఉత్సాహమే నాలో ఇప్పుడు కట్టలుతెంచుకొని ప్రవహిస్తూంది. ఇన్నాళ్ళుగా నేను అనుభవించినబాధ, భయం, ఆశానిరాశా.—ఇవన్నీ ఇప్పుడు నాదృష్టిలో దూరదూరంగా పోతూన్నాయి. రేపు ఈ రైలు బండీ, దానిలోవున్న నన్ను మోసుకొని నేనుజన్మించిన పట్టణంలో నుంచే సాగిపోతుంది !

చిన్నతనంలో టామ్, నేనూ చేపలుపట్టిన సెలయేరూ, కుందేళ్ళను పట్టడానికి పరుగులెత్తిన చిట్టడవులూ, అదృష్టముంటే ఈకళ్ళతో నేను చూడగలుగుతాను. పట్టణానికి చివరవుండే పొలాలు, నీటిని దాటగానే. ఆపట్టనానికి నీటిని సరఫరాచేసే ఎత్తైన నీటితొట్టె. రైల్వేస్టేషన్‌నుండి పట్టణానికి మధ్యగాపోయే వీధి, వీటికి సమీపంలోనే సగంకూలి పోతూన్న వాట్సన్‌తాత ఇల్లూ, ఈగలు ముసురుతూన్న అతనిగుర్రం, వెంకంతస్థుల 'మెజస్టిక్ హోటలు" త్వరత్వరగా నాకంటి ముందరే దాటిపోతాయి అయినా పీటిని చూడకుండా వదలిపెడతానా? చిన్నకొండ మీద గంగరేగి చెట్లమధ్యగావుండే మాఇంటిని, మా కుటుంబంలో మూడుతరాలవారికి ఆశ్రయమిచ్చిన మా ఇంటిని— సాధ్యమైనంతలో ఈ నాకళ్ళతో చూడటానికి ప్రయత్నిస్తాను.

గాజు తలుపులువేసివున్న ఆరైలు కిటికీకి నా ముఖాన్ని గట్టిగాఆన్చి, సువిశాలమైన మైదానాలను, అస్తమిస్తూన్న సూర్యుని జేగురురంగులో చూచాను. నేనుకన్న కలలు ఇప్పుడు నిజమౌతూన్నాయి ! బుద్ధిపూర్వకంగా నేనుచేసిన పనివల్ల, పన్నాగంవల్ల, యదార్ధంగా నేను చచ్చిపోయాననే నమ్మిన నావాళ్ళ ముఖాలన్నీ నాకు ప్రత్యక్షంగా గోచరిస్తూన్నాయి. మా అమ్మ ! ఒకనాటి ఉదయం ఆమెతో చెప్పనైనా చెప్పకుండా ఆమెకు కనపడకుండా, బయలుదేరి వెళ్ళిపోయాను. ఒకటి రెండు రోజులలో తిరిగి వస్తానని ఆమె అనుకొన్నది. అప్పుడే ప్రవేశిస్తూన్న వార్ధక్యచిహ్నాలు ఆమె ముఖంలో స్పష్టంగా కనిపిస్తూన్నాయి. ఆమెకళ్ళు సూటిగా నాకళ్ళలోనికి చూస్తున్నాయి. కాని ఆమెకి యదార్ధవిషయం ఇప్పుడు తెలిసిపోతుంది. అయినా నేను ఏమీ సమ్మలేకుండా వున్నాను.

ఇంకా జీవించివున్న మేబెల్, జేన్‌లిద్దరూ మిథ్యగాని ఈలోకాన్నివిడచి వెళ్ళిపోయిన అమ్మా, నాన్నా, టామ్ ... యదార్ధంగా వీరంతా నాతో వున్నట్లేవుంది. ఏమిటి చెప్పా ఈవిపరీతం—కేరిటా వీరంతా నిన్నెంతో ప్రేమించి వుండేవారు సుమా.

కలకలలాడే ఆ చిన్నముఖంతో ఎంత అందంగా వుంటావు కేరిటా. నా ప్రాణంతో సమానమైన నిన్ను వచ్చేటప్పుడు నాతో మా ఇంటికి తీసుకురావాలని అనుకొనేవాణ్ణి. కాని నన్ను ప్రపంచపు ఆవలిభాగంలోనేవదలి రావలసివచ్చింది !

కేరిటా. ప్రియమైన కేరిటా, నేను అలసిపోయాను. ఇక నిద్రపోవాలి—సెలవు—

"నెడ్"

దక్షిణప్రాంతపు ఒక వార్తాపత్రికనుండి.—

న్యూఆర్లియన్స్, లూసియానా: నిన్నరాత్రి ఎక్స్‌ప్రెస్ రైలుస్టేషన్‌లోనికి రాగానే "నెడ్‌లాంగ్‌షర్డ్" అనేవ్యక్తి శవంకను గొనబడింది స్పెయిన్, అమెరికాయుద్ధంలో పాల్గొని, ఆ తరు త కుష్టువ్యాధికి గురియైన నెడ్‌లాంగ్‌షర్డ్ యుద్ధరంగంలో పిన ధైర్యసాహసాలు ప్రశంసనీయమైనవి. ఫిలిప్పైన్ దీవుల స్త్రీ కుష్టురోగులకాలనీ అయిన కుల్యాలియన్‌నుండి, కార్విల్లీ ఫెడరల్ కుష్టురోగ చికిత్సాలయానికి నెడ్‌లాంగ్‌షర్డ్‌ని ప్రయాణండగా ఈసంఘటన జరిగింది. ప్రయాణీకుల భద్రతనిమి చివరివరకూ అతడు ఒకప్రత్యేకస్థలంలో వుంచబడ్డాడు.

రైలు లూసియానా చేరిన కొద్దిసేపటిలో నెడ్ మర నినట్లు తెలిసింది. ఆ క్రితం రోజున నెడ్ మామూలుగానే డు; కాని అతనిని తీసుకువచ్చే రైలు తాను పుట్టిన ఊరు వెళుతూండగా, తన ఇంటినిచూచి చాలా ఉద్రేకపడ్డాడు. రాల తరబడి తీవ్రవ్యాధికి గురియైన నెడ్‌లాంగ్‌షర్డ్ నం, ఈ వుద్రేకానికి తట్టుకోలేకపోవడం మూలాన ఈ నికి గురియైనాడు" అని ఈ ప్రయాణంలో మొదటి

...చీ నెడ్ లాంగ్‌ఫర్డ్‌ని అనుసరించి ప్రయాణం చేస్తున్న ఫెడ
... ఆరోగ్యసంస్థకి చెందిన ఒక అధికారి చెప్పారు.

సైనికగౌరవాలతో లాంగ్‌ఫర్డ్ భౌతిక దేహానికి బాటన్
...ంజ్‌లో వున్న ప్రత్యేక శ్మశానంలో అంత్యక్రియలు జరుగుతాయి
ప్రదేశంలోనే అనేకమంది యుద్ధవీరులు భూస్థాపితం చేయ
...ారు.

— సమాప్తము. —

[illegible] ప్రింటర్సు, మచిలీపట్నం



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B153 |
| పుస్తకం పేరు | ఒంటరి జీవితాలు |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NC |
| వెనుక అట్ట | NC |
| మొత్తం పేజీలు | 205 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Rehama |
| పేజీలు విడదీసినది | Ruksana |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |